# ఆత్మవిద్యావిలాసము

- శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వామి

## తొలిపలుకు

శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారు గొప్ప యోగి; పరమభక్తాగ్రేసరుడు; గొప్ప ఆత్మజ్ఞాని; ఒక మహాత్ముడు; గొప్ప అవధూత. కీర్తనా సాహిత్యంతో భారతీయ ఆధ్యాత్మిక రంగంలో ఒక పవిత్ర స్థానాన్ని అలంకరించిన అపారప్రజ్ఞాశాలి.

సుమారు 300 సంవత్సరాలకు పూర్వం ఆంధ్రదేశం నుండి తమిళనాడులోని కుంభకోణం సమీపంలోని కావేరీ నదీ తీరాన ఒక చిన్న గ్రామంలో స్థిరపడిన సోమసుందర్ అవధాని, పార్వతీదేవి దంపతులకు లేక లేక కలిగిన సంతానమే స్వామివారు.

స్వామి వారి అసలు పేరు శివరామకృష్ణ. చిన్నతనంలో శ్రీధర వేంకటేశ అయ్యరు వద్ద ప్రాథమిక విద్యను అభ్యసించారు శివరామకృష్ణ. చిన్నతనంలోనే వైరాగ్య భావన కలగటంతో తల్లిదండ్రులు భయపడి 17 సంవత్సరాల వయస్సులోనే వివాహం జరిపించారు. కొంత కాలానికి యుక్తవయస్కురాలైన అర్ధాంగి పార్వతీదేవి కొరకు అత్తవారింటికి వెళ్ళాడు. రాత్రి ప్రొద్దుపోయింది. ఆకలి వేస్తున్నది. వంట గదివైపు వెళ్ళి లోపలికి అడుగు పెట్టబోతుండగా అత్తగారు, **"కొంచెం సేపు లోపలికి రాకండి, బయటనే ఉండండి"** అన్నది. అంతే ఆ మాటలు తనకు ఏదో సందేశంలాగా అనిపించింది. 'గృహస్థ జీవితంలోకి రావద్దు, బయటనే ఉండి జ్ఞానాన్ని పొందండి' అన్నట్లుగా భావించాడు శిరామకృష్ణ. అంతే. సర్వాన్నీ త్యజించి, జ్ఞానాన్ని అన్వేషిస్తూ విశాల ప్రపంచంలోకి పయనమయ్యాడు.

అలా అన్వేషిస్తూ వెళ్ళి గొప్ప తపోనిధియైన పరమశివేంద్రస్వామిని

ఆశ్రయించాడు. సమస్త శాస్త్రాలను ఆపోశనపట్టాడు. తర్కంలో గొప్ప ప్రజ్ఞాశాలి అయ్యాడు. అతడి అనర్గళ వాక్చాతుర్యానికి ప్రతి వాదులు ఆశ్చర్యచకితులయ్యేవారు. కొందరు సోదర శిష్యులు అసూయా గ్రస్థులై గురువు వద్ద మొరపెట్టుకున్నారు. దానితో ఒకనాడు గురువు పిలిచి, “శివా! ఇతరులను నీ వాక్చాతుర్యంతో అవాక్కులను చేస్తున్నావు కాని నీ వాక్కును అదుపులో పెట్టుకోలేక పోతున్నావు గదా!” అన్నారు.

గురుదేవుని ఆ మందలింపును సదుపదేశంగా భావించి ఆనాటి నుండి మౌన వ్రతాన్ని అవలంబించాడు. అతడి భక్తి, జ్ఞాన, వైరాగ్య సంపదను గమనించి పరమశివేంద్ర గురుదేవులు శిష్యునికి సన్యాస దీక్షను ప్రసాదించి **సదాశివబ్రహ్మేంద్రులుగా** పేరు పెట్టారు.

అ తరువాత సదాశివబ్రహ్మేంద్రుల వారు గొప్ప తపస్సును చేసి అనేక సిద్ధులను పొందారు. దేహస్పృహ లేకుండా, ఆహార విహారాలు పట్టించుకోకుండా యోగిలా, అవధూతలా ప్రాపంచిక అవధులను అధిగమించి, ఆత్మస్థాయిలో ఉండిపోయారు.

ఆయన భక్తి రసప్రధానమైన కీర్తనలను రచించి గానం చేస్తూ ఉండేవారు.

**మానస సంచరరే, బ్రహ్మణి మానస సంచరరే.......**

**పిబరే రామరసం, రసనే పిబరే రామరసం.....**

**భజరే గోపాలం, మానస భజరే గోపాలం....**

లాంటి అనేక భక్తిరస గుళికలను సమాజానికి అందించారు.

ఒక సారి భక్తి తన్మయత్వంతో దిగంబరంగా ‘మానస సంచరరే బ్రహ్మణి మానస సంచరరే...’ అంటూ పారవశ్యంతో కీర్తనలను గానం చేసుకుంటూ నడిచిపోతున్నాడు. అనేక మంది భక్తి భావంతో ఆయనను అనుసరిస్తూ వెళుతున్నారు. ఎదురుగా వచ్చేవారు భక్తితో ఆయన పాదాలకు మ్రొక్కి ఆయన వెనుక వస్తున్నారు. అయితే ఇదేమీ ఆయనకు తెలియదు. బాహ్యస్మృతి లేనేలేదు.

సాధారణంగా మహాత్ములైన వారిని బాధలుపెట్టే దుష్టులు అప్పుడూ ఉన్నారు; ఇప్పుడూ ఉన్నారు; ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. ఒక నవాబుకు ఇదంతా చూచి ఒళ్ళుమండింది. పాట ఆపమని కేకలు వేశాడు. కాని అతడి మాటలేవీ ఆయనకు వినిపించలేదు. ఆ నవాబు కోపంతో స్వాముల వారిని వెంబడించి, కోపంతో కత్తిదూసి ఒక్కవేటు వేశాడు. చెయ్యి తెగి క్రింద పడిపోయింది. రక్తం ఏరులై పారింది. స్వామి వారికి ఇదేమీ తెలియదు. ఆయన మామూలుగానే పారవశ్యంతో గానం చేసుకుంటూ వెళుతున్నాడు, ఇది గమనించిన ఆ దుష్టుడు నిర్ఘాంతపోయాడు. భీతి చెందాడు. అతడిలో పరివర్తన కలిగింది. పరుగు పరుగున వెళ్ళి స్వామి పాదాలను చుట్టేసుకొని క్షమాపణ కోరుకున్నాడు, పశ్చాత్తాపంతో పరితపించి పోయాడు. దానితో బాహ్య స్మృతిలోకి వచ్చాడు స్వామి. ఏమని అడిగాడు నవాబును. చెయ్యినరికిన సంగతిని చెప్పాడు నవాబు. అప్పుడు చూచుకున్నాడు తన చేతివంక. ఆ తెగిపడిన చేతిని తెమ్మని యధాస్థానంలో పెట్టుకొని ఎప్పటిలాగా గానం చేసుకుంటూ వెళ్ళాడు. నవాబు పశ్చాత్తాపంతో పరివర్తన చెంది, సర్వాన్నీత్యజించి తన శేష జీవితాన్ని భగవదారాధనలో గడిపాడు. ఇది ఆయన జీవితంలో జరిగిన ఒక అద్భుత, ఆశ్చర్యకర సంఘటన.

ఇలాంటిదే మరొక సంఘటన జరిగింది. నెరూరుకు సమీపాన కావేరీనది మధ్యలో ఉన్న కొండమీద ధ్యానంతో కాలం గడుపుతున్నాడు సదాశివుడు. ఒక సారి పరిపూర్ణ ధ్యానమగ్నుడై, ప్రపంచస్పృహ ఏమాత్రం లేకుండా ఉన్న సమయంలో కావేరీనది ఉద్ధృతంగా పొంగి ప్రవహిస్తున్నది. ఆ ప్రవాహవేగానికి చుట్టూ ఉన్న వారు భయపడి సమీపంలోని ఒడ్డుకు పరుగులు తీస్తూ స్వామివారిని కూడా కేకవేసి రమ్మన్నారు. ఆయనకు ఇదేమీ వినిపించలేదు. కూర్చున్నచోటు నుండి కదలలేదు. ప్రవాహం అంత కంతకు ఉద్ధృతమయింది. ఆ ప్రవాహ ఉరవడిలో ఆయన చాలా దూరం కొట్టుకపోయి మేట వేసిన ఇసుకలో కూరుకుపోయాడు. అందరూ క్రమంగా ఈ సంఘటనను మరిచి పోయారు.

దాదాపు ఆరు నెలల తరువాత ఒక రోజున ఇసుక తోలుకుపోయేవారు పారలతో ఇసుకను త్రవ్వి బండ్లకు ఎత్తుతున్నారు. ఒక పారకు రక్తపు మరకలు అంటినవి. ఏమిటా? అని ఆశ్చర్యంతో వారు జాగ్రత్తగా ఇసుకను తొలగించి చూస్తే అక్కడ ఈ మహాత్ముడున్నాడు. ఆయన గాఢ నిద్రనుండి మేలుకున్నట్లుగా మేలుకొని లేచి వెళ్లిపోయాడు. ఈ సంఘటనతో ఆయన యోగీశ్వరుడు అని అందరికీ అర్థమై పోయింది.

ఈ అపూర్వ సంఘటన గురించి తెలుసుకొని ఆశ్చర్యచకితుడైన అప్పటి మహారాజు విజయరఘునాధ తొండమాన్ సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారిని తన ఆస్థానానికి ఆహ్వానించి గౌరవించాలని భావించాడు. కాని స్వామి వారు మౌనాన్ని వీడలేదు. ఆహ్వానాన్ని మన్నించలేదు. అయితే మహారాజు కోరికప్రకారం అక్కడి ఇసుకపై శ్రీ దక్షిణామూర్తి మహామంత్రాన్ని వ్రాశాడు. పవిత్రమైన ఆ ఇసుకను దివ్య ప్రసాదంగా భావించిన మహారాజు తన ఉత్తరీయంలో మూట గట్టుకొని తన సౌధానికి తీసుకువెళ్ళాడు. దానిని రాజభవనంలో భద్రంచేసి పూజించేవాడు. ఈ నాటికీ పుదుక్కోటలో సదాశివబ్రహ్మేంద్రస్వామి చేత పవిత్రం గావించబడిన ఆ ఇసుక ఆరాధించబడుతూనే ఉన్నది.

ఒకసారి పొలాలలో తిరుగాడుతూ ఉన్న సదాశివునిపై పొరపాటున రెండు గడ్డి మోపులు పడ్డాయి. తొందరలో దీనిని గమనించని రైతులు మరిన్నీ గడ్డిమోపులను వాటిపై కుప్పగా వేశారు. దాదాపు 8 నెలల తరువాత ఆ గడ్డిమోపులను ఖాళీచేయగా వాటి అడుగున ప్రశాంతంగా విశ్రమించిన ఆ మహయోగిని చూడటానికి ఆ గ్రామ ప్రజలంతా తండోప తండాలుగా వచ్చి చూచి ఆశ్చర్యచకితులయ్యారు.

ఇటువంటి మరికొన్ని సంఘటనలు కూడా జరిగాయి. కాని ఆయన మాత్రం నిరామయంగా, నిర్లిప్తంగా ఉండిపోయేవారు. సంచార యాత్రలు ముగించుకొని నెరూరుకు చేరాడు సదాశివబ్రహ్మేంద్రస్వామి. తన పార్థివ దేహాన్ని

వదిలివేయాలని సంకల్పించుకున్నాడు. అందుకే తన యోగశక్తితో మైసూరు, తంజావూరు, పుదుక్కోట ప్రభువులకు ఈ విషయాన్ని తెలియజేసి సమాధినిర్మాణానికి కొన్ని సూచనలు చేశాడు. అనుకున్న ముహూర్తానికి సమాధి కోసం త్రవ్విన గోతిలో యోగముద్రలో సుఖాసీనుడయ్యాడు. కర్పూరం, విభూతి, పసుపు, ఉప్పు, ఇటుకపొడి, వివిధ చూర్ణాలరాశిలో ఆయన దేహం కనుమరుగైంది.

సదాశివబ్రహ్మేంద్రుల సంకల్పానికి అనుగుణంగా 9వ రోజున ఆ సమాధిపై బిల్వ వృక్షపు మొలక అంకురించింది. 12వ రోజున కాశీ నుండి బాణలింగం వచ్చింది. సమాధికి మూడు గజాల దూరంలో శివలింగం, ఆకాశాన్ని తేరిపార జూస్తూ బిల్వవృక్షం నిలిచాయి.

సదాశివబ్రహ్మేంద్ర స్వాముల వారి కీర్తనలు ఆపాత మధురాలు, ఆలోచనామృతాలు.

1. పొంగి పొరలే భక్తి భావం జాలు వారేవి కొన్ని.
2. అద్వైతానుభవంతో తొణికిసలాడేవి కొన్ని.
3. తన మనసుకు తానే బోధచేసుకున్నవి కొన్ని.
4. తన గురుదేవులు పరమశివేంద్రుని స్మరించినవి కొన్ని.

శ్రీ సదాశిబ్రహ్మేంద్రులు రచించిన గ్రంథాలు కొన్ని మాత్రమే.

**1. బ్రహ్మతత్వ ప్రకాశిక, 2. యోగ సుధాకరం, 3. శివమానసపూజ.**

**4. ఆత్మ విద్యా విలాసం.** ఈ 4 వేదాంత గ్రంథాలు ఆధ్యాత్మిక సాహిత్యంలో ఆణిముత్యాలు.

ఆత్మ విద్యావిలాసం 43 శ్లోకాలతో ఉన్న చిన్న వేదాంత గ్రంథం. ఇది స్వతంత్ర రచన. **ఇది ఉపనిషత్తుల సారమేగాదు, ఆయన అనుభవసార మంతా ఇందులో నిక్షిప్తం చేయబడింది.** ఈ గ్రంథానికి ఒక విశిష్టత ఉంది. ఏమిటంటే – ఇది అతి తక్కువ స్థాయిలో ప్రారంభించబడి; క్రమంగా ఆత్మాను భూతిని

పొందుటకు తగిన మార్గాలను, సాధనలను, ఉపాయాలను తెలియజేయుటయే గాక ఆత్మానుభూతినొందిన శిష్యుని అనుభవాలను కళ్ళకు కట్టినట్లు చిత్రించబడిన గ్రంథం ఇది. **ఇటువంటి రచన ఆత్మానుభూతి నొందిన మహాత్ములకే సాధ్యం.**

ఈ గ్రంథం పేరు 'ఆత్మవిద్యావిలాసం'. ఈ పేరు ఈ గ్రంథానికి ఎలా తగి ఉన్నది?

**ఆత్మానుభూతిలో విలాసంగా విహరించేంత ఎత్తుకు తీసుకొని వెళ్ళే విద్య (జ్ఞానం) ఇందులో నిక్షిప్తం చేయబడింది గనుక ఆత్మ విద్యావిలాసం అనే పేరు ఎంతైనా తగి ఉన్నది.**

ఈ గ్రంథం ఆధ్యాత్మిక రంగంలో ఇప్పుడే ప్రవేశించిన వారికీ ఉపయోగపడుతుంది, ఇంతకు ముందే ప్రవేశించి కొంతదూరం ప్రయాణించిన వారికీ ఉపయోగపడుతుంది; అలాగే ఈ రంగంలో అత్యున్నత స్థానంలో ఉన్నవారికీ ఉపయోగపడుతుంది. **ఒక్క మాటలో చెప్పాలంటే ఈ గ్రంథం సర్వమానవాళికీ చక్కగా ఉపయోగపడుతుంది.**

శ్రీ శంకర భగవత్పాదులవారి ప్రకరణ గ్రంథాలలాగానే ఇందులో కూడా వేదాంతసారం – ఉపనిషత్తులసారం అంతా నిండి ఉన్నది. సరిగ్గా అవగాహన చేసుకొని, ఆ మహాత్ముడు చూపిన మార్గంలో నాలుగు అడుగులు వేసినాచాలు మనను తప్పక తరింపజేస్తుందీ గ్రంథం. ముఖ్యంగా గురువుపట్ల చూపే భక్తి విశ్వాసాలే శిష్యులను ఉన్నత శిఖరాలకు చేరుస్తాయనే విషయాన్ని ఎంతో గట్టిగా చెప్పారు. చెప్పటమే కాదు, అది ఆయన హృదయపు లోతులనుండి వచ్చిన భావమే. అందుకే ఆయన కీర్తనలన్నింటిలోను చివరి పాదం గురుపాదపద్మాలను వదలకూడదని, అట్టి వారికే ముక్తి కరతలామలకమని తెలియజెప్పటం జరిగింది.

అట్టి మహా మహితాత్ముని, యోగిపుంగవుని, అవధూతను మనం మనసారా స్మరించి, ఆయన అనుగ్రహం మనపై వర్షించాలని కోరుకుంటూ ఈ గ్రంథాన్ని శ్రద్ధతో శ్రవణం చేసి, మననం చేసి, ఆత్మలో రమిస్తూ విలాసంగా విహరిస్తూ, ఆత్మానందాన్ని అనుభవించుదాం.

ఈ గ్రంథం ఎవరి దృష్టికి వస్తుందో వారు ఆధ్యాత్మిక రంగంలో గొప్ప అదృష్టవంతులని నా దృఢ అభిప్రాయాన్ని తెలియజేస్తూ, సద్గురు కృపాకటాక్ష వీక్షణాలు మనందరిపై ప్రసరించాలని కోరుకుంటూ, ఈ గ్రంథం ద్వారా మోక్ష సౌధాగ్రాన్ని చేరుకోవాలని, చేరుకోగలరని ఆశిస్తూ-ఆశీర్వదిస్తూ...

– దేవిశెట్టి చలపతిరావు.

గ్రంథ వ్యాఖ్యాత.

# ఆత్మ విద్యా విలాసము

- శ్రీసదాశివబ్రహ్మేంద్రస్వామి.

శ్లో॥ యత్ పాదపద్మ మకరంద జుషాం నరాణాం
సంసార ఘోర భుజగాన్నభవేత్స్మ భీతిః।
సచ్చిద్ఘనం సకల సౌఖ్య లవాంబు రాశిం
శ్రీదక్షిణాభిముఖమూర్తి మజం భజే ఽ హం॥ 1

**ప్రతిపదార్థం :-** యత్ పాదపద్మ = ఎవరి పాదపద్మములయందలి; మకరంద = తేనెను; జుషాం = ఆస్వాదించిన; నరాణాం = మానవులకు; సంసార ఘోర భుజగాత్ = సంసారమనే భయంకర సర్పంవల్ల; భీతిః = భయం; నభవేత్స్మ= కలగదో; (అటువంటి) సత్‌చిత్‌ఘనం = సత్తు చిత్తు మూర్తి; సకలసౌఖ్య = అన్ని ప్రాపంచిక సుఖాలు; లవాంబురాశిం = తనలో లేశ మాత్రంగా ఉన్న ఆనందసాగరం; శ్రీదక్షిణ అభిముఖమూర్తిం = దక్షిణంవైపుగా ముఖం ఉన్న మూర్తిని; అజం = పుట్టుకలేని వానిని; అహం భజే = నేను ఆరాధిస్తాను.

**భావం :-** ఎవరి పాద పద్మములయందలి తేనెను ఆస్వాదించిన మానవులకు సంసారమనే భయంకరసర్పం వల్ల భయం తొలగిపోతుందో అట్టి సచ్చిదానందమూర్తి, సకల సుఖాలు తనలో లేశమాత్రంగా ఉన్న ఆనందసాగరుడు, పుట్టుకలేని దక్షిణామూర్తిని నేను ఆరాధిస్తాను.

**వ్యాఖ్య :-** ఏ గ్రంథాన్నైనా ప్రారంభించేటప్పుడు దైవ స్మరణ చేయడం సాంప్రదాయం. ఆధ్యాత్మిక గ్రంథాలను ప్రారంభించేటప్పుడు ముందుగా గురుస్మరణచేసి – ఆ తర్వాత దైవస్మరణ చేసి గ్రంథాన్ని ప్రారంభిస్తారు. 'ఆత్మ విద్యావిలాసం' అనే ఈ ప్రకరణ గ్రంథం శ్రీ సదాశివబ్రహ్మేంద్రస్వాముల వారిచే రచింపబడ్డ అద్భుత ఆధ్యాత్మిక గ్రంథం. ఇందులో చెప్పబడ్డ జ్ఞానం ఆత్మజ్ఞానం; ఆత్మవిద్య; బ్రహ్మవిద్య. కనుక ఈ గ్రంథంలో కూడా గురుస్మరణ – దైవస్మరణ తప్పక ఉండితీరాలి. సదాశివబ్రహ్మేంద్రస్వాముల వారి ఇష్టదైవం సాక్షాత్

పరమశివుడే. పరమశివుడేఐన దక్షిణామూర్తియే. ఆయనే గురువు. ఆయనే దైవం. కనుకనే శ్రీ దక్షిణామూర్తి యొక్క స్మరణతో ఈ గ్రంథం ప్రారంభించ బడుతున్నది.

**(ఎ) శ్రీ దక్షిణాభిముఖమూర్తి :–** పరమశివుడే దక్షిణాభి ముఖంగా కూర్చొని ఉన్నమూర్తి. ఆయన ఎందుకలా దక్షిణాభిముఖుడై కూర్చున్నాడు? 'శివరహస్యం' అనే గ్రంథంలో దీనికి సమాధానంగా ఒక కథ చెప్పబడి ఉన్నది. ఆ కథ ఇది–

సృష్టి ప్రారంభంలో బ్రహ్మదేవుడు మొట్టమొదట తన మానస పుత్రులుగా సనక–సనందన – సనత్కుమార – సనత్సుజాతులనే నలుగురు పుత్రులను సంకల్ప మాత్రాన సృష్టించాడు. వారు పుట్టగానే బ్రహ్మదేవుడు వారిని సృష్టికార్యం ప్రారంభించమని ఆదేశించాడు. ఐతే పరమ వైరాగ్య మూర్తులైన ఆ మహర్షులు అందుకు నిరాకరించి కొందరు దేవతలతోను, ముని గణాలతోను కలసి నందన వనంలో ఉంటున్నారు. వారు జ్ఞానము నందు ఆసక్తి గలవారై ఎవరు తమకు జ్ఞానబోధ చేయగలరా? అని ఆలోచిస్తూన్నారు. అంతలో నారదుడు వచ్చాడక్కడికి. బ్రహ్మోపదేశాన్ని చేయటానికి బ్రహ్మకన్న అర్హులు ఎవరున్నారు? అక్కడికే పోదాంపదండి! అని వారిని బ్రహ్మదగ్గరకు బయలు దేర దీశాడు. దేవగణాలతో కలసి మహర్షులంతా సత్యలోకానికి వెళ్ళి బ్రహ్మను దర్శించారు. అక్కడ బ్రహ్మదేవుడు తనకు సమీపంగా కూర్చొని మృదు మధురంగా వీణవాయిస్తూ పాటపాడుతున్న సరస్వతీ దేవిని చూస్తూ "ఆహా! ఓహో! అంటూ తన్మయం చెందిపోతున్నాడు. వచ్చిన మునిగణాలను కూడా గమనించలేదు. "ఆడదాని పాటకు ఆనందిస్తూ – తాళం వేస్తూ తన్మయం చెందే ఆయ్యగారు ఆధ్యాత్మతత్వాన్ని మనకేం బోధించగలుగుతారు?" అని అనుకొని మహర్షులంతా వైకుంఠానికి బయలు దేరారు.

ఏడుద్వారాల కవతలగా ఎక్కడో లోపల సౌధంలో ఉన్నాడు శ్రీమహావిష్ణువు. ఎక్కడికైనా వెళ్ళాలంటే చొరవగలిగిన వాడు గనుక నారదుడు "నేను వెళ్ళి చూసి వస్తానుండండి" అని లోనికి వెళ్ళాడు. వెళ్ళిన వాడు వెళ్ళినట్లే వెంటనే తిరిగి వచ్చాడు నారదుడు. నారదా! ఏమైంది? వెంటనే తిరిగి వచ్చావు? అని

అడిగారు మునులు. "ఏమని చెప్పను? అక్కడ సత్యలోకంలో అమ్మగారు కాస్త దూరంగా కూర్చొని పాటలు పాడుతుంటే – ఇక్కడ అమ్మగారు ఏకంగా అయ్యగారి ప్రక్కలోనే కూర్చుని పాదాలొత్తుతున్నది. ఇది మరీ అన్యాయంగా ఉన్నది. కాంతామణి కటాక్ష వీక్షణాలకై క్రీగంట ఎదురుచూస్తూ ఉన్న ఈ సంసారి మనకేం తత్త్వాన్ని బోధిస్తాడు? అసలు ఈ వైకుంఠ వైభవం చూడండి. ఎలాగుందో? చాలుచాలు – ఇక ఆ కైలాస పతియే మనకు దిక్కు. పోదాం పదండి! ఆ పరమశివునే ఆశ్రయిద్దాం" అని నారదుడు అనటంతో అందరూ హిమాచలం వైపుగా ప్రయాణం చేసి కైలాస పర్వతాన్ని అధిరోహించారు. తీరా అక్కడకు వెళ్ళిచూస్తే ఇంకేముంది? పరమశివుడు అర్ధనారీశ్వరుడై ఆనందతాండవ నృత్యం చేస్తున్నాడు. విష్ణువు డోలు వాయిస్తుంటే బ్రహ్మదేవుడు తాళం వేస్తున్నాడు. ఆ పరవశంలో పరమశివుడు వచ్చిన వారిని గమనించనే లేదు. మహర్షులంతా అదిచూచి నోటిమీద వ్రేలు వేసుకున్నారు. ఓహో! ఇతడు వారికంటే ఘనుడు. గొప్ప స్త్రీలోలుడు. బ్రహ్మదేవుడు స్త్రీని తాకకుండా దూరంగా కూర్చోబెట్టుకుంటే – విష్ణువు తన ప్రక్కలోనే కూర్చోబెట్టుకొని తాకుతూ ఉన్నాడు. ఈ పరమశివుడేమో ఏకంగా శరీరంలోనే ఇముడ్చుకొన్నాడు. ఇది మరీ ఘోరం – అంతా స్త్రీలోలురే. చాలు చాలు పదండి! అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

పరమశివుడు గమనించాడిదంతా. అయ్యో! స్త్రీలతో కలిసి ఉన్నంత మాత్రాన జ్ఞాన శూన్యులని భావించి త్రిమూర్తులనే తిరస్కరిస్తున్నారే. ఏమి వీరిభ్రమ? అని నొచ్చుకొని తీవ్ర వైరాగ్యవంతులు, జిజ్ఞాసాపరులు ఐన ఈ మహర్షులకు జ్ఞానాన్ని బోధించగలవారెవరు? అని చింతించి ఒక నిర్ణయానికి వచ్చి, 'తపస్సు చేసుకోవాలి' అనే నెపంతో పార్వతిని పంపించి వేసి, దయామయుడైన ఆ పరమశివుడు మహర్షులు వెళ్ళే మార్గంలో – మానస సరోవర ఉత్తర భాగంలో ఉన్న ఒక వటవృక్షం క్రింద దక్షిణాభిముఖుడై, యువకునిగా, చిన్ముద్రను ధరించి ప్రశాంత వదనంతో మౌనంగా కూర్చొని ఉన్నాడు. ఆయనే సద్గురు శ్రీదక్షిణామూర్తి. ఆయనే సదాశివబ్రహ్మేంద్రులకు ఇష్టదైవం. దైవమే గురువు; గురువేదైవం అనటంలో గురువును ఇష్టదైవం లాగా ఆరాధించే వానికి ఆత్మజ్ఞానం అవగత మౌతుంది అని భావం.

1. గురువును దైవంగా భావించి పూజించే వారికే ఆత్మజ్ఞానాన్ని పొంది, ఆత్మానుభూతిని పొందే అర్హత వస్తుందని – గురుగీత చెబుతున్నది.

**పరమశివుడు – దక్షిణాభిముఖుడెందుకయ్యాడు?**

పరమశివుడు మహర్షులకు జ్ఞానాన్ని బోధించదలచి దక్షిణాభిముఖుడై వట వృక్షంక్రింద కూర్చున్నాడు అని చెప్పుకున్నాం. అయితే దక్షిణాభిముఖుడే ఎందుకయ్యాడు? ఉత్తరాభిముఖులైన జిజ్ఞాసాపరులకు జ్ఞానాన్ని బోధించేందుకే. మరి వారెందుకు ఉత్తరాభిముఖులే అయి ఉంటున్నారు? అసలు ఈ ఉత్తర దక్షిణాలు – తూర్పు పడమరలు సూర్యగమనం వల్ల ఏర్పడే దిక్కులేనా? కాదు. వీటికి ఆంతర్యంగా గొప్ప అర్థం ఉంది.

ప్రతి మానవుడు బుద్ధిని కలిగి ఉన్నాడు. అయితే ఆ బుద్ధిలోని తెలివి అందరిదీ ఒకే రకంగా ఉండదు. కనుకనే వారి ప్రవర్తన కూడా ఒకే రకంగా ఉండదు. ఎవరి బుద్ధిలో ఎటువంటి లక్ష్యం ఉంటుందో వారి నడక–ప్రయాణం కూడా ఆ లక్ష్యం వైపుగానే ఉంటుంది. వారి వారి నడతలను బట్టి మానవులను నాలుగు విధాలుగా విభజించవచ్చు.

1) కొందరు మానవులు తమ తమ పుట్టు పూర్వోత్తరాలను, తమ వంశచరిత్రను, పూర్వీకుల గొప్పతన్నాన్ని, జరిగిపోయిన విషయాలను తలచుకుంటూ మురిసిపోతూ ఉంటారు. వీరే పూర్వాభిముఖులు. అంటే తూర్పు దిక్కుకు తిరిగినవారు అని. (పూర్వ = తూర్పు).
2) మరి కొందరు మానవులు తమ భవిష్యత్తును గురించి ఊహించుకుంటూ, రాబోయే వాటికోసం ఎదురు తెన్నులు చూస్తూ, ఎప్పుడూ జరగబోయే వాటి గురించే ఆలోచిస్తారు. వీరు పశ్చిమాభిముఖులు. అంటే పడమర దిక్కుకు తిరిగినవారు అని. (పశ్చిమం = పడమర).
3) చాలామంది మానవులు ప్రపంచ ప్రమేయాలలో ఇరుక్కుపోయేవారు. జీవితం–ప్రపంచం – సుఖాలు – భోగాలు – సంపాదన – అనుభవించటం అంటూ ఇందులోనే కూరుకుపోయేవారు. వీరే దక్షిణాభిముఖులు. అంటే దక్షిణదిక్కుకు తిరిగిన వారు అని.

4) ఇక చాలా కొద్దిమంది మాత్రం - పూర్వ జన్మలలో చేసుకున్న పుణ్యం కారణంగా, పెద్దలయొక్క, మహాత్ముల యొక్క సేవ చేసిన కారణంగా ఈ ప్రపంచ పరిమితులను దాటి పోయి - సంసార జనన మరణ దుఃఖాలనుండి తరించి ముక్తులు కావాలని కోరుకొనే వారు. వీరే ఉత్తరాభిముఖులు. (ఉత్+తర) తరించిపైకి పోవాలనుకొనేవారు.

ఇలా 4 రకాలైన మార్గాలలో ప్రయాణించే మానవుల యొక్క స్థితిని తెలియజేసేవి ఈ 4 దిక్కులు.

ప్రపంచం నుండి తరించి బయట పడాలనుకొనే ముముక్షువులే ఉత్తరాభిముఖులు గనుక, అక్కడి మునులు - మహర్షులు అందరూ జ్ఞాన పిపాసులు గనుక, వారు ఉత్తరాభిముఖులు అని చెప్పటం జరిగింది. ఉత్తరాభిముఖులైన మహర్షులకు జ్ఞాన బోధచెయ్యాలి గనుక పరమేశ్వరుడు దక్షిణాభిముఖుడయ్యాడు.

అట్టి దక్షిణామూర్తి 'అజం' - అంటే పుట్టుకలేనివాడు. అట్టి పరమాత్మను 'అహంభజామి' నేను ఆరాధిస్తున్నాను - అని గ్రంథాన్ని ప్రారంభిస్తున్నారు శ్రీ సదా శివబ్రహ్మేంద్రస్వాముల వారు. గురువును, దైవాన్ని ఇలా ఎందుకు ఆరాధించాలి? తరించాలనుకొనే సాధకులు - లేదా మముక్షువులు తమంతటతాముగా తరించలేరు. వారికి గురువుయొక్క ఉపదేశం కావాలి, దైవానుగ్రహమూ కావాలి. అందుకే గురుస్మరణ - దైవ స్మరణ.

**(ఎ) ఎలా ఆరాధించాలి గురువును?**

యత్ పాదపద్మ మకరంద జుషాం :- పరమాత్మ స్వరూపుడైన గురువు యొక్క పాదములనెడి పద్మముల యందలి మకరందాన్ని ఆస్వాదించాలి. కడుపారా త్రాగాలి. పువ్వులలోని మకరందం ఎవరికి పడితే వారికి అంత తేలికగా లభించదు. దూరం నుండి చూసేవారికి పువ్వుల అందం తెలుస్తుంది. దగ్గర కొచ్చిన వారికి ఆ పువ్వుల అందంతో పాటు సువాసన కూడా తెలుస్తుంది. మనస్సు పరవశించి పోతుంది. ఇక పువ్వులలోని మకరందాన్ని ఆస్వాదించాలంటే మానవులకు - జంతువులకు సాధ్యంకాదు. కేవలం తుమ్మెదలు మాత్రమే

మకరందాన్ని పీల్చగలుగుతాయి. కడుపునింపుకోగలుగుతాయి. ఆనందించగలుగుతాయి. అయితే తుమ్మెద తన ఆరుకాళ్ళను పువ్వుమీద పెట్టి గర్భకుహరంలోకి చొచ్చుకపోయినప్పుడే మకరందం దక్కేది. అలాగే మోక్షార్థి అయిన జిజ్ఞాసువు – లేదా సాధకుడు – శిష్యుడు గురువుయొక్క పాదపద్మాలను ఆశ్రయించినప్పుడు తన 5 ఇంద్రియాలు – మనస్సు అనే ఆరింటిని ఆయన పాద పద్మాలపై నిలపాలి. గురువు పాదాలు కడగటం, ఆ పాదతీర్థాన్ని శిరస్సునచల్లుకోవటం, తీర్థంగా సేవించటం అనేవి దూరంగా ఉండి పువ్వుల అందాన్ని చూడటం – దగ్గరగా వచ్చి ఆ సువాసనను పీల్చటం వంటిదే. కాని గురువుయొక్క పాదాలను అనుసరించి, ఆయన మాటలో మాటకలిపి ఆయన మనస్సులో మనస్సు కలిపి ఆయన చూపిన మార్గాన్ని తు–చ తప్పక పాటించటమే పాదపద్మాలయందలి మకరందాన్ని ఆస్వాదించటం అంటే. గురువుయొక్క మూర్తిని ధ్యానిస్తూ, గురువు యొక్క పాదాలను పూజిస్తూ, గురువుయొక్క ఉపదేశాన్ని శిరసావహిస్తూ, గురువుయొక్క అనుగ్రహాన్ని పొందటమే శిష్యుని ఏకైక కర్తవ్యం. అదే నిజమైన ఆరాధన.

**(బి) అలా ఆరాధిస్తే ఫలితం ఏమిటి?**

సంసారఘోర భుజగాత్ భీతిః నభవేత్స్మ :– ఈ జనన మరణ రూపసంసారమనే కాల సర్పంయొక్క భయం పూర్తిగా తొలగిపోతుంది. సంసారం అంటే పుట్టటం – చావటం – మళ్ళీ మళ్ళీ పుట్టడం – మళ్ళీ మళ్ళీ చావటం. ఈ చావు పుట్టుకలతో కూడిన ఈ సంసారం అంటే ఎందుకు భయం? పుట్టేటప్పుడు దుఃఖం, చనిపోయేటప్పుడు దుఃఖం, మధ్యలో బ్రతికి ఉన్నంత కాలం కూడ ఏవేవోదుః ఖాలు. కోరికలు తీరక, వ్యాధులతో, ముసలితనంతో, ఆర్థిక ఇబ్బందులతో – ఇలా ఎన్నోదుఃఖాలు. అందుకేభయం. ఒక్కసారి త్రాచుపాము తోక తొక్కామా? అది పగబడుతుంది. మనం ఎక్కడెక్కడికెళ్ళినా అది మన వెంటనే నక్కి నక్కి ఉండి సమయం చిక్కినప్పుడు కాటేస్తుంది. అలాగే మనం ఒక్కసారి పరమాత్మకు దూరమయ్యామా? ఈ సంసారమనే ఘోరసర్పం మనను వెంటాడి, వెంటాడి దుఃఖాల పాలుచేస్తుంది. అందుకే భయం. ఈ

సంసారమనే భయంకర సర్పం యొక్క విషం నుండి మనం తప్పించుకోవాలంటే మనకున్న ఉపాయం ఒక్కటే. అదే సద్గురువు యొక్క పాదపద్మముల యందలి మకరందాన్ని ఆస్వాదించటమే. ఆ సర్పం యొక్క విషానికి విరుగుడు ఈ సద్గురు పాదపద్మ మకరందమే.

**(సి) సద్గురువుయొక్క పాద పద్మాలను ఆశ్రయిస్తే ఎలా తొలగుతుంది భయం?**

**ఆయన సచ్చిద్ఘనం :-** పరమాత్మ సత్తు - చిత్. ఘన స్వరూపం. అంటే పరమాత్మ ఎప్పుడూ ఉండే సత్ - సర్వాన్ని తెలుసుకొనే చిత్. నిజంగా ఆ పరమాత్మ మనలో ఉండటం వల్లనే మనం కూడా పరిమితమైన సత్‌గా- చిత్‌గా ఉంటున్నాం. మనం ఎప్పుడూ ఉండాలని కోరుకుంటాం. అన్నీ తెలుసుకోవాలనీ కోరుకుంటాం. కాని మన బుద్ధిలోని కల్మషాల వల్ల అట్టి పూర్ణస్థితి లేదు. మనం ఎప్పుడైతే గురుపాద పద్మాలను ఆశ్రయించామో - గురువుయొక్క ఉపదేశాలను తు-చ-తప్పక పాటించామో మన బుద్ధిలోని కల్మషాలు పూర్తిగా తొలగి - జీవభావం తొలగి సత్తు-చిత్తు స్వరూపమైన పరమాత్మగానే మిగిలిపోతాం. ఆ స్థితిలో భయాలకు ఆస్కారమే ఉండదు.

(డి) అంతే కాదు గొప్ప ఆనందం కూడా - **ఎట్టిది ఆ ఆనందం?**

సకల సౌఖ్యలవాంబురాశిం :- ఈ లోకంలో అన్నింటికన్నా చిన్నదైన చీమ నుండి బ్రహ్మ వరకు ప్రతి ఒక్కరికి ఎంతో కొంత ఆనందం ఉండనే ఉంది. క్షుద్రమైన అల్పజీవులకు కొద్ది అనందమైతే - మానవులకు మరికొంత ఎక్కువ ఆనందం ఉంటుంది. మానవులందరిలోకీ ఎక్కువ ఆనందం పోందేవాని ఆనందం మనుష్యానందం అయితే దానికి నూరురెట్లు ఆనందం మనుష్యగంధర్వానందం. దానికి నూరు రెట్లు గలది దేవగంధర్వానందం. దాని కన్న నూరింతలు ఎక్కువైన ఆనందం పితృదేవతల యొక్క ఆనందం. దానికి నూరురెట్లు అధికమైనది ఆజానజదేవతల ఆనందం. దానికి నూరింతలు ఎక్కువైనది కర్మదేవతల ఆనందం. దానికి నూరురెట్లు దేవానందం. దానికి నూరురెట్లు ఇంద్రానందం. దానికి నూరింతలు అధికమైనది బృహస్పతి ఆనందం. దానికి వందరెట్లు ప్రజాపతి ఆనందం. దానికి నూరు రెట్లు

అధికమైనది బ్రహ్మదేవుని ఆనందం. ఈ అందరి ఆనందాలు కలసి ఒక్క లవం – లేశమాత్రం – పిసరంత ఐతే పరమాత్మతో ఐక్యత వల్ల లభించే బ్రహ్మానందం సాగరం అంతటిది.

కనుక సద్గురు పాద పద్మాలను ఆశ్రయిస్తే నీలోనే ఉన్న పరమాత్మ నీవేనని తెలుస్తుంది. పరమాత్మతో సాయుజ్యంచెంది పరమాత్మగానే ఉంటావు. అప్పుడు బ్రహ్మానందమనే సాగరం నీవే అవుతావు. ఇక సంసార భయమనే దానికి ఆస్కారమే లేదు. ఆనందమే ఆనందం.

ఇలా సద్గురువు, సాక్షాత్ పరమేశ్వరుడు ఐన దక్షిణామూర్తిని ఆరాధిస్తూ గ్రంథం ప్రారంభమవుతున్నది. అట్టి సద్గురువు యొక్క పాదపద్మాలను ఆశ్రయించటంవల్ల సంసారభయాలు తొలిగిపోయి శాశ్వతమైన, అఖండమైన బ్రహ్మానందం లభిస్తుందని తెలియజేయటంతో ఈ గ్రంథంవల్ల – దీనిని అధ్యయనం చేసి ఆచరించినందువల్ల మోక్షప్రాప్తి తప్పదని సూచించటం జరిగింది. అట్టి మోక్షప్రాప్తి గురు పాద పద్మములయందలి మకరందాన్ని ఆస్వాదించటం వల్లనే సిద్ధిస్తుందని మనకు రూఢిఅవుతున్నది.

– ఇట్టి మోక్షసిద్ధికి మార్గాన్ని చూపే ఉపనిషత్తులు సాధకులకు ఏమని సూచిస్తున్నాయి? ఏమని ఆక్రోశించి చెబుతున్నాయి? – తర్వాత శ్లోకంలో –

**శ్లో॥ ఏతావ దేవ ఖలుపుంభి రవాప్తు మర్హం**
**యచ్చేతసో నిలయనం నిజతత్త్వ బోధే ।**
**ఆక్రోశనం శ్రుతి శిరాంసి యదర్థమేవ**
**కుర్వంతి యేనహి భవేత్ పురుషస్సుఖాబ్ధిః ॥ 2**

**ప్రతిపదార్థం :–** యేనహిః = దేనివల్ల; పురుషః = మానవుడు; సుఖాబ్ధి భవేత్ = సుఖసముద్రుడు అవుతాడో; శ్రుతిశిరాంసి = ఉపనిషత్తులు; యదర్థంఏవ = దేనినిగురించి; ఆక్రోశనం కుర్వంతి = ఆక్రోశించి చెబుతున్నాయో; (అట్టి మోక్షాన్ని) నిజతత్త్వబోధే= తన స్వరూపాన్ని తెలుసుకోవటం అనే జ్ఞానం ద్వారా మాత్రమే; చేతసః నిలయనం యత్ = మనస్సును నశింపజేసుకొని పొందాలి; ఏతావత్ ఏవఖలు = ఇంతవరకే; పుంభిః = మానవుడు; అవాప్తుం అర్హం = పొందటానికి అర్హుడు (సాధించవలసింది ఇదే–)

**భావం :-** దేని వల్ల మాత్రమే మానవుడు సుఖ సముద్రుడవుతాడో - దేనిని గురించి ఉపనిషత్తులు ఆక్రోశించి చెబుతున్నాయో, అట్టి మోక్షాన్ని తన స్వస్వరూపజ్ఞానంతో - ఆత్మ జ్ఞానంతో మాత్రమే మనస్సును నశింపజేసుకొని పొందాలి. ఇదే మానవుడు సాధించవలసిన పరమలక్ష్యం.

**వ్యాఖ్య :-** ఈ లోకంలో ప్రతి మానవుడు సుఖాన్ని - ఆనందాన్ని పొందాలనుకుంటాడు. అసలు దుఃఖమనేది లేకుండా ఉండాలనుకుంటాడు. ఆ ఆనందం ఎల్లప్పుడూ ఉండాలనుకుంటాడు. అంటే దుఃఖంలేని శాశ్వతానందాన్ని కోరుకుంటాడు. దానిని సాధించటానికి చేయవలసిన ప్రయత్నాన్నే 'పురుషార్థం' అన్నారు. ఆ పురుషార్థం 4 విధాలుగా - ధర్మ, అర్ధ, కామ, మోక్షాలని చతుర్విధ పురుషార్థాలుగా చెప్పబడ్డది.

1. లోకంలో చాలామంది - దాదాపుగా అందరూ తమకు కావలసిన సుఖం, ఆనందంకోసం అర్థ-కామాలనే పురుషార్థాలనే ఆశ్రయిస్తారు. అంటే డబ్బు సంపాదించుకోవటం - కోరికలను తీర్చుకోవటం. ఎంత డబ్బు సంపాదిస్తే అంత సుఖమని, ఎన్ని కోరికలు తీర్చుకోగలిగితే అంత సుఖమని భావిస్తారు. అందుకే పుట్టిన దగ్గర నుండీ చచ్చేదాకా డబ్బుకోసం, సంపదలకోసం క్షణం తీరిక లేకుండా పనిచేస్తుంటారు. అయితే ఇలా డబ్బును బాగా సంపాదించిన వారుగాని, సకల కోరికలను తీర్చుకోగలుగుతూ - తీర్చుకుంటున్న వారుగాని ఏ దుఃఖమూలేకుండా సుఖంగా ఉండగలుగుతున్నారా? ఎల్లప్పుడూ సుఖంగా ఉండగలమనే భరోసాతో ఉంటున్నారా? లేదు. వారికీ కోరుకున్న కోరికలన్నీ నెరవేరకనో, కోరినంతగా నెరవేరకనో, అనారోగ్యం వల్లనో, ముసలితనం వల్లనో, అనుకూలంగాలేని భార్యాబిడ్డల వల్లనో, నమ్మిన వారు నెత్తిన శఠగోపం పెట్టడంవల్లనో, కోర్టుకేసుల వల్లనో, అధికారుల వల్లనో, ఆత్మీయులు దూరమవటం వల్ల వియోగదుఃఖంతోనో ఎప్పుడూ ఏవేవో సమస్యలతో ఆందోళనగా, బాధగా, భయంగా, విచారంగా - విషాదంగా ఉంటుంటారు. అంటే తాము కోరుకున్న దుఃఖ రహితమైన శాశ్వత ఆనందాన్ని వందల కోట్ల - వేలకోట్ల ధనం సంపాదించినవారు కూడా పొందలేక పోతున్నారన్న మాట.

2. మరికొద్ది మంది ఎంత డబ్బు సంపాదించాం - ఎన్ని కోరికలు తీర్చుకున్నాం అనిగాక ధర్మ బద్ధంగా జీవించటం వల్లనే సుఖశాంతులు

అనిభావిస్తారు. వారు ధర్మానికి ప్రాధాన్యత ఇస్తారు. ఐతే ఎంతధర్మబద్ధంగా జీవించినా ప్రారబ్ధవశాత్తు వారికి కూడా రావలసిన కష్టనష్టాలు వస్తూనే ఉంటాయి. వారికీ ముసలితనం, వ్యాధులు, ఆత్మీయుల వియోగం – ఇలా ఎన్నో దుఃఖాలు తప్పవు.

3. అయితే బహు అరుదుగా ఎక్కడో ఏ ఒక్కరో మోక్షం కోసం ప్రయత్నం చేస్తారు. మోక్షం ద్వారా మాత్రమే శాశ్వత ఆనందం లభిస్తుందని తెలుసుకుంటారు. నిజంగా మోక్షసాధనకోసమే ఈ మానవ జన్మవచ్చిందని తెలుసుకుంటారు. ఆ లక్ష్యాన్ని సాధించటంకోసమే తమ మానవజన్మను వినియోగించి సార్ధకం చేసుకుంటారు. అయితే మోక్షం కోసం ప్రయత్నించే వారికి దుఃఖాలు రావా? ముసలితనంరాదా? రోగాలు రావా? ఆత్మీయులు దూరంకారా? అంటే– అవుతారు. అయితే మోక్షాన్ని పొందిన వారు తాము తమను దేహంగా భావించరు, భ్రమపడరు. తాము ఆత్మనని తెలుసుకొని ఆత్మగా– పరమాత్మగా ఉంటారు. వ్యాధులుగాని, ముసలి తనంగాని దేహానికేగాని తమకు కాదు. అలాగే సుఖదుఃఖాలు అన్నీ మనస్సుకేగాని తమకు కాదు. తాము నిర్మలము, నిశ్చలము, నిత్యము అయిన ఆనందస్వరూప ఆత్మ ననిగ్రహించి ఆత్మగానే ఉండి పోతారు గనుక ఇక ఏ దుఃఖాలు తమకు లేవు. వారు అఖండ, పరిపూర్ణ బ్రహ్మానంద సాగరంలో ఓలలాడుతూ ఉంటారు. కనుక ఒక వ్యక్తి తాను దేహాన్ని కాదని – మనస్సును కాదని, తాను ఆనంద స్వరూప ఆత్మనని గ్రహించి అట్టి ఆత్మగా ఉండి పోయినట్లైతే అదే మోక్షం – అట్టి మోక్షం వల్లనే మానవుడు సుఖ సముద్రుడవుతాడు అని తెలుస్తుంది.

**అట్టి ఈ మోక్షాన్ని పొందటానికి ఉపాయం ఏది? ఎవరు చెబుతారు?**

**శ్రుతి శిరాంసి ఆక్రోశనం కుర్వంతి :–** శ్రుతుల యొక్క శిరస్సులు ఆక్రోశించి చెబుతున్నాయి. శ్రుతులంటే వేదాలు. మనకు 4 వేదాలున్నాయి. ప్రతి వేదంలోను సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులని 4 భాగాలుంటాయి. చివరివైన ఉపనిషత్తులే వేదాలకు శిరస్సులు, మానవుడికి శిరస్సు ఎంత ముఖ్యమైనదో వేదాలకు శిరస్సులు అంత ముఖ్యమైనవి. తలకాయలేని మనిషి చూడలేడు, తినలేడు, ఆలోచించలేడు. అసలు ఎందుకూ పనికిరాడు. తలకాయలేని వాడు

అసలు లేని వాడి క్రిందే లెక్క. తలకాయ లేకపోతే ఎవరు ఎవరో గుర్తించటం కూడా కుదరదు. అందుకే మనిషికి తలకాయ ముఖ్యం. అలాగే వేదాలకు తలకాయలవంటి ఉపనిషత్తులు కూడా అంతే ముఖ్యం. అట్టి ఉపనిషత్తులు మోక్షాన్ని గురించి, ఆ మోక్షాన్ని పొందే ఉపాయాల గురించి, సాధనల గురించి నొక్కి చెబుతుంటాయి. అంతేకాదు ఆక్రోశించి మరీ మానవులకు చెబుతాయి. “ఈ మానవ జన్మను మోక్షం పొందటానికే ఉపయోగించుకోండి. అదే మానవ జీవిత పరమార్ధం, మోక్షం కొరకు ప్రయత్నించకపోతే  మీ జన్మవృధా. గొప్పనష్టం” అని ఎంతో ఆవేదనతో, ఆక్రోశంతో తిట్టి మరీ చెబుతాయి. మాట వినని పిల్లలను తిట్టి, కొట్టి, భయపెట్టి తల్లిదండ్రులు ఎలా సరైన మార్గంలో పెట్టాలను కుంటారో అలాగే ఉపనిషత్తులు కూడా దారి తప్పిన మనుషులను తిట్టి, హెచ్చరికలు చేస్తూ, ఆవేదనతో, ఆక్రోశంతో దారిలో పెట్టాలనుకుంటాయి.

**(ఎ)** ఈశావాస్యోపనిషత్తు 3వ మంత్రంలో **“అసూర్యానామతేలోకాః అంధేన తమసా వృతాః .....”** ఎవరు ఆత్మను తెలుసుకోరో వారు ఆత్మహత్య చేసుకున్న వారే. అట్టి ఆత్మ హత్య చేసుకున్న జనులు మరణించిన తర్వాత చేరుకునేవి సూర్యుడు లేని చీకటిలోకాలు – అంటే బుద్ధిలేని హీనజన్మలు అని హెచ్చరిక చేస్తున్నది ఉపనిషత్తు. కనుక ఆత్మజ్ఞానాన్ని పొందండి అని హెచ్చరిక –

**(బి)** కేనోపనిషత్ ద్వితీయ ఖండం 5వ మంత్రంలో –

**“ఇహ చేద వేదీ దథ సత్యమస్తి నచేదిహావేదీన్మహతీవినష్టిః ।”**

– జీవించి ఉండగానే తెలుసుకుంటే  పరమ సత్యం దొరుకుతుంది. తెలుసుకోలేని వాడికి ఎంతో గొప్పనష్టం అని. కనుక ఈ లోకంలో జీవించి ఉండగానే నీ పరమలక్ష్యాన్ని సాధించు లేదా గొప్పనష్టం – ఏమిటా నష్టం? మళ్ళీ మళ్ళీ జన్మలెత్తుతూ – దుఃఖాలు పొందుతూ అనంత ప్రయాణం సాగించాలి – అని హెచ్చరిక –

**(సి)** అలాగే కఠోపనిషత్తు 6వ అద్యాయం, 4వ మంత్రం కూడా ఇదే విషయాన్ని చెబుతున్నది.

**ఇహచేదశకద్ బోద్ధుం ప్రాక్ శరీరస్య విస్రసః ।**

**తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥**

– శరీరం పడి పోవటానికి ముందే ఈ జన్మలోనే ఆత్మను తెలుసుకున్నావా ముక్తియే. అలా తెలుసుకోలేక పోయావా? సృష్టిలోని అనేక లోకాలలో శరీరధారణ చేసి జనన మరణాలతో సతమతం కావాల్సిందే – అని హెచ్చరిక చేస్తున్నది ఉపనిషత్తు. దీనిని బట్టి ఆత్మ సాక్షాత్కారం కోసం ఎంత తపించాలో ఉపనిషత్తులు స్పష్టంగా తెలియజేస్తున్నవి. పశువులు కేవలం బ్రతకటమే ప్రధానంగా జీవిస్తాయి. మానవుడూ అంతే అయితే పశువుకన్నా హీనుడు. ఎందు కంటే బుద్ధిఉండీ ఉపయోగించుకోవటం లేదు గనుక. ఈ జన్మలో సాధించలేని దానిని ఎప్పుడో ఏ జన్మలోనో సాధిస్తానను కోవటం మూర్ఖత్వం. ఇంత మూర్ఖత్వం నీ బుర్రలో ఉంటే నీకు మూర్ఖపు జన్మలేగతి. కనుక ఇప్పుడే ప్రయత్నించు అని ఉపనిషత్తుల ఆక్రోశం – అయితే ఎలా సాధించాలి ఈ లక్ష్యాన్ని? ముక్తిని – మోక్షాన్ని?

**నిజతత్త్వ బోధే చేతసః నిలయనం :–** తన స్వరూపాన్ని గుర్తెరగటం ద్వారా – తన యదార్ధ తత్త్వాన్ని గ్రహించటం ద్వారా మనస్సు అంతమైపోయినప్పుడే శాశ్వత ఆనందం – మోక్షం. నిజంగా ఈ లోకంలో సుఖాలుగాని, దుఃఖాలుగాని మనస్సు వల్లనే. అలాగే బంధంగాని, మోక్షంగాని మనస్సు వల్లనే. “మనయేవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః” అన్నారు. మనస్సు ప్రాపంచిక విషయాలలో ఇరుక్కు పోయినప్పుడు కల్మషమైపోతుంది. మళ్ళీ మళ్ళీ ఈ లోకంలోకి వచ్చేట్టు చేస్తుంది. అదే బంధం. అలా గాక మనస్సు పూర్తిగా పరమాత్మ జ్ఞానంతో నిండిపోతే రాగద్వేషాలుతొలగిపోయి స్వచ్ఛమై, నిర్మలమై పూర్తిగా పరమాత్మలో రమించి రమించి పరమాత్మలో ఐక్యమై పోతుంది. ఇదే మోక్షం. ఇలా మనస్సు పరమాత్మలో ఐక్యమై పోయింది అంటే మనస్సు పూర్తిగా నశించిపోయిందన్న మాట. అలా మనస్సు నశించింది అంటే ఇక ఏ కష్టాలు, దుఃఖాలు లేవన్నమాటే. అయితే ఇట్టి మనోనాశనాన్ని సాధించాలంటే మన యదార్ధ తత్త్వాన్ని తెలుసుకోవాలి. మనస్వరూపాన్ని మనం తెలుసుకోవాలి.

ఇంత వరకు మనస్సుతో తాదాత్మ్యం చెందిన మనం మనస్సంటే ఏమిటో విచారణచేయాలి. అలావిచారణ చేస్తే మనస్సనేదే లేకుండా పోతుంది. ఇదే విషయాన్ని భగవాన్ రమణ మహర్షుల వారు తమ ఉపదేశసారంలో **"మానసంతుకిం మార్గణేకృతే నైవమానసం మార్గ ఆర్జవాత్"** అన్నారు.

అయితే గాఢ నిద్రలోగాని, మత్తు మందులు తీసుకున్నప్పుడు గాని, మూర్ఛలోగాని మనస్సు లేకుండా పోయే మాట నిజమే. ఐతే అ తర్వాత తిరిగి మనస్సుయథా స్థానానికి వచ్చేస్తుంది. ఇది మనో నాశనంకాదు. మనోలయం. కాని ఎవరైతే శాస్త్రాల ద్వారా, సద్గురువుల ద్వారా ఆత్మ జ్ఞానాన్ని గ్రహించి – తాను ఆత్మనేగాని ఈ దేహమనస్సులు కాదని తెలుసుకొని అట్టి ఆత్మగా ఉండేందుకు ప్రయత్నిస్తారో, సాధిస్తారో ఇక మనస్సు అనే దానికి చోటులేదు. మనోనాశం జరుగుతుంది. దానితో సమస్త దుఃఖ నివృత్తి – ఆనందప్రాప్తి. అదే మోక్షం. ఈ స్థితిని మనం అందుకోవాలన్నా – అందుకు తగిన సాధనలు చేయాలన్నా – మనకు దారిచూపేవి ఉపనిషత్తులే –

– ఉపనిషత్తులు మనకు ఎంతటి పరమ ప్రమాణమో? అవి ఎలా మనకు బోధిస్తున్నాయో ఈ 3వ శ్లోకంలో –

**శ్లో॥ మాతేవ పుత్ర మనుబోధయతి శ్రుతిర్హి**
**లోకం సమస్త మపి యోజయితుం సుఖేన ।**
**తస్మాచ్ఛ్రుతే రభిహితార్థ మతంద్రితేన**
**చిత్తేన సాధయితు మత్ర జనాయతధ్వం ॥ 3**

**ప్రతి పదార్థం :–** లోకం సమస్తం అపి = లోకంలోని సమస్త మానవులు కూడ; సుఖేన యోజయితుం = సుఖంగా జీవించటానికి; శ్రుతిః = ఉపనిషత్తు; పుత్రం మాత ఇవ = బిడ్డలకు తల్లి బోధించినట్లు; అనుబోధయతి = నిరంతరం బోధిస్తున్నది; తస్మాత్ = అందువల్ల; శ్రుతేః అభిహిత అర్థం = ఉపనిషత్తులు బోధించే హిత వాక్యాలను; అతంద్రితేన = విరామంలేకుండా (నిరంతరం); అత్ర = ఇక్కడ (ఈ దేహంలో ఉన్నప్పుడే); చిత్తేన సాధయితుం = మనస్సుద్వారా సాధించటానికి; జనాః = ఓ జనులారా! యతధ్వం = ప్రయత్నించండి.

**భావం :-** ఈ లోకంలోని సమస్త మానవులు సుఖాన్ని పొందటానికి గాను శ్రుతులు (వేదాలు) తల్లి తన బిడ్డలకు బోధించినట్లు నిరంతరం బోధిస్తూనే ఉన్నాయి. అందువల్ల నిరంతరం శ్రుతులయొక్క హిత వాక్యాలను జనులందరూ మనస్సు ద్వారా సాధించటానికి ప్రయత్నించాలి.

**వ్యాఖ్య :-** (1) సమస్త మానవాళి నిరతిశయ ఆనందంలో ఉండిపోవటానికి అఖండమైన – దుఃఖ రహితమైన ఆనందాన్ని పొందటానికి కావలసిన జ్ఞానాన్ని శ్రుతులు నిరంతరం అందిస్తున్నాయి. భగవంతుడు మానవులను సృష్టించే ముందే వారు తరించటానికి తగిన మార్గాన్ని చూపే జ్ఞానాన్ని కూడా అందిచాడు. **ఆ జ్ఞానమే** వేద విజ్ఞానం. అవే శ్రుతులు. (ఎ) భగవంతుని గురంచి ఏమాత్రం పట్టించుకోకుండా కేవలం లౌకిక ప్రపంచానికే అతుక్కుపోయిన సామాన్యుల కోసం సంహిత అనబడే మంత్ర భాగాన్ని; (బి) భగవంతుడున్నాడని నమ్మినప్పటికి ప్రాపంచిక సుఖభోగాలకు ప్రాకులాడే వారి కొరకు బ్రాహ్మణాలు అనబడే కర్మకాండ భాగాన్ని; (సి) ఇక ప్రాపంచిక విషయాలకన్న భగవంతుడే ప్రధాన మనుకున్న వారికి ఆరణ్యకాలు అనబడే ఉపాసనాకాండ భాగాన్ని (డి) పరమాత్మతో ఐక్యత తప్ప మరింకేమీ అక్కరలేదను కొనే పరిపక్వ సాధకుల కొరకు ఉపనిషత్తులనే జ్ఞాన కాండను శ్రుతులు లోకంలోని వివిధ రకాల మానవులకు వారి వారికి తగిన మార్గాలను ఉపాయాలను అందిచటం జరిగింది. ఈ 4వ భాగమైన ఉపనిషత్తులనే 'శ్రుతి శిరస్సులు' అని ఇంతకు ముందు శ్లోకంలో చెప్పుకోవటం జరిగింది. ఈ ఉపనిషత్తుల జ్ఞానాన్ని తెలుసుకొని, ఆ జ్ఞానాన్ని అనుభవంగా మలచుకొన్న వారికే మోక్షం, అలా సకల మానవులకు శాశ్వతానంద ప్రదమైన మోక్షాన్ని అందించటానికే శ్రుతులు ఆక్రోశించి చెబుతున్నాయి.

(2) నిజంగా ఇంతగా ఆక్రోశించి చెప్పాల్సిన పని ఏమిటి? ఏదో చెప్పి ఊరుకుంటే సరిపోతుంది గదా! ఒక తల్లి తన దారి తప్పిన కుమారుణ్ణి దగ్గరకు చేరదీసి, బుజ్జగించి, ఎంతో వాత్సల్యంతో బిడ్డ బాగుపడాలనే ఉద్దేశంతో హితాన్ని చెబుతుంది. అతడు నడుస్తున్న మార్గం మంచిది కాదని, దాని వల్ల ఎన్నో కష్ట

నష్టాలు ఎదుర్కోవాల్సి వస్తుందని, కనుక ఇకనైన మంచి మార్గంలో నడవమని మెత్తగా చెబుతుంది. అతడు విన్నా – వినిపించుకోక పోయినా, విసుగు చెందకుండా చెబుతుంది. అయినా అతడు వినిపించుకోకపోయినా, విసుక్కొని కేకలు వేసినా అప్పటికీ ఊరుకోదు. ఎలాగోలా కన్నీళ్ళు పెట్టుకొని జాలిగొలిపే విధంగా మాట్లాడుతుంది. అప్పటికీ వినకపోతే ఆక్రోశించి చెబుతుంది. తల్లి మాటవినక చెడిపోయిన వారి గురించి చెప్పి, నీవు అలాగే అవుతావు అని ఆక్రోశిస్తుంది, బాధపడుతుంది. ఇదంతా తన మేలు కోసం కాదు. తన బిడ్డల యొక్క మేలుకోసం; వారి సుఖసంతోషాల కోసం మాత్రమే. అలాగే శ్రుతి మాత కూడా తన బిడ్డలైన సమస్త మానవుల ఆనందం కోసం, సుఖ సంతోషాల కోసం, వారిశ్రేయస్సుకోసం మంచి మార్గాన్ని, ఉపాయాన్ని మళ్ళీ మళ్ళీ విసుగు లేకుండా తెలియజేస్తుంది.

అంతేగాదు శ్రుతులు పరిపక్వత చెందిన ఏకొద్ది మంది సాధకులకోసమో మాత్రమే గాకుండా సమస్త మానవాళి యొక్క బాగుకోసం, సుఖ సంతోషాలకోసం, శ్రేయస్సుకోసం ఆక్రోశించి చెబుతున్నాయి. అందుకే సంహిత, బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులు అనే నాలుగు భాగాల ద్వారా లోకంలోని అందరు మానవులకు బోధచేస్తున్నాయి. తల్లికి తన బిడ్డలలో ఏ ఒక్కడుదారి తప్పినా బాధే – ఆవేదనే. బిడ్డలందరూ బాగుపడాలనే ఆమె కోరిక. అలాగే శ్రుతి మాతకు కూడా సమస్త మానవాళిపై అమిత వాత్సల్యం. ఏ ఒక్కరు చెడిపోయినా సహించదు. తనను పట్టించుకోని వారిని కూడా బాగు చెయ్యాలనే తపనే శ్రుతి మాతకు.

**తస్మాత్ శ్రుతేః అభిహితార్థం సాధయితు యతధ్వం :–** అందువల్ల శ్రుతుల యొక్క హితవాక్యాలను తెలుసుకొనుటకు, ఆచరించుటకు జనులంతా ప్రయత్నించాలి. మన యొక్క హితం కోసం అంతగా ఆరాటపడే శ్రుతుల మాటలను మనం ఎంతబాగా వినాలి?! అర్థచేసుకోవాలి! ఆచరించాలి! ఈ కారణం చేతనే మానవులందరికి పరమ ప్రమాణం వేదాలు అని చెప్పటం. ఇంత పరమ ప్రమాణమైన వేదాలు పుట్టిన భూమి మన భరత భూమి కావటం ఈ భూమిపై పుట్టిన మనందరి అదృష్టం. మనది వేదభూమి కావటం మన

అదృష్టం. మన దేశంలో పుట్టిన వేదాలను అనేక ఇతర దేశాలు తరలించుకుపోయి, వాటిని అధ్యయనంచేసి ఆయాదేశాలు ఎంతో వృద్ధి చెందుతూ ఉంటే ఈ దేశంలోనే పుట్టి ఆ వేదాలను పట్టించుకోని వాళ్ళు, ఆ వేదాలను ఎగతాళి చేసేవాళ్ళు ఎప్పుడో ఒకప్పుడు ఆవేదన చెందక తప్పదు. ఇంతటి గొప్పవైన వేదాలను తెలుసుకోనక్కరలేదని, అందులోని విషయాలు అర్ధంకావని, అర్ధం పర్ధంలేని మాటలు చెప్పే కపట ఆధ్యాత్మిక చింతనా పరులు, వేషధారులు ఏవేవో పేర్లతో బయలుదేరి వస్తున్నారు. ఇదంతా కలి ప్రభావం అని చెప్పక తప్పదు. వేదవిజ్ఞానాన్ని విమర్శించే – అపహాస్యం చేసే ఈ బుద్ధిలేని పెద్దలను ఆశ్రయించే అమాయకులు; తెలివిగలవారమనుకోనే అహంకారులు; మూర్ఖులు ఎందరో ప్రపంచంలో ఇప్పుడు కనిపిస్తున్నారు. వారి పూర్యజన్మ సుకృతం బాగాలేదని అనుకోవటం తప్ప మనం చేయగలిగిందేమీ లేదు. ఏది ఏమైనా సకల మానవ శ్రేయస్సుకు మార్గం చూపే శ్రుతుల విజ్ఞానాన్ని తెలుసుకోవాలి, ఆచరించాలి, ఆనందాన్ని పొందాలి. అలాగాక శ్రుతులను అపహాస్యం చేస్తే ఈ ఒక్క జన్మేకాదు – అనేక జన్మలు, బుద్ధిహీనమైన జన్మలు రాకతప్పదు, – ఇక సుఖాన్ని పొందటం ఎలా? –

## ఉపోద్ఘాతం

ఇంత వరకు 3 శ్లోకాలద్వారా ప్రతి మానవుడు సుఖ సముద్రుడు కావాలని, శాశ్వతమైన, అఖండమైన, దుఃఖం అంటే ఏమిటో తెలియని ఆనంద సాగరుడు కావాలని; అందుకోసమే మానవజన్మ వచ్చిందని, ఈ మానవజన్మను అందుకోసమే వినియోగించుకోవాలనీ తెలుసుకున్నాం. అట్టి శాశ్వత – అఖండ బ్రహ్మానందం మోక్షప్రాప్తి వల్లనే సాధ్యమని, మోక్షప్రాప్తికి మార్గం చూపేవి ఉపనిషత్తులనీ తెలుసుకున్నాం. ఉపనిషత్తులు తల్లి బిడ్డకు హితాన్ని చెప్పినట్లు సమస్త మానవుల శ్రేయస్సుకోసమని ఆక్రోశించి చెబుతున్నాయని కూడా తెలుసుకున్నాం. అయితే ఆ ఉపనిషత్తులలో బోధించిన జ్ఞానాన్ని, మోక్ష సిద్ధికి గల ఉపాయాలను ఎవరంతటవారు చదివి, గ్రహించి, సాధించలేరని కనుక ఒక సద్గురువును ఆశ్రయించి, సేవించి, పూజించి వారి ద్వారా గ్రహించి,

సాధనలు చేసి మానవ జీవిత పరమార్థమైన మోక్షాన్ని పొందాలని కూడా తెలుసుకున్నాం. ఈ జనన మరణ రూపసంసారఘోర సర్పం యొక్క విషంనుండి మనను తప్పించేది దైవ స్వరూపుడైన సద్గురువుయొక్క పాద పద్మాల యందలి మకరందమేనని తెలుసుకున్న సాధకులు, జిజ్ఞాసువులు సద్గురువును ఆరాధించాలనీ, మనోనాశనం ద్వారానే సమస్త దుఃఖాలను అంతం చేసుకోవచ్చు నని, అట్టి మనోనాశనం మన యదార్థ తత్త్వాన్ని, మన నిజస్వరూపాన్ని తెలుసుకోవటం వల్ల, తెలుసుకొని మనస్వస్థితిలో మనం నిలిచిపోవటం వల్లనే సాధ్యమవుతుందనీ తెలుసుకున్నాం. ఇప్పుడు మనయదార్థ స్థితిని, స్వస్థితిని తెలుసుకోవాలంటే అసలు ఈ సృష్టి ఎలా వచ్చిందో, మనమెవరో తెలుసుకోవాలి గనుక ముందుగా సృష్టిరహస్యాన్ని వివరించ బోతున్నారు. రాబోయే 5 శ్లోకాల ద్వారా ఈ ప్రపంచ సృష్టి – జీవుళ్ళు ఇందులోకి ఎలా వచ్చారో – దేవుడే జీవుడెట్లా అయ్యాడో, జీవుడై ఎలా ఇరుక్కుపోయాడో వివరంగా తెలియజేయబోతున్నారు 4వ శ్లోకం నుండి –

ప్రపంచం ఎలా సృష్టించ బడిందో వివరించబోతున్నారు.

**శ్లో॥ ఆదావిదం సకలమేవ జగత్సదాసీత్**
**కుంభాది వత్తదనుశక్తి యుతేత్పరస్మాత్ ।**
**ఆకాశ వాయు దహనాంబు భువోబభూవః**
**వాతప్రసక్త సవిలా దివ వీచిపూరః ॥ 4**

**ప్రతిపదార్థం :–** ఆదౌ = మొదట్లో; ఇదం సకలంజగత్ = ఈ సమస్తమైన జగత్తు; కుంభ+ఆదివత్ = కుండలు మొ॥న వాటిలాగా; సత్ఏవ = సత్తుగా మాత్రమే; ఆసీత్ = ఉండేది; తత్ అను = అ తరువాత; శక్తి యుతాత్ పరస్మాత్ = శక్తితో కూడిన పరమాత్మనుండి; వాత ప్రసక్త సవిలాత్ = గాలిచే కొట్టబడిన నీరు; వీచిపూరః ఇవ = అలలతో నిండినట్లు; ఆకాశ వాయు, దహనః అంబుభువః = ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి; బభూవ = తయారైనవి.

**భావం :–** మొదట్లో ఈ సమస్త జగత్తు 'కుండలు మొదలైన వాటివలె' సత్తుగా మాత్రమే ఉండేది. ఆ తర్వాత శక్తితో కూడిన పరమాత్మ నుండి 'గాలితో కొట్టబడిన నీటి నుండి అలలు' లాగా ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి తయారైనవి.

**వ్యాఖ్య :-** 2వ శ్లోకంలో చెప్పినట్లు మనోనాశనం సాధిస్తేనే దుఃఖ నివృత్తి. మనోనాశనాన్ని ఎలా సాధించాలి? అసలు మనస్సంటే ఏమిటి? ఆలోచనలే మనస్సు. ఆలోచనలు ఎందుకు వస్తాయి? ఈ ప్రపంచం ఎంతో ఆకర్షణీయంగా కనపడటం వల్ల – ఈ ప్రపంచంలోని శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయాలు పదే పదే మనస్సుని రెచ్చగొట్టడం వల్ల, ఆ విషయాల ద్వారా సుఖించాలని మనస్సు ఆలోచనలు చేస్తుంటుంది. అలా మనస్సు తయారవుతున్నది. ఇప్పుడు ప్రపంచం గురించి సరైన జ్ఞానం కలిగితే – ఈ విషయాల యొక్క యదార్థ స్థితి – తత్వం తెలిస్తే ఈ ప్రపంచం పట్ల వ్యామోహం తొలగిపోయి, ఆలోచనలు ఆగిపోయి మనస్సు నశిస్తుంది. ప్రపంచం గురించిన జ్ఞానం తెలియాలంటే ప్రపంచం అంటే ఏమిటో? ఎలా వచ్చిందో? ఎలాంటిదో? తెలియాలి – అందుకే ఈ ప్రపంచ సృష్టి గురించి – యదార్థ స్థితి గురించి ఈ శ్లోకం నుండి చెప్పబోతున్నారు. అసలు –

**1) ప్రపంచం అంటే ఏమిటి? ప్ర పంచ** ఐదింటితో కూడినది ఈ ప్రపంచం. 5 భూతాల – పంచభూతాల కలయికతో ఏర్పడినదే ఈ ప్రపంచం. అంతేకాదు. 5 విషయాలతో కూడినదే ఈ ప్రపంచం. అవే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ అనేవి. ఈ ఐదూ తప్ప ఆరోవిషయం ప్రపంచంలో లేనేలేదు. కనుక ప్రపంచం ఏర్పడింది పంచభూతాల కలయికతో; ప్రపంచంలో ఉన్నది శబ్ద స్పర్శ రూపరసగంధ అనే 5 విషయాలు మాత్రమే.

**2) ఈ ప్రపంచం ఏలా ఏర్పడింది?** ప్రపంచం ఏర్పడకముందు కేవలం సత్తు మాత్రమే ఉన్నది. అంటే నామ రూపాలులేని, నిరాకార, నిర్గుణ, సర్వవ్యాపక, సూక్ష్మాతి సూక్ష్మ, స్వయంప్రకాశ పరమాత్మ చైతన్యం మాత్రమే ఉన్నది. దానిలో ఏ భేదాలు లేవు, ఏ వికారాలు లేవు. కేవలం సత్తా. దీనినే పురాణాలలో 'వట పత్రశాయియై శ్రీ మహావిష్ణువు యోగ నిద్రలో నిశ్చలంగా దీర్ఘకాలం శయనించి ఉంటాడు' అని కథా రూపంలో చెబుతారు. ఆ తరువాత 'గాలిచే కొట్టబడిన నీరు అలలతో నిండినట్లుగా' శక్తితో కూడిన పరమాత్మ నుండి పంచభూతాలు ఏర్పడ్డాయి.

నీరు నిశ్చలంగా ఉన్నప్పుడు మన దృష్టిని ఆకర్షించలేదు. ఐతే గాలి వీచినప్పుడు నిశ్చలంగా ఉన్న నీటిలో సంచలనం కలిగి అలలు ఏర్పడతాయి. దానితో మన దృష్టిని ఆకర్షిస్తుంది. అలాగే కేవల సత్తా ఉన్నప్పుడు మన దృష్టిని ఆకర్షించలేదు. ఆ సత్తా నుండి పంచ భూతాలు వచ్చినప్పుడు అవి అనేక గుణాలతో ఉండి మన దృష్టిని ఆకర్షిస్తాయి. **అయితే పరమాత్మనుండి పంచభూతాలు ఎలా వచ్చాయి? 'శక్తితో' కూడిన పరమాత్మ వల్లనే.** నిజంగా పరమాత్మ అకర్త. కేవలంగా ఉండే వాడు. అట్టి పరమాత్మ నుండి ఈ పంచభూతాలు ఎలా వస్తాయి? ఒక వేళ ఆయన ఈ పంచభూతాలను సృష్టిస్తే ఆయన ఆకర్త ఎలాఅవుతాడు? పరమాత్మ పరమాత్మగా ఎప్పుడూ ఆకర్తే, ఆయన సృష్టి చేసేవాడూ కాదు, సృష్టి చేయాల్సిన అవసరమూ ఆయనకు లేదు. మరి అవసరం ఎవరిది? సమిష్టి వాసనలతో కూడియున్న 'మాయ' పరమాత్మను ఆశ్రయించి యున్నది. ఈ సమిష్టి వాసనలన్నీ గత కల్పం (సృష్టి)లోని జీవుళ్ళవే. ఈ సమిష్టి వాసనలతో కూడిన మాయను 'శక్తి' అంటారు. ఆ శక్తితో కూడిన పరమాత్మనే 'ఈశ్వరుడన్నారు'. ఈ సృష్టి చేస్తున్నదీ, చేయవలసిన అవసరం ఈశ్వరుడికేగాని పరమాత్మకు లేవు. కనుక ఈ పంచభూతాలు సమిష్టి వాసనల ప్రేరణ వల్లనే (శక్తి వల్లనే) సత్తా నుండి ఏర్పడుతున్నాయి. పరమాత్మనుండి పంచ భూతాలు ఏర్పడిన విధం తైత్తిరీయోపనిషత్తు స్పష్టంగా చెబుతున్నది. **"తస్మాద్వా ఏతస్మాత్ ఆత్మనః ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ --** అని. అట్టి ఆత్మనుండి ఆకాశం, ఆకాశం నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటినుండి భూమి - ఏర్పడ్డవి.

ఇవి ఏర్పడటం కూడా 'గాలిచే కొట్టబడిన నీటినుండి అలలు ఏర్పడ్డట్లు అని ఉపమానం చెబుతున్నారు. అంటే అలలు నీరేతప్ప మరేమీకాదు. నిశ్చలంగా ఉన్న నీరు కదలిక వల్ల అలలుగా ఏర్పడింది అంతే. అలాగే పంచభూతాలు పరమాత్మ తప్ప మరేమీకాదు. నిశ్చలంగా ఉన్న పరమాత్మ వాసనలతో కూడిన మాయ యొక్క ప్రేరణ వల్ల పంచభూతాలుగా ఏర్పడింది అని భావం. అంటే పరమాత్మే ఆకాశ రూపంలోను, పరమాత్మే ఆకాశంలో వాయు రూపంలోను, పరమాత్మే అగ్ని రూపంలోను... ఇలా ఏర్పడ్డవి అని గ్రహించాలి.

1. మొదట్లో ఈ జగత్తంతా కుండలు మొదలైన వాటివలె సత్తుగా ఉండేది అని చెప్పిన వాక్యం గురించి విచారణ చేద్దాం. కుండలు మొ॥ వాటి వలె అనగా కుండలు మొదలైనవి మొదట్లో ఎలా మట్టిలాగా ఉండేవో – అలాగే ఈ నామరూప జగత్తంతా మొదట్లో కేవలం సత్తాగా ఉండేది అని అర్థం. ఈ జగత్తంతా పంచభూతాల కలయికతో ఏర్పడ్డది. కనుక జగత్తుకు ముందు పంచభూతాలే ఉండి ఉండాలి. (అదే ముడి సరుకు). ఆ పంచభూతాలు ఏర్పడక ముందు ఆ పంచ భూతాలు ఏర్పడటానికి కారణమైన కేవల సత్తా మాత్రమే ఉండి ఉండాలి. ఇదే విషయాన్ని శ్రుతి వాక్యాలు సమర్థిస్తున్నాయి.

**"ఆత్మావా ఇదం ఏకమే వాగ్ర ఆసీత్"** – ఈ ప్రపంచం సృష్టికి పూర్వం ఒకే ఆత్మగా ఉండేది – అని ఋగ్వేదంలోని ఐతరేయోపనిషత్తు;

**"సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం"** – నామరూపాలతో కూడిన ఈ జగత్తు సృష్టికి పూర్వం ఏకమై అద్వితీయమైన సత్తు మాత్రమే ఉండేది – అని సామవేదంలోని ఛాందోగ్యోపనిషత్తు; **"ఆత్మైవేద మగ్ర ఆసీత్..."** సృష్టికి పూర్వం ఆత్మ యొక్కటియేగలదు – అని శుక్లయజుర్వేదంలోని బృహదారణ్యకోపనిషత్తు చెబుతున్నాయి దీనిని బట్టి మొదట్లో కేవల సత్తా – ఏకము అద్వయము అయిన పరమాత్మ మాత్రమే నిశ్చలంగా ఉండేది.

2. కల్పాదిలో – అంటే సృష్టి ప్రారంభంలో గత సృష్టిలోని జీవుళ్ళ యొక్క సమిష్టి వాసనలతో కూడిన మాయాశక్తి యొక్క ప్రేరణతో ఆ పరమాత్మ నుండి ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి అనే పంచ భూతాలు – సూక్ష్మ తన్మాత్రలు ఏర్పడ్డాయి. పరమాత్మ అకర్త గనుక సృష్టి చేయడు. అయితే మాయచేత ఆవరించబడిన పరమాత్మ ఈశ్వరుడై ఈ పంచభూతాల సృష్టిచేయటం జరిగింది. దీనిలో పరమాత్మకు కర్తృత్వం అంటదు.

ఇలా ఏర్పడిన పంచభూతాలు – ప్రకృతి లేదా మాయ అనే తల్లి వల్ల – పరమాత్మ అనే తండ్రి వల్ల జనించినవి గనుక ఈ పంచభూతాలన్నింటిలోను పరమాత్మ చైతన్యమూ ఉంటుంది, మాయ యొక్క 3 గుణాలు – సత్వరజస్తమోగుణాలు ఉంటాయి.

ఇక ఈ పంచభూతాలనుండి ఈ నామ రూపాలతో కూడిన (జగత్తు) ప్రపంచ సృష్టి ఎలా జరిగిందో తర్వాతి శ్లోకంలో –

పంచ భూతాల నుండి ప్రపంచం ఏలా ఏర్పడింది?

**శ్లో॥ సూక్ష్మాఖ్య భూతగత సత్త్వరజస్తమోభిః**
**లింగం శరీర ముదభూదత ఈశ్వరేచ్ఛా ।**
**పంచీచకార వియదాదిక భూత సూక్ష్మాని**
**అండం హ్యభూదత ఇదం సహజీవభోగ్యైః ॥ 5**

**ప్రతిపదార్థం :–** సూక్ష్మాఖ్య భూతగత = సూక్ష్మపంచ భూతాల (తన్మాత్రల) యొక్క; సత్త్వరజః తమోభిః = సత్త్వ రజస్తమో గుణాలతో; లింగ శరీరం ఉదభూత్ = సూక్ష్మ శరీరం (సమిష్టి సూక్ష్మశరీరం – బ్రహ్మ) ఉత్పన్న మైదని; అతః = అప్పుడు; ఈశ్వరేచ్ఛా = ఈశ్వరేచ్ఛవల్ల; వియత్ ఆదికభూత సూక్ష్మాని = ఆకాశం మొ॥న సూక్ష్మ భూతాలను; పంచీచకార = పంచీ కరణం చేయటంతో; అతః = దానినుంచి; జీవభోగ్యైః = జీవుళ్ళు భోగించటానికి తగిన; ఇదం ఆభూత్ = ఈ ప్రపంచం తయారైంది.

**భావం :–** సూక్ష్మమైన పంచభూతాల (తన్మాత్రల) సత్వర జస్తమో గుణాలతో సూక్ష్మ శరీరం (సమిష్టి సూక్ష్మ శరీరం – బ్రహ్మ) ఉత్పన్నమైంది. అప్పుడు ఈశ్వరేచ్ఛవల్ల ఆ సూక్ష్మ భూతాలను పంచీకరణం చేయటంతో జీవుళ్ళ యొక్క భోగ్యవస్తువులతో సహా ఈ ప్రపంచం (నామరూప) తయారైంది.

**వ్యాఖ్య :–** సృష్టి కర్త బ్రహ్మదేవుడు ఎలా పుడుతున్నాడో తెలియజేస్తున్నారు. నిజంగా బ్రహ్మదేవుడు కథల్లో చెప్పుకున్నట్టుగా స్థూల శరీరంతో – నాలుగు తలలతో ఉండడు. 'సమిష్టి సూక్ష్మ శరీరాభిమానీ హిరణ్యగర్భః' అన్నారు. అంటే బ్రహ్మ సమిష్టి సూక్ష్మ శరీరాభిమాని అన్నమాట. **మరి ఆ సమిష్టి సూక్ష్మ శరీరం ఎలా వచ్చింది?.**

ఇంతకు ముందే సమిష్టి కారణ శరీరం (మాయ) ప్రేరణతో పరమాత్మ నుండి 5 సూక్ష్మ భూతాలు ఏర్పడ్డాయని, ఆ సూక్ష్మ భూతాలు సత్వరజస్తమో

గుణాలనే 3 గుణాలతో కూడి ఉన్నాయని తెలుసుకున్నాం. ఇప్పుడా ఒక్కొక్క సూక్ష్మ భూతం (తన్మాత్ర) యొక్క సాత్వికాంశం నుండి ఒక్కొక్క జ్ఞానేంద్రియము, పంచతన్మాత్రల సమిష్టి సాత్వికాంశం నుండి అంతః కరణాలు 4 (మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు) వస్తాయి. అలాగే ఒక్కొక్క సూక్ష్మ భూతం (తన్మాత్ర) యొక్క రాజసికాంశనుండి ఒక్కొక్క కర్మేంద్రియం, పంచతన్మాత్రల సమిష్టి రాజసికాంశ నుండి పంచప్రాణాలు వస్తాయి. ఈ విధంగా పంచతన్మాత్రల స్వాతికరాజసికాంశల నుండి 5 జ్ఞానేంద్రియాలు,5 కర్మేంద్రియాలు, 5 ప్రాణాలు, 4 అంతః కరణాలు – మొత్తం 19 కలిసి సూక్ష్మశరీరం (బ్రహ్మ) ఉదయిస్తుంది. ఇదీ బ్రహ్మదేవుని పుట్టుక.

ఇక బ్రహ్మదేవుడు పుట్టిన తర్వాత సృష్టి చేయమని శ్రీ మహావిష్ణువు తాను హాయిగా యోగనిద్రలో శయనించి ఉండి బ్రహ్మను ఆదేశిస్తాడు. ఇది కథా రూపం. **మరి నిజంగా?--**

(సృష్టి అంటే? – జీవుళ్ళు – వాళ్ళు భోగించటానికి వీలుగా నామరూపాలతో కూడిన ఈ ప్రపంచం ఉండాలి)

నిరాకార, నిర్గుణ, సర్వవ్యాపక పరమాత్మ తాను తానుగా నిశ్చలంగా ఉండగా, పరమాత్మ చైతన్యంతో కూడిన సమిష్టి కారణ శరీరం (ఈశ్వరుడు) సృష్టికోసం – ప్రపంచ అనుభవాలకోసం త్వరపెడుతుంది. అదే ఈశ్వరేచ్ఛ, అదే బ్రహ్మయొక్క సృష్టి సంకల్పం. దానితో స్థూల జగత్తు యొక్క సృష్టికి నాందీ వాచకం అవుతుంది. **స్థూల జగత్తు సృష్టి ఎలా జరుగుతుంది?**

సూక్ష్మమైన పంచభూతాల (తన్మాత్రల) సాత్విక, రాజసికాంశలతో సూక్ష్మ శరీర (బ్రహ్మ) పుట్టుక జరిగింది గదా. ఇక తామసికాంశలున్నాయి. ఈ పంచతన్మాత్రల తామసికాంశలు పంచీకరణం చెంది స్థూల భూతాలు ఏర్పడతాయి. **పంచీకరణం.**

మొదటిదశ కేవల విభజన, రెండవ దశ విడిపోవుట. 3వ దశ రెండవ భాగం నాలుగుగా విడిపోవుట. నాలుగవ దశ $\frac{1}{2}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8} = 1$ స్థూల

ఆకాశభూతం. ఇలా సూక్ష్మతన్మాత్రలు పంచీకరణంతో స్థూలభూతాలుగా ఏర్పడతాయి. ఈ స్థూల పంచభూతాలు ఒక దానితో ఒకటి కలిసి సజాతీయ, విజాతీయ, స్వగత భేదాలతో స్థూలదేహాలు, జీవుళ్ళ భోగానికి తగిన నామరూప జగత్తు ఏర్పడతాయి. ఇదీ సృష్టి జరిగేవిధం.

ఒక్కొక్క సూక్ష్మదేహం - దానిలోని వాసనలు కర్మ ఫలాలతో కూడిన కారణదేహం యొక్క అనుభవాలకు తగిన స్థూల శరీరంతో మొత్తం 3 శరీరాలు ఏర్పడ్డవి. ఇలా స్థూల సూక్ష్మ కారణ దేహాలతో జీవుడు తయారవుతాడు. ఈ జీవుళ్ళు సాత్వి కాంశం వల్ల పుట్టిన జ్ఞానేంద్రియాలు, అంతః కరణాలతో ఈ ప్రపంచంలోని విషయాలను చూసి, తెలుసుకొని కోరుతుంటాయి. అలాగే రాజసికాంశ వల్ల పుట్టిన ప్రాణాలు, కర్మేంద్రియాలతో ఆ విషయాలను సంపాదించుకొని, భోగిస్తూ ఉంటాయి. ఈ ప్రకారంగా నామరూప విషయాలతో కూడిన యావత్ ప్రపంచం జీవుళ్ళకు భోగ్యభూమి, కర్మభూమి అవుతున్నది. ఈ మొత్తాన్ని నాభికమలంలోని బ్రహ్మయొక్క సృష్టిగా కథా రూపంలో చెబుతారు.

- సృష్టి జరిగింది మరి ఆనందస్వరూపుడు, పరమజ్ఞాన స్వరూపుడు అయిన పరమాత్మ ఎలా జీవుడయ్యాడు? దేవుడు జీవుడైన విధం ఏమిటి?

దేవుడు జీవుడెలా అయ్యాడో -

**శ్లో॥ సృష్ట్వా జగత్ సకలమేవ మశేషకర్తా**
**తత్రావిశత్ పునరుపాగత జీవభావః ।**
**విస్మృత్య సత్య సుఖబోధ మయస్వరూపం**
**భ్రాంత్యా భ్రమత్ యనిశమస్త వివేకలేశః ॥ 6**

**ప్రతిపదార్థం :-** ఏవం = ఈ ప్రకారంగా; సకలం జగత్ సృష్ట్వా = ఈ ప్రపంచాన్నంతటిని సృష్టించి; అశేషకర్తా = అశేషకర్తయిన పరమాత్మ; తత్ ప్రావిశత్ = అందులో ప్రవేశించి; పునః = తిరిగి; జీవభావః = జీవభావాన్ని; ఉపగతః = పొందాడు; సత్యసుఖబోధమయస్వరూపం = తన సత్తుచిత్తు ఆనందమయస్వరూపాన్ని; విస్మృత్య = మరచిపోయి; అస్తవివేకలేశః = కొంచెంకూడా వివేకంలేనివాడై; భ్రాంత్యా = భ్రాంతితో; అనిశంభ్రమతి = నిత్యము తిరుగుతున్నాడు.

**భావం :–** ఈ ప్రకారంగా సకల జగత్తుని సృష్టించి, అశేషకర్త ఐన పరమాత్మ అందులో ప్రవేశించాడు. తిరిగి జీవభావాన్ని పొందాడు. తన సచ్చిదానంద స్వరూపాన్ని మరచిపోయి వివేకాన్ని పూర్తిగా పోగొట్టుకున్న వాడై భ్రాంతి చేత నిత్యము పరిభ్రమిస్తాడు.

**వ్యాఖ్య :–** స్థూల పంచభూతాల యొక్క కలయికతో స్థూల దేహాలతో కూడిన జీవుళ్ళు ఏర్పడ్డారు. అలాగే జీవుళ్ళు భోగించటానికి వీలుగా నామరూపాలతో కూడిన విషయ ప్రపంచం ఏర్పడ్డది. ఈ జీవుళ్ళు శబ్ద స్పర్శ రూపరస గంధ అనే విషయాలతో కూడిన ఈ నామ రూప జగత్తును వాడుకోవాలన్నా, అనుభవం పొందాలన్నా జడమైన దేహ ఇంద్రియ మనోబుద్ధులకు అవకాశంలేదు. వీటికి చైతన్యం కావాలి. అందుకనే సర్వవ్యాపక చైతన్యం ఈ జీవుళ్ళలో ప్రవేశించి దేహ ఇంద్రియ మనోబుద్ధుల్ని చైతన్యం చేస్తుంది. దానితో జీవుళ్ళు ఈ ప్రపంచాన్ని భోగిస్తారు. ఈ విధంగా పరమాత్మ దేహేంద్రియమనోబుద్ధులనే ఉపాధులతో చేరి – ఆ ఉపాధులతో తాదాత్మ్యం పెట్టుకొని తిరిగి జీవుడయ్యాడు; ఈ జగత్తును సత్యమునుకుంటూ, ఇందులో సుఖభోగాలను వెతుక్కుంటూ ఉన్నాడు. ఎప్పుడైతే పరమాత్మ ఈ దేహేంద్రియ మనోబుద్ధులలో ప్రతిబింబించి వాటితో తాదాత్మ్యం పెట్టుకున్నాడో, దానితో తన స్వరూపాన్ని; స్వభావాన్ని మరచిపోయాడు; **విస్మృత్య సత్య సుఖబోధ స్వరూపం.** యదార్థంగా పరమాత్మ అన్ని కాలాలలో ఒకే ఒక్క విధంగా, ఏ మార్పులు లేకుండా, జనన మరణాలు లేకుండా ఉండేసత్ స్వరూపం. సర్వాన్ని తెలుసుకొనే చిత్ – జ్ఞాన స్వరూపం. అంతేగాదు పరమాత్మ అఖండ ఆనందస్వరూపం. ఏకరసమైన, దుఃఖ రహితమైన సుఖస్వరూపం. కనుక ఆనందంకోసం, సుఖంకోసం ఏవస్తువులకోసం గాని, భోగాల కోసం గాని, విషయాలకోసం గాని పరుగెత్తాల్సిన అవసరంలేదు. అయితే పరమాత్మ తాను తానుగా ఉండక ఈ ఉపాధులతాదాత్మ్యంతో తనను తాను మరచిపోవటం వల్ల – తాను అఖండ ఆనంద స్వరూపుడని మరచిపోవటం వల్ల ఆనందంకోసం విషయ ప్రపంచంలోకి తొంగిచూస్తున్నాడు, విషయవస్తువుల వెంటపడి, వాటికోసం అఱ్ఱులు చాస్తూ జీవుడై సకల దుఃఖాలలో మునిగి పోతున్నాడు.

ఈ తాదాత్మ్యం వల్ల **అస్త వివేక లేశః,** పూర్తిగా వివేకాన్ని కోల్పోతున్నాడు. బుద్ధి కలుషితమై పోతున్నది. దానితో జ్ఞానంకప్పివేయబడుతున్నది. అందుకే తాను ఎప్పుడూ ఉండాలని, అందరికన్న గొప్పగా ఉండాలని, కీర్తి ప్రతిష్టలు సంపాదించాలని, బాగాధనసంపాదన చెయ్యాలని, ప్రపంచంలోని విషయవస్తువుల వల్ల సుఖపడగలనని, నేను – నావారు సుఖంగా – మరింత సుఖంగా ఉండాలని భావిస్తుంటాడు. ఇదే భ్రాంతి, భ్రమ. ఈ భ్రమతో ఈ ప్రపంచంలో కర్మరంగంలోకి దిగుగుతాడు. నిరంతరం శ్రమిస్తుంటాడు, ధనాన్ని వస్తువులను సంపాదిస్తాడు. వాటిని భోగిస్తూ ఆనందిస్తాడు. వెంటనే ఆనందం దీనిలో లేదని, మరొక దానికోసం ప్రయత్నిస్తుంటాడు. తానున్న ఇంటిలో ఆనందంలేదని మరొక ఇంటికోసం, తానున్న ప్రదేశంలో సుఖంలేదని మరొక ప్రదేశం, తానున్న దేశంలో సుఖంలేదని మరోదేశం, తాననుభవించే వస్తువులతో సుఖంలేదని మరో రకం వస్తువులు, తన వారితో సుఖంలేదని వేరే వారికోసం నిరంతర అన్వేషణ సాగిస్తాడు. ఈ అన్వేషణలో అలసిపోతాడే గాని అనుకున్నది సాధించలేడు. తాత్కాలిక ప్రయోజనాలు పొందుతాడేగాని శాశ్వత లక్ష్యాన్ని చేరుకోలేడు; పైగా స్వరూపానికి దూరమై పోతుంటాడు. తన స్వరూపాన్ని తాను మరచినా; బుద్ధిలో సరైన వివేకం ఉంటే పెద్దల మాటలువింటే – శాస్త్రాలఘోషను అర్థంచేసుకుంటే సక్రమంగా ప్రయాణించి తన స్వరూపాన్ని చేరుకోవచ్చు. సరైన వివేకం లేకుంటే ప్రపంచం వెంటబడి, వెనుతిరిగి చూడకుండా పూర్తిగా భ్రష్టుడై, ఇంకా ఇంకా ఇందులో కూరుకుపోతాడు. ఇదే దేవుడు జీవుడైనవిధం. జీవుడెలా సంసార బంధంలో ఇరుక్కుంటున్నాడు?....

జీవుడైన దేవుడు ఎలా బంధంలో చిక్కుకున్నాడు?

**శ్లో॥ ఇత్థం ప్రమాదవశతః పరిముహ్యమానః**
**దేహాత్మ బుద్ధి పరికల్పిత కర్మ బంధః।**
**స్వర్గాది భోగ గమనాగమనాతి భిన్నః**
**లూతా వదేష భవ మభ్యగ మచ్చిదాత్మా ॥ 7**

**ప్రతిపదార్థం :–** ఇత్థం = ఈ ప్రకారంగా; ప్రమాదవశతః = పొరపాటుగా; పరిముహ్యమానః = పూర్తిగా భ్రాంతిలో పడిపోయి; దేహాత్మబుద్ధి = నేను దేహాన్ని అనేబుద్ధిచేత; పరికల్పిత కర్మబంధః = కల్పించబడ్డ కర్మబంధంలో చిక్కుకొని; స్వర్గాదిభోగ = స్వర్గసుఖాలు మొ॥న వాటికోసం; గమన ఆగమనఅతిభిన్న = రాకపోకలవల్ల దుఃఖాన్ని పొంది; లూతావత్ = సాలెపురుగువలె; ఏషచిదాత్మా = ఈచిద్రూపుడు; భవం = సంసారాన్ని; అభ్యగమత్ = పొందుతున్నాడు.

**భావం :–** ఈప్రకారంగా తనను తాను మరిచి వివేకం కోల్పోవటం వల్ల భ్రాంతిలో మునిగినవాడై, నేను దేహాన్ని అనే నిశ్చయంతో కర్మబంధంలో చిక్కుకొని స్వర్గాది సుఖాల కోసం రాకపోకలు సాగించి, దుఃఖాలు పడుతూ సాలె పురుగులాగా ఈ ఆత్మ స్వరూపుడు సంసార బంధంలో ఇరుక్కుంటున్నాడు.

**వ్యాఖ్య :–** పరమాత్మ జీవుడై ఎలా సంసార బంధంలో ఇరుక్కుపోతున్నాడో ఒక అద్భుతమైన ఉపమానం ద్వారా తెలియజేస్తున్నారు.

సాలెపురుగు తన నోట్లో నుండి వచ్చే చొంగతో పైకీ క్రిందకీ తిరుగుతూ ఆ దారాలతో ఒక అందమైన గూడు అల్లుకుంటుంది. అలా అల్లుకొని చివరకు అది అందులోనే ఇరుక్కుపోతుంది. అలాగే తానే సృష్టించు కున్న ఈ జగత్తులో అంతటా వ్యాపించియున్న పరమాత్మ అన్ని ఉపాధులలో ప్రతిబింబించి, ఆ దేహాలలో ఉండి, తనను తాను మరచి పోతున్నాడు. తాను పరమాత్మనని ఆనందస్వరూపుడనని మరచిపోయి, ఆ దేహమేతాను అనుకొని జీవుడై పోతున్నాడు. ఎప్పుడైతే జీవుణ్ణని, దేహాన్నని భావించాడో అంతే – ఇక వెనుదిరిగి చూచేపనిలేకుండా తనకు సుఖం–ఆనందం కావాలనుకుంటున్నాడు. ఏవేవో అవసరాలనుకుంటున్నాడు. వాటి కొరకు కర్మలు చేస్తుంటాడు. తగిన ఫలితాల కోసం ఎదురుచూస్తుంటాడు. పని సరిగ్గా జరగక, ఆశించిన ఫలితాలు రాకపోతే తిరిగి తిరిగి కర్మలు చేస్తుంటాడు, మార్చి మార్చి చేస్తుంటాడు. ఫలితం వచ్చేదాకా ఆందోళన, ఫలితం కలిగితే సంతోషం, ఫలితం కలిగితే సంతోషం కలిగి అంతటితో ఆగిపోతాడా? లేదు. మరింత గొప్ప ఫలితం కొరకు, తపన పడుతుంటాడు, మళ్ళీ కర్మరంగంలో ఇరుక్కుంటాడు. అదృష్టవశాత్తు పట్టిందల్లా

బంగారమైె, కోరిన కోరికలన్నీ తీరుతుంటే ఇంతకంటే గొప్ప భోగాలు స్వర్గలోకంలో లభిస్తాయని తెలుసుకుంటాడు. వాటికోసం పుణ్యకర్మలు, సత్కర్మలు, దానధర్మాలు చేస్తాడు. ఆ స్వర్గలోకభోగాలను అనుభవిస్తాడు. అయితే అవీ శాశ్వతం కాదు గనుక పుణ్యఫలాలు ఖర్చుకాగానే తిరిగి మానవలోకానికి రావాల్సిందే. మళ్ళీ కర్మలు – కర్మఫలాలు–జన్మలు. ఇలా కర్మ జన్మ వలయంలో – సంసారబంధంలో ఇరుక్కుపోతుంటాడు. ఇదంతా తనను తాను మరచి – తానుకాని దేహాన్ని తానని భ్రమచెందటం వల్లనే – ఇంతకీ ఈ జీవుడెవరు? ఈ జీవుడి కొరకు లోకాలను సృజించిన ఆ దేవుడెవరు?

ఇంతకూ జీవుడెవరు? ఈశ్వరుడెవరు?

**శ్లో॥ మాయాయుతస్త్వ గమ దీశ్వరతాం చిదాత్మ**
**చావిద్యయా యుగ భవద్ధృత జీవభావః ।**
**మాయా భవేత్ విమల సత్త్వ గుణ ప్రధానా**
**ప్రోక్తా మలా పిహిత సత్త్వగుణా త్వవిద్యా ॥ 8**

**ప్రతిపదార్థం :-** చిదాత్మతు = చైతన్యరూప ఆత్మ; మాయాయుతః = మాయతోకూడినవాడై; ఈశ్వరతాం ఆగమః = ఈశ్వరుడవుతున్నాడు; అ విద్యయాయుక్ = అవిద్యతో కూడినప్పుడు; చ = ఆ ఆత్మయే; ధృతజీవభావః = జీవభావాన్ని స్వీకరించినవాడు; భవత = అవుతున్నాడు, విమల సత్వగుణ ప్రధానా = శుద్ధ సత్వగుణంలో ఉంటే; మాయాభవేత్ = మాయఅవుతున్నది; మలాపిహిత సత్వగుణాతు = మలిన సత్త్వగుణం తో ఉంటే; అవిద్యాప్రోక్తాః = అవిద్య అంటారు.

**భావం :-** చైతన్య స్వరూప పరమాత్మ మాయతో కూడి ఈశ్వరుడవుతున్నాడు. అవిద్యతో కూడినప్పుడు ఆ పరమాత్మే జీవుడవుతున్నాడు. శుద్ధ సత్వగుణం ప్రధానంగా కలిగినది మాయ. మలినంతో కప్పబడ్డ సత్వగుణం ప్రధానంగా కలిగినది అవిద్య.

**వ్యాఖ్య :- దేవుడు జీవుడెందుకవుతున్నాడు? ఎందుకు ఇక్కడ ఇరుక్కుపోతున్నాడు? జీవుణ్ణి ఆకర్షించి ఇరికించే ఈ నామరూప జగత్తు నెవరు సృష్టిస్తున్నారు? అతడి రాకపోకల నెవరు ఒక నియమం ప్రకారం నడిపిస్తున్నారు?**

పరమాత్మ ఎప్పుడూ నిశ్చలంగా, నిత్యంగా నిర్వికారంగా, ఆనందస్వరూపంగా ఉంటాడు. ఆయనకు సృష్టిచేయాల్సిన అవసరమూలేదు; చేయాలనే సంకల్పమూ లేదు. కాని పూర్వ సృష్టిలోని జీవుళ్ళందరూ దేహాలు వదలి ప్రళయకాలంలో అవ్యక్తంలో ఉంటారు. ఆ జీవుళ్ళు సంపాదించుకున్న వాసనలు సమిష్టిగా అవ్యక్తంలో ఉంటాయి. ఆ వాసనలన్నీ 3 గుణాలతో ఉంటాయి. అయితే అవి సమిష్టిగా ఉన్నప్పుడు శుద్ధమైన సత్వగుణం ప్రధానంగా ఉంటాయి. అవే వాసనలు వ్యష్టిగా ఉన్నప్పుడు రజస్త మోగుణాలవల్ల మలినమైన సత్వగుణంగా ఉంటాయి.

శుద్ధమైన సత్వగుణం ప్రధానంగా ఉన్న సమిష్టి వాసనలను 'మాయ' అంటారు. మలినమైన సత్వగుణం ప్రధానంగా ఉన్న వ్యష్టి వాసనలను 'అవిద్య' అంటారు. మాయతో కూడిన చైతన్యం 'ఈశ్వరుడు' అవుతున్నాడు. అవిద్యతో కూడిన చైతన్యం 'జీవుడు' అవుతున్నాడు.

ఈశ్వరుడు సర్వశక్తి వంతుడు, లోకాలకు అధిపతి; లోకాలను సృజించేవాడు, నడిపేవాడు, లయంచేసేవాడు. ఆయనే ఈ నామరూప జగత్తును సృష్టిస్తున్నాడు. జీవుళ్ళ యొక్క అనుభవాలకు తగిన విషయాలను సృష్టించి, ఆకర్షణలు కలిగిస్తున్నాడు. జీవుడు చేసే కర్మలకు తగిన కర్మఫలాలను అందిస్తాడు. **"కర్తృరాజ్ఞయా ప్రాప్యతే ఫలం" అని భగవాన్ రమణ మహర్షులవారు ఉపదేశసారంలో చెప్పిన కర్త "ఈశ్వరుడే".** ఆయనే సర్వకర్మ ఫలప్రదాత, అంతేకాదు. ఆ ఈశ్వరుడే వారి వారి వాసనల కనుగుణంగా తగిన దేహాలను సృష్టిస్తున్నాడు. పరమాత్మ చైతన్యం సర్వత్రా వ్యాపించియుంటుంది గనుక ఆ దేహాలలో కూడా ఉంటుంది. అదే దేహాలతో తాదాత్మ్యం చెంది తనను తాను జీవుడుగా భావించుకొంటున్నది. ఈ విధంగా దేవుడు కాస్తా జీవుడయ్యాడు.

జీవుడైన దేవుడు ఇక్కడ చేసే కర్మలకారణంగా ఆయాలోకాలకు వెళ్ళి కర్మఫలంగా సుఖ దుఃఖాలను అనుభవించి తిరిగి వస్తుంటాడు. ఆ జీవుడు కర్మలు చేయటానికి దేహేంద్రియాలను; ప్రపంచాన్ని సృష్టించాడు ఈశ్వరుడు.

ఆ జీవుడు కర్మ ఫలాలను అనుభవిచటానికి తగిన సూక్ష్మశరీరాలను (మనస్సులను), అలాగే స్వర్గాది లోకాలను కూడా సృష్టించాడు.

ఈ విధంగా కర్మ ఫలాన్ని అనుభవించే జీవుడు, కర్మ ఫలాలను అందించే ఈశ్వరుడు ఇద్దరూ ఒకే ఆత్మచైతన్యం. జీవుడు ఆత్మనని తెలియని అజ్ఞానంలో ఉన్నంత కాలం ఈ జగత్తును సత్య మనుకుంటాడు; జగత్తును సృష్టించిన ఈశ్వరుణ్ణి సత్యమనుకుంటాడు; ఈ జనన మరణాలూ సత్యమనుకుంటాడు; అజ్ఞానంలో ఉండి ఈ సంసార జనన మరణ చక్రంలో ఇరుక్కుపోతాడు. రాత్రి స్వప్నంలో స్వప్న పురుషుడు ఎలాగైతే అప్పుడు అక్కడ జరిగిన వన్నీ సత్యమను కొని దుఃఖిస్తూ, భయపడుతూ, ఆనందిస్తూ ఉంటాడో – అలాగే ఈ జీవుడు సుఖాదుఃఖాలలో మునిగిపోతాడు. **మరి దీనికి నిష్కృతి ఎట్లా? ఎందుకీ భ్రమ?**

ఒక్కటే అయిన ఆత్మ అనేకంగా ఎందుకు కనిపిస్తున్నది? కదలని ఆత్మ ఎలా కదులుతున్నది?

**శ్లో॥ ఏకోఽప్యనేక ఇవ భాతి శరీర భేదాత్**
**ఆత్మా ఘటాది గతభేద వశాద్ వియద్వత్।**
**దేహేంద్రియాదిషు చలత్సు నిజప్రకాశాత్**
**పూర్ణో ఽ పి నిశ్చల తరో ఽ పి వికార వద్వత్ ॥9**

**ప్రతిపదార్థం :–** ఘటాది భేదవశాత్ = కుండ మొ॥న వాటిభేదాలవల్ల; వియత్వత్ = ఒక్కటే అయిన ఆకాశం (అనేకం)లాగా; శరీరభేదాత్ = శరీరభేదాలను బట్టి; ఏకః అపి ఆత్మ = ఒక్కటే అయిన ఆత్మ; అనేక ఇవభాతి = అనేకంలాగా ప్రకాశిస్తున్నది. పూర్ణ అపినిశ్చలత అపి = పూర్ణము, నిశ్చలము అయినప్పటికీ (పరమాత్మప్రకాశం) చలత్సు దేహేంద్రియాదిషు = కదులుతుండే దేహేంద్రియాలలో; నిజప్రకాశాత్ = ప్రతిఫలించటంవల్ల; వికారవద్వత్ = కదులుతున్నట్లు, మార్పులు చెందుతున్నట్లు – (అనిపిస్తుంది)

**భావం :–** కుండ మొదలైన వాటిలో భేదాలవల్ల ఒక్కటే అయిన ఆకాశం వేరు వేరుగా కనిపించినట్లు శరీరభేదాలను బట్టి ఒక్కటే అయిన ఆత్మ అనేకంగా కనిపిస్తుంది. పూర్ణము నిశ్చలము అయిన పరమాత్మ ప్రకాశం దేహేంద్రియాలలో

ప్రతి ఫలించినప్పుడు ఆ దేహేంద్రియాల కదలికలవల్ల ఆ ప్రకాశం కదులుతున్నట్లు భ్రమ కలుగుతుంది.

**వ్యాఖ్య :- ఏకమైన పరమాత్మ అనేక జీవుళ్ళుగా, అనేక రూపాలుగా, ఎలా వ్యక్తమవుతున్నది? ఏమార్పులు లేని పరమాత్మ అనేక మార్పులతో వికారాలతో కూడిన జీవుళ్ళుగా ఎలా వ్యక్తమవుతున్నాడు? దీనికి సమాధానమే ఈ శ్లోకం.**

పరమాత్మ నిజంగా పూర్ణుడు, నిశ్చలుడు, ఏ కదలిక లేని వాడు, ఏ మార్పులు, వికారాలు లేనివాడు. ఆయన 'నిజంగా' అనేకంగా మారడు. ఏవికారాలకు లోను గాడు.

ఆకాశం అంతా ఎప్పుడూ ఒక్కటే. దానిలో ఏ భాగాలు లేవు. కాని వేరు వేరు కుండలు, కూజాలు, పిడతలు తయారైనప్పుడు వాటి అన్నింటిలోను వేరు వేరు కొలతలతో, వేరు వేరు ఆకారాలతో ఆకాశం ఉన్నట్లు అనిపిస్తుంది. కుండలోని ఆకాశం కుండాకారంగా, కూజాలోని ఆకాశం కూజాకారంగా కనిపిస్తుంది. ఆ కుండలు కూజాలు ఉన్నంతవరకు ఆకాశం ముక్కలు ముక్కలై ఒక్కొక్క ముక్క ఒక్కొక్క కుండలో – కూజాలో – పాత్రలో ఉన్నట్లు అనిపిస్తుంది. అయితే వాటిని తొలగించినప్పుడు – లేదా పగలగొట్టినప్పుడు అక్కడ ఇక ఆకాశం ముక్కలు ముక్కలుగా ఉండదు. అంతా ఒక్కటిగా – ఏకంగా – ఎప్పటిలాగా కనిపిస్తుంది. అంటే నిజంగా ఆకాశం ఎప్పుడూ ముక్కలు కాలేదు, అనేకం కాలేదు. అది అప్పుడూ, ఇప్పుడూ ఎప్పుడూ ఒక్కటే. ఐతే కుండల దృష్టి ఉన్నంతవరకూ మాత్రం ఆకాశం అనేకం అయినట్లు భ్రమకలుగుతుంది. అంతే.

అలాగే ఒక్కటే అయిన ఆత్మకూడా శరీరాల దృష్టినిబట్టి ఒక్కొక్క శరీరంలో ఒక్కొక్క ఆత్మ ఉన్నదనే భ్రమ కలిగి అనేక ఆత్మలున్నట్లు భ్రమిస్తాం. కాని నిజంగా ఆత్మ ఒక్కటే. ఏకం – అద్వయం – దీనిని బట్టి ఒక్కడే అయిన పరమాత్మ అనేక జీవుళ్ళు అయ్యాడనటం కూడా అజ్ఞానుల దృష్టిని బట్టే తప్ప నిజంగా పరమాత్మ ఎప్పుడూ ఒక్కడే. అది ఏకం – అద్వయం. ఎన్ని జీవుళ్ళున్నా, అసలు జీవుళ్ళేలేకున్నా పరమాత్మలో ఏ విభాగమూ ఎప్పుడూలేదు. చూచేవాళ్ళ దృష్టిలోనే ఈ అనేకత్వం.

ఇక పుట్టిన దగ్గరనుండి మరణించేంత వరకు జీవుళ్ళలో కనబడే మార్పులు, వికారాలు, పెరుగుదల, నశింపు, అన్నీకూడా దేహాదుల మార్పులు, వికారాలే తప్ప పరమాత్మలో ఏమార్పులు లేవు. నీటిలో సూర్యబింబం ప్రతిబింబించినప్పుడు నీరు అలలు అలలుగా కదులుతుంటే సూర్యబింబం కూడా కదులుతున్నట్లు, వణుకుతున్నట్లు అనిపిస్తుంది. కాని నిజంగా సూర్యబింబం అట్లాగే ఏ కదలికా లేకుండా ఉన్నది. నీరు మాత్రమే కదులుతున్నది అని తెలుస్తుంది. అలాగే కదులుతూ ఉండే దేహేంద్రియాలలో ప్రతిబింబించిన చైతన్యం దేహేంద్రియాల కదలికని బట్టి కదులుతున్నట్టనిపిస్తుందే గాని నిజంగా కదలదు. నిశ్చలంగానే ఉంటుంది.

కదులుతున్న బస్సులో నిశ్చలంగా కూర్చొని నిద్రపోతున్న నీవు కదులుతున్నట్లు నిపిస్తుంది గాని, నిజంగా కదులుతున్నది బస్సే గాని నీవు కాదు. అలాగే చైతన్యం కూడా. కదులుతున్నది ఉపాధులేగాని చైతన్యంకాదు. చైతన్యం కదిలేందుకు అవకాశం లేదు. దీనిని బట్టి పరమాత్మ ఎప్పుడూ ఏకమే. అనేకత్వం లేనేలేదు. అనేకంగా ఉన్నట్లు భ్రమలో ఉన్న చూచేవాడి దృష్టిదోషమే తప్ప ఆత్మ దోషం కాదు. అలాగే పుట్టటం, పెరగటం, మార్పులు చెందటం, నశించటం – ఇవన్నీ కూడా దేహాదుల వికారాలేగాని – ఆత్మకు చెందినవి కావు.

**– మరి భ్రమలో ఉన్న జీవుడి గతేమిటి? – వాడిగతి ఎప్పటికి అంతేనా?– ఎవడు బంధాలను దుఃఖాలను వదిలించుకోగలడు?–**

**ఉపో :–** దేవుడు ఈ జగత్తును సృష్టించి, ఉపాధులలో కూర్చొని జీవుడై – తన స్వరూపాన్ని మరచి, భ్రాంతిలో ఈ జననమరణ సంసారంలో చిక్కి దుఃఖాలు పడుతున్నాడు. మరి అతడి గతి ఇంతేనా? తన స్వస్థితిని చేరుకొని ఆనంద సాగరుడుగా ఉండలేడా? ఎవడు అలా ఉండ గలుగుతాడు?

**శ్లో॥ ఏవం భవార్ణవ నిమజ్జన దుఃఖితేషు**
**లోకేషు పూర్వజని సంచిత పుణ్య పుంజైః ।**
**కశ్చిద్ విశుద్ధ మతి రేత్య గురుం కృపాబ్ధిం**
**ప్రాహ ప్రణమ్య భవసాగర లంఘనేచ్ఛుః ॥ 10**

**ప్రతిపదార్థం :–**ఏవం = ఈ ప్రకారంగా; భవార్ణవ నిమజ్జన = సంసారసాగరంలో మునగటంవల్ల; దుఃఖితేషులోకేషు = దుఃఖపడుతూ ఉన్న వారిలో; కశ్చిత్ = ఎక్కడో ఒక్కడు; పూర్వజని సంచిత పుణ్యపుంజైః = పూర్వంలో సంపాదించుకున్న పుణ్యాలవల్ల; విశుద్ధమతిః = శుద్ధబుద్ధిగలవాడై; కృపాబ్ధింగురుం = కరుణాసముద్రుడైన గురువును, ఏత్య = సమీపించి; ప్రణమ్య = నమస్కరించి; భవసాగరలంఘన ఇచ్ఛుః = సంసారసాగరాన్ని దాటాలనే కోరికగలవాడై; ప్రాహ = అడిగాడు.

**భావం :–** ఈ ప్రకారంగా సంసార సాగరంలో మునిగి దుఃఖించే జీవుళ్ళలో ఏ ఒక్కడో పూర్వజన్మ పుణ్యాలవల్ల శుద్ధమైన బుద్ధిగలవాడై సంసార సముద్రాన్ని దాటాలనే కోరికతో (జన్మరాహిత్యం కొరకై) కరుణా సముద్రుడైన గురువును సమీపించి సమస్కరించి అంటున్నాడు ఇలా –

**వ్యాఖ్య :–** పరమాత్మ దేహాలలో కూర్చొని, తననుతాను మరచిపోయి, జీవుణ్ణనే భ్రమతో శరీర మనోబుద్ధులతో తాదాత్మ్యంచెంది కోరికలను తీర్చుకొనుటకు సంకల్పాలు చేసి, వాటి కనుగుణంగా కర్మలు చేసి, ఆ కర్మఫల అనుభవాలకోసం ఆయాలోకాలకు వెళ్ళి, తిరిగి వస్తూ, అనేక జన్మలెత్తుతూ ఈ జనన మరణ సంసార చక్రంలో ఇరుక్కుపోతున్నాడు. పుట్టటం, పెరగటం, కర్మలు చేయటం, కర్మఫలాలు రావటం, వాటిని అనుభవించటానికి మళ్ళీ జన్మలెత్తటం, ఇలా సంసారంలో బంధించబడి పుడుతూ, చస్తూ, దుఃఖసముద్రంలో–భవసాగరంలో మునిగిపోతున్నాడు. **మరి దీనికి పరిష్కారం ఏమిటి? ఎప్పుడు తెలుసుకుంటాడు, తాను జీవుణ్ణి కాదు, పరమాత్మను అని? ఎప్పుడు తానుతానుగా పరమాత్మగా ఆనందంగా ఉండి పోతాడు?**

తనంతట తానుగా ఎప్పటికీ తెలుసుకోలేడు. ఎవరో ఒకరు తెలియజేయాలి. ఎవరు? గురువులుగాని, గ్రంథాలుగాని తెలియజేయాల్సిందే. అయితే ఆ గ్రంథాలు చదవాలని గాని, గురువులను ఆశ్రయించాలనిగాని ఎలా తెలుస్తుంది? ఎవరు చెబుతారు? ఇది మాత్రం పూర్వజన్మ సుకృతం ఉంటేనే తెలుస్తుంది, తెలుసుకోవాలని బుద్ధిపుడుతుంది. నిజంగా ప్రతి జీవుడిలోను

పరమాత్మే గురురూపంలో ఉంటాడు. అయితే ఆయనను కప్పి అనేక వాసనల పొరలు అడ్డు ఉంటాయి. అందువల్ల లోపలనుండి ఆయన ఎంత మొత్తుకున్నా జీవుడికి వినిపించదు, వినిపించుకోడు. ఆ వాసనల పొరలు కరిగి పోయినప్పుడు – పల్చబడినప్పుడు మాత్రమే లోపలి గురువు యొక్క మాటలు వినిపిస్తాయి. మరి ఆ వాసనల పొరలు కరిగేదెప్పుడు? పెరిగేదెప్పుడు? ఎందుకు కరుగుతాయి? ఎందుకు పెరుగుతాయి? –

మానవుడు ఈ ప్రపంచంలోకి వచ్చిన తర్వాత అనేక మైన కర్మలు చేస్తుంటాడు. లోపల ఏవేవో కోరికలుంటాయి, చేరుకోవలసిన లక్ష్యాలుంటాయి. వాటికొరకు కర్మలు చేస్తుంటాడు. అలా కర్మలు చేసేటప్పుడు అతడి యొక్క దృక్పథం ఎలా ఉంటుందో? అతడి ఆలోచలు ఎలా ఉంటాయో? అనే దానిని బట్టి అతడిలో వాసనలు చేరుకుంటాయి. ఇందులో పుణ్యవాసనలు, పాపవాసనలు రెండు రకాలు. అతడి ఆలోచనలు, దృక్పథం తప్పుడువైతే, పరపీడను కలిగించేవైతే పాపవాసనలు పేరుకుంటాయి. వాటితో వాసనల తెరలు బాగా పెరిగి భగవంతుని చైతన్యం పూర్తిగా మరుగున పడిపోతుంది. అలాగాక మంచి దృక్పథంలో, ఉన్నత మైన ఆలోచనలతో ఉంటే అతడిలో పుణ్యవాసనలు పేరుకుంటాయి. అలా పుణ్యవాసనలు పెరిగినకొద్దీ పాపవాసనలు కరిగిపోయి, వాసనల తెరలు శుద్ధమై పోతాయి. శుద్ధమైన అద్దంలా తయారవుతాయి. అప్పుడు లోనున్న పరమాత్మ చైతన్యం చక్కగా వ్యక్తమవుతుంది. ఆ పరమాత్మ సాన్నిధ్యం, ఆయనస్పర్శ బుద్ధిలో శుద్ధత్వాన్ని, సూక్ష్మత్వాన్ని కలిగిస్తుంది. దానితో అతడికి ప్రాపంచిక విషయాలపట్ల, సుఖాలపట్ల, భోగాలపట్ల అనాసక్తి ఏర్పడుతుంది. లోనున్న పరమాత్మను తెలుసుకోవాలని, దగ్గరకావాలని, ఆయనతో సాన్నిహిత్యం ద్వారా పొందే ఆనందాన్ని ఇంకా ఇంకా అనుభవించాలని తపన కలుగుతుంది. దానితో ఈ ప్రాపంచిక దుఃఖాలనుండి బయట పడాలని తీవ్ర ఆరాటం కలుగుతుంది. అయితే ఎంత ఆరాటం ఉన్నా తనంతతానుగా ఎవ్వరూ ఈ ప్రాపంచిక దుఃఖాల నుండి బయట పడలేరు. పరమాత్మను చేరుకొని ఆనందించలేరు. పరమాత్మను చేరుకోవాలంటే మార్గం

తెలియాలి. ఆ మార్గాన్ని చూపే వాడే సద్గురువు. అట్టి సద్గురువుకై అన్వేషణ ప్రారంభిస్తాడు. **మరి సద్గురువు ఎవరికి లభిస్తాడు?** ఎవరు అనేక జన్మలలో సుకృతం చేసుకోన్నారో, ఎంత ఎక్కువ ఆరాటంతో తపనతో చేసుకున్నారో, అట్టి వారికి తప్పని సరిగా సద్గురువు లభిస్తాడు. జీవుడు తాను చేసిన సత్కర్మలను బట్టి, అతడిలోని పుణ్య వాసనల తీవ్రతను బట్టి కొందరికి త్వరగానే సద్గురువు దర్శనం లభిస్తుంది; కొందరికి స్వయంగా ఆ సద్గురువే తటస్థపడతాడు. అంతగా సత్మర్మలు చేయనివారికి సద్గురువు ఎదురుగా ఉన్నా గుర్తించరు; ఆశ్రయించరు; ఒక వేళ ఆశ్రయించినా ఏవో కారణాలతో వదిలేస్తారు. లేదా ఆ గురువే వారిని వదిలేస్తాడు. ఇక ఏ సత్కర్మలు చేయని వారికి అసలు గురువంటే ఎవరో ఏమిటో తెలియదు. గురువు లభించడు. వారు పూర్తిగా అజ్ఞానంలోనే ఉండిపోతారు. కనుక అనేక పూర్వజన్మల పుణ్యఫలం ఉంటేనే సద్గురువు లభించేది.

**ఇక సద్గురువు ఎలాంటి వాడై ఉండాలి?** "కృపాబ్ధింగురుం". – 'కృపాబ్ధిం' అన్నారు. అంటే కరుణా సముద్రుడు కావాలి అని. ఎందుకు కరుణా సముద్రుడై ఉండాలి? శిష్యులు అజ్ఞానంలో ఉంటారు. కనుక అనేక తప్పులు చేస్తుంటారు. పొరపాట్లు చేస్తుంటారు. కొందరికి గురువు యొక్క విలువ తెలియదు. కొందరికి గౌరవించటం తెలియదు. కొందరు గురువుని తమతో సమానంగా మానవ మాత్రునిగా భావించుకుంటారు. ఏదో గ్రంథాలలో ఉన్న విషయాలను చదివి చెప్పే టీచరుగా భావిస్తారు. కొందరు తమ దృష్టిని బట్టి జీతం ఇస్తున్నాం అనే భావంలో ఉంటారు. ఐతే శిష్యులు ఎలాంటి పొరపాట్లు చేసినా, తప్పులు చేసినా వాటిని పట్టించుకోకుండా వారికి సరియైన జ్ఞానాన్ని బోధించి, వారి లోటు పాట్లను సరిచేసే సహనం గలవాడై ఉండాలి గురువు. శిష్యుల ఉన్నతికై తాను వారి పట్ల కరుణగలవాడై ఉండాలి. అందుకే 'కృపాబ్ధిం'. అలాగే గురువు శ్రోత్రియుడు – బ్రహ్మనిష్టుడు ఐ ఉండాలి. (ముండక). ఆయనకు సరైనజ్ఞానంలేక పోతే శిష్యుల అజ్ఞానం తొలగదు.

'గు' అంటే అజ్ఞానం. 'రు' అంటే తొలగించేవాడు. **ఇలా అజ్ఞానాన్ని తొలగించే గురువును ఎలా సమీపించాలి?**

**ప్రణమ్య :-** గురువును శిష్యుడు ఎలా సమీపించాలి? ఎలా గౌరవించాలి? అనే దానికి గుర్తుగా ఇక్కడ 'ప్రణమ్య' అనే పదం వాడారు. ప్రణమ్య అంటే నమస్కరించటం. ఎలా నమస్కరించాలి గురువుకు? నమస్కరించేటప్పుడు ఎలాంటి ఆర్తి ఉండాలి? ఎలాంటి భావన ఉండాలి? గీత 4వ ఆధ్యాయంలో గురువును ఎలా సమీపించాలో 34వ శ్లోకంలో చెప్పారు. **"తద్విద్ధి ప్రణిపాతేన – పరిప్రశ్నేన – సేవయా"** అని. నిజంగా గురువుకు ఎలా నమస్కరించాలో ఎవరూ చెప్పనక్కరలేదు. ఎప్పుడు? గురువుకు సంపూర్ణ శరణాగతుడైనప్పుడు, "నన్ను ఉద్ధరించటానికి దిగివచ్చిన సాక్షాత్ పరబ్రహ్మయే నాగురువు, నీట ముంచినా పాల ముంచినా నీదే భారం. నీవే తప్ప నితః పరం బెరుగ"నని నీ మనస్సులో దృఢమైన భావన ఉంటే ఇక నీ నమస్కారం ఎలా ఉండాలో అలా ఉంటుంది. అలాంటి భావన లేనప్పుడు ఏదో మొక్కుబడిగా అందరూ చేస్తున్నారు గనుక చెయ్యకపోతే బాగుండదని అలవాటుగా చేసినట్లుంటుంది. గురువుకు నమస్కారం ఎలా చేయాలో గురుగీత చెబుతుంది.

**శ్లో॥ ఉరసా శిరసాచైవ మనసా వచసా దృశా ।**

**పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామో ఽ ష్టాంగ ఉచ్యతే ॥**

వక్షస్థలం (హృదయం) శిరస్సు, మనుస్సు, మాట, చూపు, కాళ్ళు, చేతులు, చెవులు ఈ 8 అవయావాలతో చేసేది అష్టాంగ నమస్కారం (సాగిల పడటం కాదు ఇది) గురువుకు నమస్కరించటంలో పై ఎనిమిదింటిని వినియోగించాలి. హృదయ పూర్వకంగా మనస్సులో పైన చెప్పిన భావం; అదే నీలో మాటగా, అది నీవే చెవులతో వింటున్నట్లు ఉండాలి. ఇక కాళ్ళు చేతులు శిరస్సు ఎలాగూ ఉపయోగిస్తాం. పాదాలనుండి పైకి చూపు ప్రసరించాలి.

**ప్రాహ :-** ఇలా అష్టాంగ నమస్కారం చేస్తే చాలదు. తన బాధను, తనలోని తపనను, తెలిపి తనకు కావలసినదేమిటో అడగాలి. ఆ అడగటం తెలుసుకోవటం కోసం అడగాలి. పరీక్షించటానికో, బోల్తా కొట్టించటానికో

అడగరాదు. అదే 'పరిప్రశ్నేన'. శిష్యుడు అడిగిన తీరును బట్టి అతడి పరిపక్వత తెలుసుకుంటాడు గురువు.

ఆదర్శ ప్రాయుడైన శిష్యుడు మహాత్ముడైన సద్గురువును సమీపించి ఏమంటున్నాడో - రాబోయే 5 శ్లోకాల్లో -

**శ్లో॥ సంసార ఘోర జలధౌ భగవన్ నపారే**
**తాపత్రయోఘ దహనే సహజారి నక్రే ।**
**మోహాంభసి ప్రచల దుద్భవ మృత్యుభంగే**
**వీక్ష్యాంతరస్మి పతితం జగదద్యభీతః ॥ 11**

**ప్రతిపదార్థం :-** భగవన్ = ఓ పూజ్యుడా!; అపారే = అంతులేని; సంసారఘోరజలధౌ = సంసారమనే భయంకర సముద్రంలో; తాపత్రయోఘ దహనే = తాపత్రయాలనే బడబాగ్నిలో; సహజారినక్రే = సహజశతృవులనే మొసళ్ళతో; మోహాంభసి = మోహమనే నీటిలో; ప్రచలత్ ఉద్భవ = కదులుతూ పుడుతున్న; మృత్యుభంగే = మృత్యుతరంగాలలో; పతితంజగత్ = పడిన ఈ జగత్తును; వీక్ష్య = చూచి; అద్య = నేడు; భీతః అస్మి = భయ పడుతున్నాను.

**భావం :-** ఓ పూజ్యుడా! అంతులేని ఈ భయంకర సంసార సాగరంలో తాపత్రయాలనే బడ బాగ్నిలో, సహజశత్రువులనే మొసళ్ళతో, మోహమనే నీటిలో పుట్టే మృత్యు తరంగాలలో పడిన ఈ జగత్తును చూచి, నేడు నేను భయపడుతున్నాను.

**వ్యాఖ్య :-** శిష్యుడు సద్గురువును సమీపించి నమస్కరించి ముందుగా తన బాధను వ్యక్తం చేస్తున్నాడు. నిజంగా అతడి బాధ ఇంటిలోని అశాంతి కాదు, పేదరికంకాదు, ఉన్న ఆస్తి పోగొట్టుకోవటంకాదు, తనవారు దూరం కావటంకాదు, ఏవేవో కోరికలు పెట్టుకొని అవి తీరకబాధగాదు, శరీర అనారోగ్యంకాదు. అసలు అతడి బాధ అతడి కొక్కడికే గాదు, ఈ లోకంలో పుట్టిన సమస్త మానవులదీ. కాకపోతే అందరూ గుర్తించలేరు. గుర్తించరు. కొద్దిమంది పూర్వ జన్మల సుకృతంగలవారే గుర్తించ గలిగేది. అదే ఈ జనన మరణ రూప సంసారం. ఈ సంసారాన్ని సముద్రంతో పోల్చి చెబుతున్నాడు. కారణం? రెండింటికి చాలా పోలికలున్నాయి.

**(1) అపారే సంసార ఘోరజలధౌ :-** సముద్రం అంతులేనిది. అలాగే ఈ సంసారం కూడా అంతులేనిది. సముద్రం ఒడ్డున నిలిచి చూస్తే అలలు అనంతంగా లేస్తూ పడుతూ ఉంటాయి. అలాగే ఈ సంసారాన్ని కూడా ప్రశాంత మనస్సుతో ఆలోచిస్తే జనన మరణాలతో అనంతంగా సాగిపోవటాన్ని గమనించవచ్చు. సముద్రంలోతును కనిపెట్టలేనట్టే ఈ సంసారం యొక్క అంతాన్ని కూడా కనిపెట్టలేం. అందుకే పోలిక.

**(2) తాపత్రయోఘ దహనే :-** తాపత్రయాలనే బడబాగ్నిలో. సముద్రంలో ఎన్ని అగ్ని పర్వతాలో - అలాగే ఈ సంసారంలో కూడా తాపత్రయాలనే అగ్ని కాల్చి వేస్తుంటుంది మానవులను. అవే ఆధి దైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక తాపాలు. దైవంవల్ల, ప్రకృతి వైపరీత్యాలవల్ల, పంచభూతాలవల్ల వచ్చేవి ఆధి దైవికతాపాలు. చుట్టూఉన్న మనుష్యుల వల్ల, జంతువుల వల్ల, భూతాలవల్ల వచ్చేవి ఆధి భౌతికతాపాలు. మానసికంగా తనలో కలిగే ఆలోచనలవల్ల వచ్చేవి ఆధ్యాత్మికతాపాలు. ఇవి మానవుణ్ణి ఎల్లప్పుడూ తపింప జేస్తాయి గనుక తాపాలు అన్నారు. అందుకే బడబాగ్నితో పోల్చారు.

**(3) సహజారినక్రే :-** సహజశత్రువులైన మొసళ్ళు. ఈ లోకంలో అందరికీ కొందరు సహజ శత్రువులుంటారు. వారంతా బాహ్య శత్రువులు. కాని అందరికీ అంతరంగ శత్రువులుంటారు. అవే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు అనే అరిషడ్వర్గాలు. ఇవి మొసళ్ళలాగా మానవుని పట్టుకొని మ్రింగేస్తాయి సముద్రంలో చిక్కితే మొసళ్ళు మ్రింగేసినట్లుగా -

**(4) మోహాంభసి :-** మోహమనే నీరు, సముద్రంలో నీరుంటుంది. సంసారంలో మోహం ఉంటుంది. నీళ్ళు లేక పోతే సముద్రం లేదు. మోహం లేకపోతే సంసారంలేదు.

**(5) మృత్యుభంగే :-** మృత్యువనే అలలు. అలలు ఒక్కొక్కటి లేస్తూ ఒడ్డుకు వస్తూ మధ్యలోనే పడిపోయేవి కొన్ని, ఒడ్డును తాకి పడిపోయేవి కొన్ని. అలాగే ఈ సంసారంలో జనన మరణాలు కూడా. కొందరు మధ్యలోనే అంతమై పోతుంటే - కొందరు దీర్ఘకాలం జీవిస్తుంటారు. మృత్యువు అంటే మరణం

మాత్రమే కాదు, మార్పు అని కూడా అర్థం. మార్పు అంటే ఒక స్థితిపోయి మరోస్థితి కలగటమే. బాల్యం పోయి యవ్వనం వస్తుంది. యవ్వనం పోయి వార్ధక్యం – వార్ధక్యంపోయి మరణం – మరణం తర్వాత మళ్ళీ జన్మ – ఇలా అలలలాగా మార్పులు వస్తూ పోతూ ఉంటాయి.

**(6) అద్య :–** ఈ సంసారమనే ఘోర సముద్రంలోని తాపాలనే అగ్నితో, సహజ శత్రువులనే మొసళ్ళతో, మోహమనే నీటితో, మార్పులనే అలలతో 'ఇప్పుడు' బాధపడుతున్నాను, భయపడుతున్నాను అంటున్నాడు శిష్యుడు. ఇప్పుడు భయపడటానికి అవన్నీ ఇప్పుడు మాత్రమే ఉన్నాయా? కాదు. అవిఎప్పుడూ ఉన్నాయి. సముద్రంలో అలల లాగా సంసారంలో దుఃఖాలు, బాధలు, భయాలు ఎప్పుడూ ఉంటాయి. కాని నీవు చూచి గుర్తించినప్పుడే నీకు భయం. గుర్తించగానే భయం కలుగుతుంది, వెంటనే తప్పించు కోవాలనే ప్రయత్నం చేస్తావు. అందుకే ఇప్పుడు భయపడుతున్నానని శిష్యుడు అనటం. ఇప్పుడు ఈ సంసారంలోని మృత్యుతరంగాలను – భయం కలిగించే మార్పులను ఒక్కొక్కటీ తలచు కుంటున్నాడు. అలా తలచుకుంటూ వాటిని గురువుకు నివేదిస్తున్నాడు. ఏమని?
– 12లో –

**శ్లో॥ మాతుః స్థితస్యజఠరే వచసాం చ దూరం**
**దుఃఖం పునర్జనన కాల భవం దురూహ్యం ।**
**బాల్యే ఽ పి దుఃఖ మవిషహ్య మవారణీయం**
**ఆలోచ్య భీతి రధునా మహతే మమోత్థా ॥ 12**

**ప్రతిపదార్థం :–** మాతుః జఠరే స్థితస్య = తల్లి గర్భంలో ఉన్నప్పుడు; వచసాందూరం దుఃఖం =చెప్పటానికి వీలు లేనంత దుఃఖం; పునః జననకాలభవం = తిరిగిజన్మించే సమయంలో దుఃఖం; దురూహ్యం = ఊహించవీలుకానిది; బాల్యే అపి = బాల్యంలో కూడా; అవిషహ్యం, అవారణీయం దుఃఖం = సహింపరాని, నివారించలేని దుఃఖం; ఆలోచ్య = ఆలోచిస్తూ ఉంటే; అధునా = ఇప్పుడు; మమ = నాకు; మహతేభీతిః ఉత్థా = గొప్పభయం కలుగుతున్నది.

**భావం :-** తల్లి గర్భంలో ఉన్నప్పుడు చెప్పటానికి వీలులేని దుఃఖం. తిరిగి జన్మించే సమయంలో ఊహించలేని దుఃఖం. బాల్యంలో కూడా సహింపరాని దుఃఖం. వీటిని గురించి ఆలోచించగా నాకు ఇప్పుడు గొప్పభయం కలుగుతున్నది.

**వ్యాఖ్య :-** శిష్యుడు సంసారంలోని మృత్యు తరంగాలను ఒక్కొక్కటే తలచుకుంటుంటే గొప్ప భయం వేస్తున్నది.

(1) ఈలోకంలో పుట్టే ప్రతివాడు ముందు తల్లి గర్భంలో పిండరూపంలో ఉంటాడు. పిండం క్రమ క్రమంగా పెరిగి పెద్దదవుతూ ఉంటుంది. గర్భ సంచిలో అంతాచిమ్మ చీకటి. చోటు చాలా తక్కువ. పిండం పెరిగే కొద్దీ చోటు తగ్గిపోతూ ఉంటుంది. చివరకు గర్భ సంచినిండి ఆ చీకటిలో ఉమ్మనీరు త్రాగుతూ ఉంటాడు జీవుడు. అక్కడ దుర్గంధంలో ఉండాలి. తనకు ఎంత కష్టమైనా, బాధైనా చెప్పుకోటానికి వీలులేదు. నేరం చేసిన వాడు బందిఖానాలో ఉన్నట్లు రెండవ తోడు లేకుండా ఉండాల్సిందే. అక్కడ సూక్ష్మ జీవులు కుడుతున్నా చేయగలిగిందేమీలేదు అనుభవించటం తప్ప. ఇక తల్లి తెలివి తక్కువగా ఏమి తిన్నా – త్రాగినా ఆ బాధ అంతా గర్భంలో ఉన్న శిశువుకు తప్పదు. తల్లి పెద్దగా నవ్వినా, ఇతరులు ఆమెపై అత్యాచారం చేసినా అన్ని బాధలు శిశువుకే. అందుకే ఈ భాధలు చెప్పనలవిగానివని అనటం.

(2) ఇక పుట్టే సమయంలో కూడా ఊహించలేనంత దుఃఖం. ఎందుకంటే అన్ని అవయవాలు తయారైన తర్వాత పూర్వ జన్మస్మృతి కలుగుతుంది. అన్ని విషయాలు తెలుసుకోగల మనస్సుకు గతించిన జన్మలు ఎలా వృధాచేసుకున్నది గుర్తురావటంతో ఊహించలేని దుఃఖం. మరల ఈ జన్మను కూడా వృధా చేసుకుంటానేమోనని విపరీతమైన దుఃఖం, భయం. గర్భంలో తలక్రిందులుగా ఉండలేక ఎప్పుడెప్పుడు బయటపడతానా అని ఆరాటం. ఇక ప్రసూతి వాయువులు నెడుతూఉంటే గర్భాన్ని చీల్చుకొని బయటపడటం ఊహింపరాని దుఃఖం. ఇదొక పెద్ద గండం.

తల్లికీ బిడ్డకీ కూడా గండమే. తల్లి కేమన్నా జరిగితే నష్టజాతకుడని – నష్టజాతకురాలని తిట్లుతప్పవు. ఇదంతా ఊహించలేనంత దుఃఖం.

(3) ఇక పుట్టిన తర్వాత ఏమైనా సుఖమా అంటే అదేంలేదు. మల మూత్రాలలో రక్తంలో పురుగులాగా పడి పోతాడు. ఏడవటం తప్ప మరేమీ తెలియదు. ఎవరు ఏంచేసినా ఎదురు చెప్పలేడు. తనకు కావలసిందేదో అడగలేడు. తన కష్టం ఏమిటో చెప్పుకోలేడు. పసితనమంతా ఇంతే. నిద్రపట్టకపోయినా ఏడుపే; ఆకలైనా ఏడుపే; ఉయ్యాలలో చీమలు కుడుతున్నా ఏడుపే; ఏ భాధ గలిగినా ఏడుపుతప్ప మరొక విధంగా తెలియజేయటం కుదరదు. ఆ ఏడ్పెంది ఎందుకోతెలియని తల్లి ఆకలై ఏడుస్తుంటే చీమలు ఏమైనా కుట్టిన వేమోనని అంతా శుభ్రం చేసి ఊయల ఊపుతుంది. వాడి బాధపట్టించుకోకుండా జోలపాట పాడుతుంది. వాడికింకా ఆకలి హెచ్చి గుక్కపట్టి ఏడుస్తాడు. గాలిరాకనో – నిద్ర పట్టకనో ఏడుస్తుంటే ఆకలేమోనని పాలిస్తుంది. వాడికి కడుపునిండుగా ఉండి పాలుత్రాగలేక బాధపడతాడు. ఇలా పసితనమంతా సహింపరాని దుఃఖం కలుగుతుంది. నివారించ వీలులేని దుఃఖం.

ఇవన్నీ తలచుకుంటుంటే శిష్యుడికి ఇప్పుడు గొప్పభయం కలుగుతున్నదట, అదేమిటి? ఇప్పుడు భయం కలగటవేమిటి? అవన్నీ ఎప్పుడో అనుభవించాడుగదా! అసలు అనుభవించినట్లు కూడా తెలియదుగదా? నిజంగా మనం అంతా గర్భంలో ఈ నరకం అనుభవించిన వాళ్ళమే. పుట్టిన తర్వాత పసితనంలో గోలపెట్టి ఏడ్చినవాళ్ళమే. అయితే మనకెవరికైనా ఆబాధలు, దుఃఖాలు గుర్తున్నాయా? లేవు. శాస్త్రాలలో ఉన్నవి తెలుసుకున్నాం, లేదా గురువుల ద్వారా తెలుసుకున్నాం. మరి వాటికి ఇప్పుడు భయమెందుకు?

ఎందుకంటే ఇంతకు ముందు తల్లి గర్భంలో పడిన దుఃఖాలకు కాదు శిష్యుడు భయపడటం. ముందు ముందు ఎన్ని జన్మలెత్తాలో! ఎందరు తల్లుల గర్భాలలో ప్రవేశించాలో! ఎంత గర్భనరకం అనుభవించాలో అని తలచుకొన్న కొద్దీ భయం కలుగుతున్నది. ఆ విషయాన్నే గురువుతో చెబుతున్నాడు.

ఇక యవ్వన దశయందలి పరిస్థితి ఏమిటి?

**శ్లో॥ తారుణ్య మేత్య కులయౌవన రూప సంపత్**

**విద్యాత్మ గర్వ పిహితాత్మ హితాభిలాషః ।**

**విణ్మూత్ర మాంస రుధిరాస్తి మయే శరీరే**

**నార్యా రుచిం సముపయాతి జనో విచిత్రం ॥ 13**

**ప్రతిపదార్థం :-** తారుణ్యం ఏత్య = యవ్వనాన్ని పొంది; కుల, యౌవన, రూపసంపత్ విద్య ఆత్మగర్వం = కుల, యవ్వన, రూప, సంపద, విద్యలు ఉన్నాయనే గర్వంతో; పిహిత ఆత్మహిత అభిలాష = ఆత్మహితం పొందాలనే అభిలాషకప్పబడి; విట్ మూత్ర మాంసరుధిర అస్తిమయే నార్యాశరీరే = మలమూత్ర మాంస, రక్త, అస్థికలతో కూడిన స్త్రీ శరీరం పై; జనః = నరుడు; రుచింసముపయాతి = ఇష్టాన్ని పెంచుకుంటున్నాడు; విచిత్రం = ఎంత విచిత్రమోగదా!

**భావం :-** యవ్వన దశనుపొంది తన కుల, యవ్వన, రూప, సంపద, విద్యా గర్వముతో తనయొక్క హితాన్ని గురించిన అభిలాష మరుగున పడిపోగా, మానవుడు మల, మూత్ర, మాంస, రుధిర, అస్థికలతో కూడిన స్త్రీ శరీరంపై ఇష్టాన్ని పెంచుకుంటాడు. ఎంత చిత్రమో!

**వ్యాఖ్య :-** తల్లి గర్భంలో ఉన్నప్పటి నుండి బయట పడి బాల్యావస్థలో ఉన్నంత వరకు పడవలసిన బాధల గురించి తలచుకొని దుఃఖించిన శిష్యుడు; ఇప్పుడు యవ్వనదశలో మానవుని యొక్క స్థితిని గురించి తెలియజేస్తున్నాడు. యవ్వన దశలో బాధలు ఉన్నప్పటికీ అమితమైన సుఖాన్ని పొందుతాడు. అయితే ఆసుఖాన్ని పొందటానికి ఎన్నో కోల్పోవటం జరుగుతుంది. భవిష్యత్తులో బాధలకు, దుఃఖాలకు కారణమవుతుంది. అజ్ఞానం పురివిప్పి నాట్యం చేసే దశయే ఈయవ్వనకాలం. యవ్వన దశలో అజ్ఞానం ఎలా వెర్రితలలు వేస్తుందో ఈ శ్లోకం ద్వారా వివరిస్తున్నారు.

యవ్వనం వచ్చేటప్పటికి శరీరం బాగా పుష్టిగా, అందంగా తయారవుతుంది. కామోద్రేకం కలుగుతుంది. కామ సంబంధమైన ఆలోచనలు ముసురుతుంటాయి. దానితో మనసంతా అస్తవ్యస్తమవుతుంది. అప్పటికే విద్యాభ్యాసం పూర్తవుతుంది. ఉద్యోగమో, వ్యాపారమో, వృత్తియో ఏదో ఒకటిచేస్తూ సంపాదించటం ప్రారంభమవుతుంది. కొందరికి అప్పటికే తండ్రి – తాతలు సంపాదించిన ఆస్తులు – సంపదలు ఉంటాయి. దానితో ఆ సంపదలను చూచుకొని, విద్యను చూచుకొని, సంపాదించగలతన శక్తిని, చాతుర్యాన్ని తలచుకొని, తన యవ్వనాన్ని తలచుకొని, తన రూపాన్ని, అందచందాలను తలచుకొని గర్విస్తాడు. నేను చాలాగొప్ప వాణ్ణనుకుంటాడు. తానెప్పుడు ఇలాగే ఉండగలనని భ్రమలో ఉంటాడు. దానితో విచక్షణాజ్ఞానాన్ని కోల్పోతాడు. అసలు తనలాంటి వాళ్ళకు కాదు భగవంతుని అవసరం – అది ఏ ముసలీముతకా వాళ్ళకో; ధనహీనులైన పేదలకో; రోగాలతో బాధపడేవారికో తప్ప తనలాంటి కుల, రూప, యౌవన, విద్యా, సంపదలున్న వారికి కాదని అహంకరిస్తాడు. ఆ విధంగా భగవంతుని తలచుకోవాల్సిన పని లేదని గర్వించనన్నా గర్విస్తాడు, లేదా అసలు భగవంతుని గురించి తలచుకోకుండా నైనా ఉంటాడు.

యవ్వన మదంలో ఉన్నవాడికి లోకం అంతా ఎంతో అందంగా కనపడుతుంది. ఇదంతా శాశ్వతం అనుకుంటాడు. అంతేగాదు యవ్వనం ఉన్నది బాగా అనుభవించటానికే నని నిశ్చయించుకుంటాడు. అందుకే స్త్రీ పొందుకోసం తపిస్తాడు. అలాగే స్త్రీ కూడా పురుషుని పొందుకోసం తపిస్తుంది. నిజంగా శరీరాల కలయిక ద్వారా సుఖం కలుగుతుంది గాని, ఆ శరీరం మార్పులు లేకుండా ఎప్పుడూ ఒక్కటిగా ఉండేది కాదని, మలమూత్రాలతోను, రక్తమాంసాలతోను, ఎముకలతోను, చీము మొదలైన అసహ్యకర పదార్థాలతోను కూడి ఉన్నదని భావించలేడు. ఆత్మ సుఖంతో పోలిస్తే ఇది తుచ్ఛమైనది, అల్పమైనది. కాని ఆత్మ సుఖం ఎలా ఉంటుందో తెలియని అజ్ఞాన దశలో ఇదే గొప్పసుఖం అనుకుంటాడు. ఇదిసుఖం అని అనుకోవటం వల్ల ఆ సుఖాన్ని

మళ్ళీ మళ్ళీ పొందాలనుకుంటాడు. విచ్చలవిడిగా సంచరిస్తాడు. ఫలితంగా శరీరం రోగాల పాలవుతుంది. త్వరగా శరీరం శిధిలమవుతుంది, వృద్ధాప్యం వస్తుంది. అనుభవించిన సుఖం కన్నా ఎక్కువ దుఃఖం అనుభవించాల్సి వస్తుంది.

అయితే స్త్రీపొందు కూడదా? యవ్వన దశలో స్త్రీ పురుషులు కలవకూడదా? అంటే కలవాల్సిందే. నియమబద్ధంగా కలవాలి. అది సృష్టి ధర్మం కూడా. అయితే మనస్సు మాత్రం ఎప్పుడూ అందులోనే ఇరుక్కుపోకూడదు. మానవుడు తన శ్రేయస్సును గూర్చి మరిచిపోకూడదు. తనకు శాశ్వత ఆనందాన్ని ప్రసాదించే మార్గాన్ని మరువకూడదు. మక్కువ స్త్రీ పొందుపై కాకుండా భగవంతునిపై ఉండాలి. యవ్వనం భగవంతుని కప్పివేయకూడదు. అంతే.

ఇక – వృద్ధాప్యం ఎలాంటిదో తెలయజేయబోతున్నాడు.

**శ్లో॥ సర్వాపదాం నిలయమేత్య వయోధికత్వం**
**జంతుః సుఖం నలభతేహ్యాపి కించిదత్ర ।**
**పుంసామిహాస్తి నభయం ఖలు మృత్యుతో ఽ న్యత్**
**ధిక్కృత్య సంసృతి మిమా మభవం విరక్తః ॥ 14**

**ప్రతిపదార్థం :–** సర్వఆపదాం నిలయం = సమస్త కష్టాలకు నిలయమైన; వయోధికత్వం = వృద్ధాప్యాన్ని; ఏత్య = పొంది; జంతుః = జీవుడు; అత్ర = ఈస్థితిలో; కించిత్ సుఖంఅపి = కొంచెం సుఖాన్ని కూడా; నలభతే = పొందలేడు; పుంసాం = పురుషుడికి; ఇహ = ఈదశలో; మృత్యుతః అన్యత్భయం = చావు కన్నమరొకభయం; ఖలున అస్తి = ఉండదు కదా!; ఇమాం సంసృతిం = ఈ మార్పులను; ధికృత్య = ధిక్కరించి; విరక్తః అభవం = విరక్తుణ్ణి అయ్యాను.

**భావం :–** సమస్త కష్టాలకు దుఃఖాలకు నిలయమైన వృద్ధాప్యాన్ని పొంది, జీవుడు ఈ స్థితిలో కొంచెం సుఖాన్ని కూడా పొందలేడు. ఈ దశలో మానవుడికి మృత్యువు కన్నా గొప్ప భయం ఇంకేమీ ఉండదు. ఈ మార్పులతో కూడిన ప్రపంచాన్ని ధిక్కరించి విరక్తుణ్ణి అయ్యాను.

**వ్యాఖ్య :-** వృద్ధాప్యం అనేది అన్ని దుఃఖాలకు నిలయం వంటిది. శరీరంలో శక్తి సన్నగిల్లిపోతుంది. ఏంచేయాలన్నా అశక్తత, శరీరం శిధిలమవుతుంది, అన్నీ తినాలనిపిస్తుంది. కాని జీర్ణశక్తి తగ్గిపోతుంది. తల నెరసిపోయి, పళ్ళు ఊడిపోయి, బుగ్గలు గుంటలు పడిపోయి, శరీరం వికారంగా తయారవుతుంది. మనస్సు ఊహాలోకంలో ఊరేగుతుంటుంది. కాని శరీరం ఉన్నచోటి నుండి కదలలేదు.

ఇక పిల్లలు మాట వినటం లేదని, తనను సరిగ్గా చూడటం లేదని, తను చెప్పిన సలహాలు వినిపించుకోవటం లేదని మథనపడిపోతుంటాడు. తాను ఎంతో దర్జాగా బ్రతికానని, తనపై ఆధారపడి పెరిగి పెద్దయిన బిడ్డలు ఈనాడు తనను పూచిక పుల్లక్రింద తీసిపారేస్తున్నారని బాధపడతాడు. ఇదే సమయంలో అప్పటి దాకా దాగి ఉన్న రోగాలు ఒక్కొక్కటే కట్లుతెంచుకొని ప్రవేశిస్తాయి. దానితో మరీ బాధ. ఇక ఈ కష్టాలు బాధలు తీరేది మృత్యువుతోనే అనుకుంటాడు. మృత్యువును తలచుకోవటంతోనే భయం. మృత్యువంటే భయం ఎందుకు? తాను ఎంతో సంపాదించాడు. సరిగ్గా అనుభవించలేదు. ఇప్పుడు అంతావదిలి పోవాల్సి వస్తున్నది. పిల్లలు తాను సంపాదించిన ఆస్తి పాస్తులను వృద్ధిచేస్తారోలేదో. కనీసం కాపాడుకున్నా పర్వాలేదు. నాశనం చేస్తారేమో! ఇలా ఆలోచించి బాధపడతాడు. అంతేకాదు మరణం అంటే తెలియకుండానే గొప్పభయం. అనేక జన్మలలో అనుభవం గదా! పసితనంలో ముద్దుగా, బొద్దుగా ఉన్నదేహం యవ్వనంలో బలంగా – దృఢంగా ఉన్న ఈ దేహం ఇప్పుడు వృద్ధాప్యంలో వికారంగా అసహ్యంగా తయారైంది. ఎంతలో ఎంత మార్పు! దీనిని తలచుకోవటం విజ్ఞుల లక్షణం. ఇలా మార్పులకులోనై పోయే దేహాన్ని చూచిన తర్వాత విరక్తి కలుగుతున్నది. సమస్త దుఃఖాలకు తరుణోపాయం తెలుసుకోవాలను కుంటున్నాడు శిష్యుడు. అందుకే ఏమంటున్నాడో...

శిష్యుడు గురువును వినయంతో ప్రశ్నిస్తున్నాడు. ఏమని?

శ్లో॥ స్వామిన్ కథం మమ భవార్ణవ లంఘనం స్యాత్
ఆయాస లేశరహితం వద తత్ర హేతుం।
శ్రుత్వాతు శిష్యవచనం రమణీయ మిత్థం
ప్రత్యుత్తరం గురురదాత్ కృత మందహాసః ॥ 15

**ప్రతిపదార్థం :–** స్వామిన్; ఆయాసలేశరహితం = సునాయాసంగా; భవార్ణవలంఘనం = సంసార సాగరాన్నిదాటటం; కథం స్యాత్ = ఎలా సాధ్యమవుతుందో; తత్రహేతుం = ఆవిధానాన్ని; మమ = నాకు; వద = బోధించండి; రమణీయశిష్యవచనం = మనోహరమైన శిష్యునిమాటలు; శ్రుత్వా = విని; కృతమందహాస = చిరునవ్వుతో; గురుః = గురువు; ఇత్థంఅదాత్ = ఈ విధంగా బోధిస్తున్నాడు.

**భావం :–** స్వామీ! ఈ సంసార సాగరాన్ని సునాయాసంగా దాటటం ఏవిధంగా నాకు సాధ్యం అవుతుందో ఆ విధానాన్ని నాకు బోధించండి. మనోహరమైన శిష్యుని వాక్కులను విని చిరునవ్వునవ్వుతూ గురువు ఈ ప్రకారంగా జవాబు ఇచ్చాడు.

**వ్యాఖ్య :–** సాధారణంగా ఉపనిషత్తులుగాని, వేదాంతగ్రంథాలు గాని ఇక్కడ నుండే ప్రారంభమవుతాయి. కాని ఈ గ్రంథం మాత్రం శిష్యుని యొక్క ప్రశ్నకు ముందుగా శిష్యుడు ఈ ప్రపంచాన్ని ఏదృష్టితో చూచాడో – ఎలా ఈ ప్రపంచం పట్ల విరక్తుడయ్యాడో – సంసార దుఃఖం ఎలాంటిదో వివరణ ఇవ్వటం జరిగింది. అంతే కాక గ్రంథాన్ని ప్రసాదించిన సదాశివ బ్రహ్మేంద్రస్వాములవారు ఉపనిషత్తుల గురించి, ఈ సృష్టి గురించి, మానవుడు చేరుకోవలసిన గమ్య స్థానం గురించి ఉపోద్ఘాతంగా వివరణ ఇవ్వటం జరిగింది. మొదటి శ్లోకం గురుప్రార్థన – దైవ ప్రార్థనతో ప్రారంభించి రెండు, మూడు శ్లోకాల ద్వారా తరించటానికి మార్గాన్ని చూపే ఉపనిషత్తుల గురించి చెప్పి, 4వ శ్లోకం నుండి దేవుడు జీవుడైన విధానాన్ని, సృష్టి రహస్యాన్ని వివరించి, 10వ శ్లోకనుండి తరించాలనుకున్న జీవుడు తన పూర్వ పుణ్య విశేషంచేత గురువును సమీపించి తన దుఃఖ కారణాలను వివరించి, ఈ 15వ శ్లోకంలో తరించే మార్గాన్ని అడుగుతున్నాడు.

ఈ సంసార దుఃఖాలను తరించాలంటే ఈ సంసార సాగరాన్ని దాటి వెళ్ళాల్సిందే. కష్టాల కడలిలోనే ఉండి ఆ కష్టాలను తొలగించు కోవటం సాధ్యంకాదు. అందుకే సునాయాసంగా ఈ సంసార సాగరాన్ని దాటే తరుణోపాయం చెప్పమని అర్థిస్తున్నాడు. మోక్షార్థులైన వారు ప్రశ్నించే విధానం ఇలాగే ఉంటుంది. నిజంగా శిష్యుడు ఈ ప్రపంచాన్ని ఎంతో సునిశితంగా పరిశీలన చేసి, ఇందులోని దుఃఖాలను, బాధలను సరిగ్గా అవగాహన చేసుకొంటేగాని అతడికి ఈ సంసారంపట్ల విరక్తభావం కలగదు. అందరూ దుఃఖాలు అనుభవిస్తున్నారు గదా! అలాగే నేనూ అనుభవిస్తున్నాను; తప్పేదేముంది? అని గనుక అనుకున్నట్లైతే అతడు కూడా అందరిలాగే ఈ జనన మరణ చక్రంలో ఇరుక్కొని, అజ్ఞానంతో ఈ ప్రపంచ వ్యామోహాలలో చిక్కుకొని పోయేవాడే. కాని సునిశితమైన విశ్లేషణ చేయటం వల్లను, పూర్వజన్మ సంస్కారాల వల్లను అతడిలో ఈ ప్రపంచంపట్ల; ఇక్కడి అనిత్యమైన, అల్పమైన సుఖాలపట్ల వైరాగ్యం కలిగింది. ఇలాంటి వైరాగ్యం – అంటే వివేకంవల్ల వైరాగ్యం కలిగినప్పుడే తరించాలనే కోరిక, తీవ్రముముక్షుత్వం కలుగుతుంది.

శిష్యుడు మాట్లాడినదంతా ప్రసన్న వదనంతో గురువు విన్నాడు. సంసారాన్ని సాగరంతో పోల్చిచెప్పటంకాని, జీవుడు తల్లి గర్భంలోను, వెలుపలకు వచ్చేటప్పుడు, బాల్యంలోను పడవలసిన బాధలను గాని, యవ్వనంలోని అజ్ఞానాన్నిగాని, వృద్ధాప్యంలోని చింతలు, భరించలేని దుఃఖాలను గాని, మృత్యుభయాన్ని గాని వివరించటం చూస్తుంటే శిష్యుడు విచక్షణాజ్ఞానం గలవాడని, ఇప్పటికే కొంత జ్ఞానాన్ని పొందాడని గ్రహించాడు. సంసార సాగరాన్ని చూచి భయపడుతున్నాడని, తరించాలనే తీవ్ర తపన ఉన్నదని గ్రహించాడు. అంతేకాదు ప్రశ్నించే విధానాన్ని బట్టి శిష్యుని అర్హతను కూడా గ్రహించాడు. అట్టి శిష్యుడు లభించటం అపురూపం గనుక అతడి మాటలు ఎంతో మధురంగా ఉన్నాయి గురువుకు. అట్టి శిష్యులకు తప్పక జ్ఞానబోధ చేయాలి. **“తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యం తితే జ్ఞానం జ్ఞానినః తత్వదర్శినః”** – (గీత 4–34) తత్వ దర్శినులైన జ్ఞానులు అట్టి శిష్యునకు

తప్పక జ్ఞాన భోధచేస్తారు – అని గీతలో చెప్పినట్లు ఇప్పుడు గురువు ఎంతో సంతోషంతో జ్ఞానబోధ చేయటానికి పూనుకుంటున్నాడు. సునాయాసంగా తరించే మార్గాన్ని చెప్పబోతున్నాడు. ఇంతవరకు ఉపోద్ఘాతం – శిష్యుని అనుభవం – వైరాగ్యం – ప్రశ్న అయితే – ఇకనుండి సద్గురువు యొక్క జ్ఞాన బోధ ప్రారంభమవుతున్నది – ముందుగా విచారణా మార్గాన్ని బోధిస్తున్నాడు గురువు.

**శ్లో॥ దేహేంద్రి యాసు హృదయాదిక చైత్య వర్గాత్**
**ప్రత్యక్ చితే ర్విభజనం భవవారి రాశేః ।**
**సంతారణేప్లవ ఇతి శ్రుతి డిండి మోఽయం**
**తస్మాద్ విచారయ జడా జడయో స్వరూపం ॥ 16**

**ప్రతిపదార్థం :–** దేహ ఇంద్రియ అసు హృదయ ఆదిక చైత్యవర్గాత్ = దేహం, ఇంద్రియాలు, ప్రాణాలు, హృదయం మొ॥న చైతన్యంతో కూడిన వర్గం నుండి; ప్రత్యక్ చితేః విభజనం = లోపల ఉన్న చితిని వేరు చేయటమే; భవవారిరాశే = భవసాగరాన్ని; సంతరణే = దాటించే; ప్లవ ఇతి = పడవఅని; శ్రుతి డిండిమః = ఉపనిషత్తులు చాటుతున్నాయి; తస్మాద్ = అందువల్ల; జడ అజడయోః స్వరూపం = జడచైతన్యాల స్వరూపం గురించి; విచారయ = విచారణచెయ్యి.

**భావం :–** దేహం, ఇంద్రియాలు, ప్రాణాలు, హృదయం మొదలైన చైతన్యంతో కూడిన వర్గం నుండి లోపల ఉన్న చితిని వేరు చేయుటయే సంసార సాగరాన్ని దాటించే పడవ అని ఉపనిషత్తుల చాటింపు. కనుక జడ చైతన్యాల స్వరూపం గూర్చి విచారణ చెయ్యి.

**వ్యాఖ్య :–** శిష్యుని యొక్క మాటలను బట్టి అతడు ప్రశ్నించిన విధానాన్ని బట్టి అతడు పరిపక్వమైన బుద్ధి గలవాడని, ఇప్పటికే ఆత్మజ్ఞానాన్ని గురించి తెలుసుకున్న వాడని గ్రహించిన గురువు సరాసరి అతడికి ఆత్మ విచారణా మార్గాన్ని బోధించ బోతున్నాడు. ఈ సంసార జనన మరణ చక్రం నుండి

విడుదల పొంది ఆత్మ సాక్షాత్కారం పొందాలంటే అత్యుత్తమ సాధన ఆత్మ విచారణయేనని తెలియజెప్పి, ఆ విచారణా విధానాన్ని బోధించబోతున్నాడు.

స్థూలదేహము, సూక్ష్మమైన ఇంద్రియాలు, అంతః కరణము ఈ మొత్తాన్ని 'నేను' 'నేను' అంటుంటాం. ఈ 'నేను'ను విశ్లేషణ చేయాలి. ఎలా?

దేహం, 5 కర్మేంద్రియాలు, 5 ప్రాణాలు, 5 జ్ఞానేంద్రియలు, 4 అంతః కరణాలు ఈ మొత్తం 20 కలిపి చైత్యవర్గం అంటారు. అంటే చైతన్యంతో కూడి పనిచేసేజడాలు. లోకంలో కొన్ని అసలు జడాలున్నాయి. కొండలు, రాళ్ళు మొ॥ వి అసలు జడాలు. అవి ఎన్నటికీ వాటంతట అవి పనిచేయవు. కాని దేహం మొ॥న వన్నీ జడాలే అయినప్పటికీ చైతన్యంతో కూడినప్పుడు పనిచేస్తాయి. అందుకే వీటిని చైత్యవర్గం అన్నారు. మన ఇంట్లో ఉన్న లైటు, ఫ్యాను, ఫ్రిజ్ మొ॥న వస్తువులన్నీ జడమే. కాని వాటిలోకి కరెంటు ప్రవేశించినప్పుడు అవి పనిచేస్తాయి. కరెంటు అందకపోతే జడమైపోతాయి. అలాగే ఈ దేహం, ఇంధ్రియాలు, ప్రాణాలు, అంతః కరణాలు మొ॥నవి కూడా. కనుక ఇవి జడాలే అయినా చైత్యవర్గం అన్నారు. **ఇవి ఎలా పనిచేస్తుంటాయి?**

దేహం తనకుకావలసిన వాటిని లోనికి తీసుకుంటుంది. అక్కరలేని వాటిని బయటకు నెడుతుంది; కర్మేంద్రియాలు నడవటానికి, పట్టుకోటానికి, మాట్లాడటానికి ఉపయోగపడతాయి. జ్ఞానేంద్రియాలు ప్రపంచాన్ని గురించిన జ్ఞానాన్ని చూచి, విని, స్పర్శించి, వాసనచూచి, రుచిచూచి తెలియజేస్తాయి. అంతః కరణాలలో మనస్సు ఆలోచనలు చేస్తుంది, బుద్ధి నిశ్చయంచేస్తుంది, చిత్తం జ్ఞాపకాలను నిలువచేస్తుంది, అహంకారం నేను అని ముందుకు వస్తుంది. ఇలా ఇవన్నీ పనిచేస్తున్నాయంటే అది వాటి సహజలక్షణం కాదు. ఏదో శక్తి వాటిలో ఉండటం వల్ల ఆశక్తిని గ్రహించి ఇవి పనిచేస్తున్నాయి. ఆ శక్తినే చితి అన్నారు. అది ఆయా ఇంద్రియాలలోపలే ఉన్నది గనుక దానిని ప్రత్యక్చితి అన్నారు. ఆ చితి ఉన్నంతకాలం అవి పనిచేస్తాయి. ఆ చితి లేకపోతే ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చిప్ అన్నట్లు కదలవు; పనిచేయవు; జడమైపోతాయి.

సాధారణంగా మనం ఏం అనుకుంటామంటే ఈ దేహం ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, స్వతహాగా పనిచేయగలుగుతున్నాయి అని. అందుకే ఎప్పుడూ విశ్లేషణచేయం. మనిషిగా, వ్యక్తిగా, జీవుడిగా పనిచేస్తూ ఈ సంసారంలో కొట్టు మిట్టాడుతూ ఉంటాం. అయితే దీని నుండి బయట పడాలి అనుకొనే జీవుడు ఏం చేయాలి?

వెలుగుతూ ఉండే లైటును చూస్తూ అక్కడ జడమైన లైటు దాన్ని వెలగించే కరెంటు రెండూ వేరు వేరని తెలుసుకున్నట్లుగా, ఈ పనిచేస్తున్న చైత్యవర్గాన్ని, అంటే దేహాన్ని, ఇంద్రియాలను చూస్తూ ఇక్కడ జడమైన దేహము, దాన్ని పనిచేయించే 'చితి' రెండూ వేరు వేరని, అలాగే జడమైన ఇంద్రియాలు వాటిని పనిచేయించే 'చితి' రెండూ వేరు వేరని తెలుసుకోవాలి. అంతేగాదు లైటును వెలిగించే కరెంటు, ఫ్యానును త్రిప్పే కరెంటు, ఫ్రిజ్‌ను చల్లబరిచే కరెంటు ఒకటే అయినట్లు ఈ దేహేంద్రియాలను, ప్రాణాలను, అంతః కరణాలను పనిచేయించే 'చితి' ఒక్కటేనని గ్రహించాలి. ఇలా జడాన్ని, చైతన్యాన్ని విడదీసి చూడటమే విచారణ. ఈ విచారణ వల్లనే సంసార సాగరాన్ని దాటవచ్చు. కనుక ఈ విచారణే పడవలాంటిది.

ఐతే విచారణ ఎలా చేయాలి?

**శ్లో॥ ప్రత్యక్ చితిర్వపురిదం నభవేత్ జడాత్మా**
**కుడ్యాదివత్ జడతయా హ్యసవో నచిత్సుః ।**
**నాపీంద్రియాణి కరణం కుత ఏవ చిత్స్యాత్**
**కుద్దాలకాదివదితి ప్రవిచారయత్వం ॥ 17**

**ప్రతిపదార్థం :-** ఇదం వపుః = ఈ శరీరం; కుడ్యఆదివత్ జడాత్మా = గోడ మొ॥న వాటివలె జడమైనది; ప్రత్యక్‌చితిః నభవేత్ = లోపలి చితికాదు; అసవః అపి జడతయా = ప్రాణాలు కూడా జడమైనవి గనుక; నచిత్సుః = చితికాదు; ఇంద్రియాణి అపి = ఇంద్రియాలు కూడా; కుద్దాలక ఆదివత్ కరణం ఏవ = గొడ్డలి మొ॥న పనిముట్ల వంటివే; (కనుక) చిత్ కుతః స్యాత్ = చితి ఎలా అవుతాయి? ఇతిత్వం ప్రవిచారయ = ఈ ప్రకారంగా నీవు గాఢంగా విచారణ చెయ్యి.

**భావం :-** ఈ శరీరం 'గోడ' మొదలైన వాటివలె జడస్వభావం కలిగినది. లోనున్న చితికాదు. పంచప్రాణాలు కూడా జడమైనవి గనుక చితికాదు. ఇంద్రియాలు కూడా చితికాదు. గొడ్డలి మొదలైన పనిముట్ల వంటివే. అవి చితి ఎలా అవుతుంది? ఈ విధంగా గాఢంగా విచారణచెయ్యి.

**వ్యాఖ్య :-** జడ చైతన్యాలను విడదీసి చూసే విచారణ నిరంతరం చెయ్యాలని క్రిందటి శ్లోకంలో గురువు చెప్పారు. ఆ విచారణ ఎలా చెయ్యాలో ఈ శ్లోకంలో సూచనలు చేస్తున్నారు. ముందుగా దేహం, ఇంద్రియాలు, ప్రాణాలు. వీటిని ఎలా విచారణ చేయాలో ఈ శ్లోకంలో చెబుతున్నారు. అంతః కరణం – అంటే మనోబుద్ధులను ఎలా విచారణ చెయ్యాలో రాబోయేశ్లోకంలో చెప్పబోతున్నారు. నిజంగా జడము, చైతన్యము వేరు వేరుగా ఉంటే చక్కగా విడదీయవచ్చు. బియ్యము, రాళ్ళు కలసి ఉన్నట్లుగా ఈ జడచైతన్యాలు కలిసి ఉంటే విడదీయవచ్చు. లేదా వడ్లగింజలో లాగ బియ్యపు గింజ, పొట్టు కలిసి ఉంటే కొంచెం కష్టంతో విడతీయవచ్చు. కాని జడచైతన్యాలు రెండూ జీవుడిలో భాగాలు. అసలు రెండూ కలసి ఉన్నట్లు తెలియదు. కనిపించేది, బుద్ధికి అందేది జడమే. చైతన్యం కనిపించేదిగాదు. బుద్ధికి అందేదిగాదు. అయినా ఎలాగోలా విడదీసి చూడటం తప్పనిసరి. ప్రాపంచిక విషయాలతో కలుషితంగాని బుద్ధిలోని నిశితమైన వివేకం ద్వారా, విచక్షణా నైపుణ్యం ద్వారా విడదీసి తెలుసుకోవటం తప్ప మరోమార్గం లేదు.

(1) **శరీరం** గోడలాంటిది. గోడ – జడం. కదలదు. ఎవరో ఒకరు ప్రయత్నించి పడగొట్టాలి. లేదా యంత్రాలద్వారా నెట్టాలి. తనంతట తాను కదలదు. అలాగే శరీరం జడం. లోపలనుండి ఏదోశక్తి (చితి) పనిచేస్తుంటేనే అది కదులుతుంది. ఆ లోపలిశక్తి (చితి) లేకపోతే శరీరం కదలదు మెదలదు. గోడ అంటే గోడలతో కట్టిన ఇల్లు అని అర్థం చేసుకోవచ్చు. ఇల్లు కట్టుకుని ఇంట్లో ఉండేవ్యక్తి దానిని తన అవసరాలకు ఉపయోగించుకుంటాడు. నిద్రపోవటానికి, కాలకృత్యాలు తీర్చుకోటానికి, తినటానికి, మాట్లాడుకోటానికి ఇలా అన్నింటికి ఉపయోగించుకుంటాడు. అంతే. అలాగే ఈ శరీరమనే ఇంటిని లోనున్న జీవుడు తన అవసరాలకు వాడుకుంటాడు. వాడుకునే జీవుడు చైతన్యంతో ఉంటాడు గాని, వాడుకోబడే శరీరం మాత్రం జడమైనదే.

(2) **పంచప్రాణాలు :** నిజంగా పంచప్రాణాలవల్లనే జీవుడు తినగలుగుతున్నాడు, అరిగించుకోగలుగుతున్నాడు. శక్తివంతుడౌతున్నాడు, పనికిరాని వ్యర్థాలను బయటకు నెట్ట గలుగుతున్నాడు. దీనిని బట్టి ప్రాణాలు చైతన్యంతో కూడుకున్నవనే అనిపిస్తుంది. కాని ప్రాణాలు కూడా జడమే. ఎలా? అసలు ప్రాణం అంటే ఏమిటి? బయటనున్న గాలి ముక్కు ద్వారా లోపలికి వెళ్తే 'ప్రాణం' అవుతుంది. మరి మనం ఒక బొమ్మను తయారుచేసి దాని ముక్కుద్వారా గాలిని లోపలికి పంపింగ్ చేద్దాం. ఆ గాలి లోపల ప్రాణం అవుతుందా? కాదు. అంటే శరీరంలోపల ఏదో శక్తి (చితి) ఉండటాన బయటి గాలి లోపల ప్రాణంగా మారుతున్నదన్నమాట. దీనిని బట్టి ప్రాణం జడమే. దానిని అలామార్చగలిగిన చైతన్యం వేరే ఉంది. కనుక పంచ ప్రాణాలు జడమైనవే. చితికాదు.

(3) **ఇక ఇంద్రియాలున్నాయి.** వాటిని కరణాలు అంటారు. అంటే పనిముట్లు అని అర్థం. గొడ్డలిలాగా, పెన్‌లాగా, చాకులాగా, మనిషి ఉపయోగించుకొని ఏదన్నా పనిచేయటానికి పనికి వస్తాయేగాని అవి చితికాదు. గొడ్డలితో చెట్టును నరుకుతాం. నరికేది గొడ్డలే అయినా తనంతటతాను నరుకలేదు. ఒక మనిషి దానిని ఉపయోగిస్తేనే నరికేది. అలాగే 'కలం' కవిత్వం వ్రాయదు. ఒక కవి దానినుపయోగించి కవిత్వం వ్రాస్తాడు. కనుక అది కేవలం పనిముట్టు. అలాగే కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు అన్నీ జీవుడు పనిచేయటానికి ఉపయోగించుకొనే కరణాలే – పనిముట్లే. కనుక అవి జడాలు. చితికాదు. చైతన్యంకాదు. ఈ విధంగా సూక్ష్మమైన బుద్ధితో నిరంతరం విచారణ చేయాలి. ఇంక అంతః కరణ విచారణ.

ఇక అంతః కరణ గురించి – జడమా? చైతన్యమా?

**శ్లో॥ దృశ్యత్వతోన మనసశ్చ భవేత్ చితిత్వం**
**నాహం కృతిశ్చ పరిణామ వతేచితిస్యాత్ ।**
**బుద్ధేరచిత్వ మపిజన్మ వినాశవత్త్వాత్**
**చిత్తం చ దృశ్య మభిదిత్య నుచింత యత్వం ॥** 18

**ప్రతిపదార్థం :-** దృశ్యత్వతః = దృశ్యం గనుక; మనసః = మనస్సు; చితిత్వంనభవేత్ = చితి కాదు; పరిణామవతే అహంకృతిః చితిః న స్యాత్ = మార్పుచెందే అహంకారంకూడా చితికాదు; జన్మవినాశవత్వాత్ = పుట్టుకచావు ఉన్నందున; బుద్ధేః అచిత్వం = బుద్ధి కూడా చితికాదు; దృశ్యం చిత్తం చ = దృశ్యమైన చిత్తం కూడా; అచిత్ ఇతి అనుచింతయత్వం = చిత్‌కాదని నిరంతరము నీవు విచారణచెయ్యి.

**భావం :-** దృశ్యం గనుక మనస్సు చితికాదు. మార్పుచెందే అహంకారమూ చితికాదు. పుట్టటం చావటం అనేవికారాలున్నందున బుద్ధి చితికాదు. దృశ్యమైన చిత్తం కూడా చితికాదు. జడమే. ఇలా నిత్యం విచారణచెయ్యి.

**వ్యాఖ్య :-** ఇప్పుడు అంతః కరణం – అంటే మనస్సు బుద్ధి చిత్తం అహంకారం అనబడే 4 కరణాల గురించిన విచారణ. ఇవి జడమా? చైతన్యమా? అని విచారణ చేయాలి.

**(1) మనస్సు జడమా? చైతన్యమా?** మనస్సంటే ఆలోచనలే. ఆలోచనలు, సంకల్పాలు, ఉద్రేకాలు, అలజడులు, ఆందోళనలు హర్షశోకాలు. ఇవన్నీ మనస్సులో కలిగే వికారాలు. అనేక సంశయాల పుట్ట మనస్సు. 'సంకల్ప వికల్పాత్మకామనః' అన్నారు. మరి ఈ మనస్సులోని ఆలోచనలను, సంకల్పాలను, అలజడులను, ఆందోళనలను, సంశయాలను, హర్షశోకాలను జీవుడు తెలుసుకుంటున్నాడా? లేదా? ప్రతి వాడికీ వాడి మనస్సులో కలిగే ఆలోచనలు తెలుస్తూనే ఉంటాయి. అంటే మనస్సు దృశ్యం, వాటిని తెలుసుకొనే జీవుడు ద్రష్ట (చూచేవాడు). చూచేవాడు చితి. చూడబడే దృశ్యం జడం. కనుక మనస్సు జడం. చితికాదు.

**(2) అహంకారం** అంటే నేను–నేను అనబడేది. ఈ అహంకారం ఎప్పుడూ ఒకే రకంగా ఉండదు. ఎప్పుడూ మారుతూ ఉంటుంది. మాట్లాడుతున్నప్పుడు నేను మాట్లాడుతున్నాను అంటాం. చెప్పేటప్పుడు నేను చెబుతున్నాను అంటాం. వినేటప్పుడు నేను వింటున్నాను అంటాం. అంటే అహంకారం ఒకప్పుడు వినేది, ఒకప్పుడు చెప్పేది, ఒకప్పుడు మాట్లాడేది. చేసేపనిని బట్టి ఈ 'నేను' –

అహంకారం – మారుతూ ఉంటుంది. చితి ఏమార్పులూ లేనిది. కనుక మార్పులు చెందే అహంకారం చితికాదు. అంతేకాదు ఈ మార్పులన్నింటినీ తెలుసుకొనేది జీవుడు. కనుక జీవుడు ద్రష్ట – అహంకారం దృశ్యం కనుక అహంకారం చితికాదు. జడమే.

**(3) బుద్ధి** అనేది అన్ని వేళలా పనిచేయదు; పనిచేసినప్పుడు ఒకే విధంగా పనిచేయదు. మనం నిద్రపోయినప్పుడు బుద్ధి అసలు పనిచేయదు. అంటే అప్పుడు బుద్ధి లేనట్లే. అదే మనం మేలుకోవటంతోనే బుద్ధి పనిచేయటం ప్రారంభిస్తుంది. అంటే బుద్ధిపుడుతున్నది, మరణిస్తున్నది; తిరిగిపుడుతున్నది. ఇలా జనన మరణాలతో కూడుకున్న బుద్ధి చితికాదు. జడం. చితిఎప్పుడూ ఏమార్పులు లేకుండా ఉండేది. బుద్ధిని, బుద్ధిలోని కోరికలను, బుద్ధిలోని మార్పులను తెలుసుకొనేది జీవుడు. కనుక బుద్ధి దృశ్యం; జీవుడు ద్రష్ట, దృశ్యమైన బుద్ధి చితికాదు. జడం.

**(4) చిత్తం** అంటే జ్ఞాపకాల పుట్ట. ఎప్పటి నుండో మన అనుభవాలన్నీ చిత్తంలో ఉండిపోతాయి. అప్పుడప్పుడు గుర్తుచేసుకుంటూనో, గుర్తొస్తేనో అప్పుడు అలాచేశాను, ఇలా అన్నాను, అలా జరిగింది అని చెప్పుకుంటూ ఉంటాం. అంటే మనచిత్తంలోని అన్ని జ్ఞాపకాలు లేదా స్మృతులు మనకు తెలుస్తూనే ఉంటాయి. తెలియబడే చిత్తం దృశ్యం. తెలుసుకొనే జీవుడు ద్రష్ట. ద్రష్టచితి. దృశ్యం జడం. కనుక చిత్తం చితికాదు జడమే. ఈ ప్రకారంగా బాహ్యంగా కనిపించే మన దేహం – ఇంద్రియాలు; అంతరంగా ఉండి పనిచేసే మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం – అన్నీకూడా మార్పులు చెందేవి; దృశ్యమైనవి అంటే మనచేత చూడబడేవి, తెలుసుకోబడేవి, కనుక ఇవి అన్నీ జడం. వీటిని చూచే – తెలుసుకొనే ద్రష్టనైన 'నేను' చితిని – చైతన్యాన్ని. ఇలా నిరంతరం విచారణ చేస్తుండాలి. ఈ విచారణ వల్లనే చైతన్యంగా కనిపించే ఈ దేహేంద్రియ మనోబుద్ధులు నిజంగా చైతన్యం కాదని, చైతన్యం వాటి సహజ లక్షణం కాదని – ఏదో ఒక అదృశ్య శక్తి యొక్క స్పర్శవల్లనే – అస్థిత్వం వల్లనే ఇవి చైతన్య వంతంగా కనిపిస్తున్నవని, యదార్థంగా అవి జడమైనవని తెలుస్తుంది. రూఢిగ నిశ్చయజ్ఞానం కలుగుతుంది.

సరే. ఇవన్నీ చితికాదు – మరిచితి ఏది? నీవెవరు?

**శ్లో॥ బుద్ధ్వా సమస్త మపి దృశ్య మచిత్స్వ రూపం**
**ప్రత్యక్చితించ నిజ రూప తయా విదిత్వా ।**
**దేహేంద్రియా ద్యఖిల సాక్ష్యహ మిత్య జస్రం**
**సంచింతయ వ్యపగతాఖిల సంశయస్సన్ ॥ 19**

**ప్రతిపదార్థం :–** సమస్తం అపి = ఈ అన్నీ కూడా; దృశ్యం, అచిత్స్వరూపం = దృశ్యమని, జడమనీ; బుద్ధ్వా = తెలుసుకొని; ప్రత్యక్‌చితిం = లోపల ఉన్న చితియే; నిజరూపతయావిదిత్వా = తననిజ స్వరూపమని తెలుసుకొని; అఖిల సంశయః అపగతసన్ = అన్నీ సంశయాలను విడిచిపెట్టి; దేహేంద్రియాది అఖిల = దేహం, ఇంద్రియాలు మొ॥న అన్నింటికి; అహంసాక్షిఇతి = నేనుసాక్షిని అని; అజస్రం సంచింతయ = ఎల్లప్పుడూ చింతన చెయ్యి (విచారణ చెయ్యి).

**భావం :–** ఈ సమస్తమూ (దేహం, ఇంద్రియ, ప్రాణ, మనోబుద్ధి, అహంకారాలు) దృశ్యం అని, జడమని తెలుసుకొని, లోపలనున్న చితియే తన నిజరూపమని తెలుసుకొని అన్ని సంశయాలు వదలి ఈ సమస్త దేహేంద్రియ మనో బుద్ధులకు 'నేనుసాక్షిని' అన్నీ నిరంతరం చింతన చెయ్యి.

**వ్యాఖ్య :–** ఇంతవరకు శరీరం, ప్రాణాలు, ఇంద్రియాలు అన్నీ జడమైనవని, స్వతహాగా వాటికి చైతన్యం లేదని కనుక చితికాదని 17వ శ్లోకంలో తెలుసుకున్నాం. అలాగే మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం ఇవన్నీ కూడా దృశ్యమని, దృశ్యమైన దంతా జడమని, వాటిని తెలుసుకొనే ద్రష్ట జీవుడని, కనుక జీవుడే 'చితి' యనీ 18వ శ్లోకంలో తెలుసుకున్నాం. మనస్సులోని ఆలోచనలను, ఆందోళనను, అలజడినీ తెలుసుకోగలుగుతున్నాం. అలాగే బుద్ధిలోని కోరికలనూ తెలుసుకోగలుగుతున్నాం, చిత్తంలోని జ్ఞాపకాలనూ తెలుసుకోగలుగుతున్నాం. కనుక అవి అన్నీ దృశ్యం. దృశ్యంయావత్తు జడమే గనుక అవి అన్నీ జడమైనవి. అయితే వీటిని తెలుసుకుంటున్నది ఎవరు? 'నేను', నాబుద్ధిలో ఎటువంటి కోరికలున్నాయో, ఏఏ లక్ష్యాలున్నాయో

నాకుతెలుసు; నామనస్సులో ఏఏ ఆలోచనలు, వికారాలు ఉన్నాయో నాకు తెలుసు; నా చిత్తంలో ఏమేమి జ్ఞాపకాలున్నాయో కూడా నాకు తెలుసు. **వీటన్నింటిని తెలుసుకొనే నేను ఎవరు?** బుద్ధినా? బుద్ధిని కూడా తెలుసుకుంటున్నాను గదా! అంటే బుద్ధికికూడా ఆవల ఉన్న చితిని – చైతన్యాన్ని అని అంగీకరించాల్సిందే. అంటే నేను ఈ దేహేంద్రియ మనోబుద్ధులనే ఉపాధులన్నీంటికి ఆధారంగా ఉండి, వాటికన్న వేరుగా ఉన్న 'చితిని'.

జడమైన ఈ దేహాదులు నేనుకాదు. ఈ దేహాదులను నేను ఉపయోగించుకుంటున్నాను. నేను వాటికన్నా వేరుగా ఉన్న 'చితిని'. నిజంగా నేను దేహమే అయితే దేహంలేనప్పుడు నేను లేను అనాలి గదా! మరి ఈ దేహం లేకుండా తల్లి గర్భంలో ఉన్నానుగదా! అంతకు ముందు తండ్రిలో బీజ రూపంలో ఉన్నానుగదా! అంతకుముందు అసలు ఏరూపమూ లేకుండా అవ్యక్తంలో ఉన్నానుగదా! అంతకుముందు జన్మలో మరో దేహంతో ఉన్నాను కదా! కనుక నేను ఈ దేహం కాదు. చితిని అని స్పష్టం.

అయితే ఇలా విచారించి, విశ్లేషించి తెలుసుకుంటున్నది ఎవరు? విచారణాశక్తి బుద్ధిదే గనుక బుద్ధి ఇలా నిశ్చయిస్తున్నది. ఈ నిశ్చయం అనుభవంగా మారాలి. అంటే? ఇప్పుడు మనం వ్యక్తులుగా వ్యవహరిస్తున్నాం. పురుషుడుగా, స్త్రీగా వ్యవహరిస్తున్నాం. ఐతే నేను పురుషుణ్ణి అని ప్రతి రోజూ నిద్రలేవగానే కొద్దిసేపు విచారణ చేస్తున్నామా? లేదే! అలాగని ఎప్పుడన్నా పొరపాటు పడ్డామా? పడలేదు. పడం. ఇదే అనుభవం అంటే. ఇప్పుడు పురుషుణ్ణి – స్త్రీని అని ఎలాగైతే ఎన్ని పనులలో ఉన్నా, ఎన్ని ఆందోళనలలో ఉన్నా – అప్పుడే నిద్ర లేచినా – ఎలా అనుకుంటామో –అసలు అనుకోకుండానే ఎలా వ్యవహరిస్తామో – అలాగే నేను చితిని – ఆత్మను – అంతటా ఉన్న చైతన్యాన్ని, అను అనుభూతి ఎల్లప్పుడూ ఉండాలి. విచారణ చేయాల్సిన పనిలేకుండా, ఆలోచించి, గుర్తుతెచ్చుకోవాల్సిన పని లేకుండా ఎప్పుడూ ఆత్మగా, అకర్తగా, అభోక్తగా ఉండిపోవాలి. ఇదే అనుభూతి అంటే. మరి ఇలాంటి అనుభూతి ఎలాకలుగుతుంది?

ముందుగా నిరంతరం బుద్ధితో విచారణ చేస్తూ నేను దేహంకాదు, ఇంద్రియాలుకాదు, మనస్సుకాదు, బుద్ధికాదు. వీటన్నింటికి వేరుగా ఉండి, వీటికి కావలసిన చైతన్యాన్నిస్తూ, వీటితో అంటుకోకుండా ఉన్న దివ్యచైతన్యాన్ని – చితిని – ఆత్మను అని నిశ్చయానికి వచ్చి ఆ తర్వాత లోకంలో ఈ దేహేంద్రియ మనోబుద్ధులు తిరుగుతూ పనిచేస్తున్నప్పుడు ఈ ప్రయాణం చేస్తున్న దేహాన్ని నేను కేవలంగా చూస్తున్నాను. ప్రయాణం చేస్తున్నది దేహం – నేను ఈ దేహాన్ని గమనించే కేవల సాక్షిని అని; ఆలోచనలు చేస్తున్నది మనస్సు, నేను ఆలోచనలను గమనించే సాక్షిని అని; ఎల్లప్పుడూ ఒక్కక్షణం కూడా మరువ కుండా 'కేవలసాక్షిగా' ఉండాలి. ఒక్కక్షణం కూడా మనను మనం మరిచి ఈ ఉపాధులే ఐపోకూడదు. ఒక్క క్షణం మరచినా ఆత్మనైన నేను దేహాన్ని ఐపోతాను. జీవుణ్ణయి పోతాను. బంధంలో పడిపోతాను. కనుక సాక్షిగా – కేవల సాక్షిగా దేహాదులను, వాటి వృత్తులను గమనిస్తు ఉండాలి. ఏఉద్దేశాలు లేకుండా కేవలంగా గమనించాలి. నిర్లిప్తంగా ఉండాలి.

కేవల సాక్షీభావన చేస్తే సరిపోతుందా? సమస్త దుఃఖాలు అంతమౌతాయా? మరి ఏంచేయాలి?

**శ్లో॥ దేహాదికం జగ దసద్జడ దుఃఖ రూపం**
**మయ్యద్వితీయ నిజబోధ సదాదిరూపే ।**
**సంద్రుశ్యతే భ్రమవశాద్ గగనే నిరంశే**
**గంధర్వ పత్తన మివేత్యనుభావయత్వం ॥ 20**

**ప్రతిపదార్థం :–** దేహాదికం జగత్ = దేహము మొ॥వి, బాహ్య ప్రపంచము; అసత్, జడ, దుఃఖ రూపం = మిథ్య అని, జడము, దుఃఖ రూపమని; అద్వితీయ నిజబోధ సత్ ఆదిరూపేమయి = రెండవదేదీలేని సత్ చిత్ ఆనంద రూపమైన నాలో; భ్రమవశాత్ = భ్రమవల్ల; నిరంశేగగనే = విభజనలు లేని ఆకాశంలో; గంధర్వపత్తనమివ = గంధర్వపట్టణం లాగా; సంద్రుశ్యతే = కనిపిస్తున్నవని; త్వం అనుభావయ = నీవునిరంతరం విచారణచెయ్యి.

**భావం :-** దేహాదులు, ఈ జగత్తు అసత్తు, మిద్య. అవి జడమైనవి, దుఃఖ రూపమైనవి. రెండవ దేదీలేని సత్తు – చిత్ రూపమైన నా స్వరూపంలో భ్రాంతివల్ల ఇవి ఉన్నట్లు కనిపిస్తున్నాయి. ఏ విభజనలు లేని ఆకాశంలో గంధర్వ పట్టణం కనిపించినట్లు కనిపిస్తున్నాయి. ఇలా అని నిరంతరం విచారణ చెయ్యి.

**వ్యాఖ్య :-** దేహేంద్రియాలను కేవల సాక్షిగా నిరంతరం చూస్తుండమని క్రిందటి శ్లోకంలో చెప్పారు. కేవలం అలా చూచినంత మాత్రాన నిధిద్యాసన పూర్తయినట్లుకాదు. ఎందుకంటే ఎంతసాక్షిగా చూస్తున్నా అనేక సందర్భాలలో అలా చూడటంమానేసి దేహేంద్రియాలతో తాదాత్మ్యం చెంది శారీరక బాధలను నీబాధలుగా చేసుకొని, అలాగే ప్రాపంచిక సమస్యలను నీసమస్యలుగా భావించి బాధపడటం జరగుతూనే ఉంటుంది. 'సాక్షిని' అని అనుకుంటావేగాని సాక్షిగా ఉండవు. అందుకే బాధలు వచ్చినప్పుడు నేను సాక్షిని అనుకుంటూ, నేను సాక్షినిగదా! మరి బాధలు నాకెందుకు వస్తున్నాయి? నేనెందుకు భాధపడుతున్నాను? అనుకుంటావు. నిజమైన సాక్షిగా –కేవల సాక్షిగా దేహేంద్రియాలకు వేరుగా నీవు నీవుగా ఎల్లవేళలా ఉండటం చేతగాకనే ఈ బాధంతా. మరి ఏంచేయాలి? నిరంతరం మరో విచారణ చేయాలి.

మనం ఆకాశం పైపుకు చూస్తున్నప్పుడు ఒక్కొక్కసారి ఆకాశంలో ఏవేవో పట్టణాలు, గంధర్వనగరాలు, ఏవేవో రూపాలు ఉన్నట్లు అనిపిస్తుంది. అయితే ఇదంతా నిజంకాదు. మన భ్రమ మాత్రమే. కంటి దృష్టిలోని లోపమే. అదే విధంగా ఈ ప్రపంచంగాని, ఇందులోని జీవుళ్ళుగాని, ఈ దేహాదులుగాని నిజంగా అసత్తే అయినా – లేనివే అయినా ఆత్మనైన నాలో ఉన్నట్లుగా భ్రమ కలుగుతుంది. ఇదంతా భ్రమమాత్రమే. ఈ ఉపమానాన్ని గుర్తు చేసుకుంటూ ఈ ప్రపంచాన్ని చూడాలి. లేని ప్రపంచం భ్రమ వల్ల కనిపిస్తున్నదని భావించాలి. ఇలా నిరంతరం విచారణ చేస్తుంటే అసలు ప్రపంచమనేదే సత్యం కాదని, మిధ్యయని తెలిసి దానిపై ఆసక్తి, అనురాగం తగ్గిపోతుంది. సాక్ష్యం లేకుండా పోతుంది. ఈ దేహాదులు గాని, జగత్తుగాని, అసత్తు – నిజంగా లేనిదే. అయినా

మనం చూస్తున్నంత కాలం ఇది కనిపిస్తూనే ఉంది. అంటే ఇది మిథ్య అన్నమాట. మిథ్య అంటే నిజంగా లేకపోయినా ఉన్నట్లుగ కనిపించేది. అలాగే ఈ దేహాదులుగాని, జగత్తుగాని జడమైనవి, దుఃఖరూపమైనవి. మనకు కలిగే దుఃఖాలన్నీ ఈ దేహాదులను, జగత్తును సత్యమని నమ్మటం వల్లనే. వీటిని సాక్షిగా చూస్తున్నప్పటికీ అన్ని సందర్భాలలోను నిజంగా సాక్షిగా చూడలేం గనుక, వాటితో కలగలిసి పోయి దుఃఖాలపాలౌతున్నాము. అందుకే మిథ్యావస్తువులైన ఈ దేహాలుగాని, ఈ జగత్తుగాని నాలో కల్పించబడినవి – అని నిరంతరం భావించాలి. ఇవి నిజంగా లేక పోయినా ఉన్నట్లు భ్రమ కలుగుతున్నది అని గ్రహించాలి. ఆకాశంలో ఏ విభజనలు లేక పోయినా గంధర్వనగరాలున్నట్లు ఎలా అనిపిస్తున్నదో అలాగ అని నిరంతరం విచారణ చెయ్యాలి. ఇలా తగిన ఉపమానాలతో తర్క బద్ధంగా విచారణ చేస్తుంటే చేయగా చేయగా మనలోని భ్రాంతి పొరలు కరిగి పోతాయి. దానితో ఈ జడరూపం, దుఃఖరూపం అయిన జగత్తు అదృశ్యమవుతుంది. ఉన్న సత్యం ఏదో వ్యక్తం అవుతుంది! అదే నీరూపం – స్వస్వరూపం. ఎంతకాలం విచారణచేయాలి? ఇలా నీరూపంలో నీవు స్థిమితపడేదాకా, స్థిరత్వం కుదిరేదాకా ఈ విచారణ సాగాల్సిందే.

కనుక ముందు (1) జడచైతన్యాలను విడగొట్టాలి. (2) నేను జడాన్నా? చైతన్యాన్నా? తెలుసుకోవాలి. (3) చైతన్యాన్ని అని తెలుసుకొని, జడమైన దేహేంద్రియాలను, మనోబుద్ధులను వేరుగా – సాక్షిగా చూడాలి. నిజంగా వాటిని కేవల సాక్షిగా చూడగలిగితే మనకే దుఃఖమూ ఉండదు. కాని తరచుగా వాటితో కలసిపోతుంటాం. అప్పుడు దుఃఖం తప్పదు. (4) అందుకే వాటిని మిథ్యగా, చైతన్యమైన నాలో కల్పించబడినవిగా భావించాలి. అలా నిరంతరతం విచారణ చేయాలి.

ఇంతవరకు జడ ప్రకృతితో ఎలా వ్యవహరించాలో తెలుసుకున్నాం. ఇక మన స్వరూపమైన చితిని ఎలా గుర్తించాలి?

చితిని గుర్తించుట ఎట్లు?

శ్లో॥ యా చిత్ర్వ భాత్వ మితి మేయ విభాసయిత్రీ
యత్సంక్ర మాత్ ఘటపటాద్ యవభాసి కాధిః ।
ఆ బ్రహ్మకీట మహ మిత్యవభాస మానా
యాసైవ సంవిదితి చింతయ సంతతం త్వం ॥ 21

**ప్రతిపదార్థం :–** యాచిత్ప్రభా = ఏ చిత్తు యొక్క ప్రకాశం; మేయ విభాసయిత్రీ = విషయవస్తువులను వెలిగించిచూపుతుందో; యత్ సంక్రమాత్ = దేనిప్రసరణవల్ల; ధీః = బుద్ధి; ఘటపటాది అవభాసికా = ఇది ఘటము, ఇది పటము అని తెలుసుకోగలుగుతుందో; ఆ బ్రహ్మకీటం అహం ఇతి = బ్రహ్మ నుండి పురుగు వరకు 'నేను' అని; యా అవభాసమానా = ఏది ప్రకాశిస్తున్నదో; సాఏవ = అదే; సంవిత్ ఇతి = అన్నీ తెలుసుకొనే చిత్తు అని; త్వం సతతం చింతయ = నీవు ఎల్లప్పుడూ విచారణచెయ్యి.

**భావం :–** ఏ చిత్తు యొక్క ప్రకాశం విషయవస్తువులను వెలిగించి చూపుతుందో – దేని ప్రసరణ వల్ల ఘటాన్ని, పటాన్ని విచక్షణ చేసి బుద్ధి తెలుసుకోగలుగుతుందో – బ్రహ్మనుండి కీటకం వరకు 'నేను' అంటూ ఏది ప్రకాశిస్తున్నదో అదే సంవిత్తు. చిత్తు (అన్నీ తెలుసుకోనేది) అని నిరంతరం చింతన చెయ్యి.

**వ్యాఖ్య :–** బయటనున్న వస్తువులను ఇది ఇల్లు, ఇది కుర్చీ, ఇతడు మనిషి, అది సూర్యుడు అని స్పష్టంగా చూచి చెప్పవచ్చు. అలాగే ఇది కన్ను, ఇది కాలు, ఇది చెయ్యి, ఇది ముక్కు అని ఇంద్రియాలను గూర్చి స్పష్టంగా చెప్పవచ్చు. మనస్సును చూడలేంగాని మనం ఆలోచనలు చేస్తున్నప్పుడు చేస్తున్నది మనస్సని, అలాగే సుఃఖ దుఃఖాలు అనుభవిస్తున్నప్పుడు ఆ అనుభవించేది మనస్సు అని చెప్పవచ్చు. నిశ్చయాలు చేసేది; ప్రణాళికలు వేసేది బుద్ధి అని తెలుసుకోవచ్చు. కాని తనలోని చితిని – చైతన్యాన్ని ఎవరైనా ఎలాచూడగలరు? ఎలా గుర్తించగలరు? ఎలా భావించగలరు? ఎందుకంటే అది కంటికి కనబడే స్థూలవస్తువా? కాదు. పోనీ అది ఏదన్నా పనులు చేసేదా? కాదు. అకర్త. ఏమన్నా అనుభవించేదా? కాదు. అభోక్త. బుద్ధిలాగా నిర్ణయాలు చేసేదా?

కాదు. అది ఏమీ చేసేదికాదు. మరెలా తెలుసుకోవటం? దాని కొకటే మార్గం. దాని వల్ల ఈ జగత్తులోగాని, తనలో గాని ఏమేమి జరుగుతున్నదో పరిశీలించి తెలుసుకోవటమే మార్గం. బల్బులుని, ఫ్యాన్‌ని, ఫ్రిజ్‌ని, టివిని, అన్నింటిని చూచి తెలుసుకోవచ్చు. కాని కరెంటును ఎలా తెలుసుకోవటం? పైన చెప్పిన వస్తువులలో జరిగే మార్పులను పరిశీలించి మాత్రమే తెలుసుకోవాలి. ఫ్యాన్ తిరిగినా, లైటు వెలిగినా, టివిలో బొమ్మ కనిపించినా, కరెంటు ఉన్నదని తెలుసుకోగలం.

చితి – చైతన్యం లేదా ఆత్మ ఎప్పుడూ ఉండే సత్ అని, అన్నింటిని తెలుసుకొనే చిత్ అని, ఆనంద స్వరూపమని వేదాలు ఘోషిస్తున్నాయి. అది ఎప్పుడూ ఉండేదని మనం చూసి చెప్పలేం. ఎందుకంటే చూసే మనం ఎప్పుడూ ఉండం గనుక. ఆనందస్వరూపమని ఆస్థితికెదిగినప్పుడే చెప్పగలం. ఇక చిత్ స్వరూపమనేది శుద్ధమైన బుద్ధితో ఆలోచించి నిర్ణయించగలం. అదే ఈ శ్లోకంలో చెప్పిన చితిని గుర్తించే విధానం.

(1) ఈజగత్తులో అనేక విషయాలున్నాయి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ అనే 5 విషయాలు. శబ్దాన్ని చెవితో విని, రూపాన్ని కంటితో చూచి తెలుసుకోగలం. అయితే శబ్దాన్ని చెవి వినగలుగుతున్నది అంటే చెవికి అది సహజగుణమా? అయితే చనిపోయినవాడి చెవి ఎందుకు వినదు? అంటే చెవి వినాలంటే చెవి వెనుక ఏదో ఒక శక్తిఉండితీరాలి. అలాగే కన్ను చూడాలంటే కంటి వెనుక ఏదో ప్రకాశం ఉండి తీరాలి. ఏమిటా శక్తి? ఏమిటా ప్రకాశం? అంటే అదే చైతన్య శక్తి, చితి ప్రకాశం. అంటేలోపల ఉన్న 'చితి ప్రకాశం' కంటి ద్వారా బయటకు వచ్చి ఎదురుగా నున్న విషయవస్తువుపై పడినప్పుడే ఆ వస్తువును కన్ను చూడగలుగుతున్నది. ఆ చితి ప్రకాశం లేని శవం కంటితో చూస్తున్నప్పటికీ ఎదటి వస్తువును చూడలేదు. తెలుసుకోలేదు. అంటే దీనిని బట్టి మనకు తెలిసేది ఏమిటి? కన్ను చూడాలన్నా, చెవి వినాలన్నా, ముక్కు వాసన చూడాలన్నా, నాలుక రుచి చూడాలన్నా, చర్మం స్పర్శించి

తెలుసుకోవాలన్నా వాటన్నింటికి లోపల ఒక ప్రకాశం ఉండి ఉండాలన్న మాట. ఆ ప్రకాశమే చితి ప్రకాశం. ఆత్మ ప్రకాశం. ఆత్మ చైతన్యం. అదే నేను.

(2) ఇక చితి యొక్క ప్రకాశం వల్ల కన్ను వస్తువును చూడగలదే గాని, ఇది ఫలానా వస్తువని గాని ఆవస్తువు ఫలానా పనికి పనికివస్తుందని గాని, అదినాకు కావాలి అనిగాని, వద్దనిగాని కన్నుచెబుతుందా? చెప్పలేదు. కన్ను కేవలం ఆకారాన్ని చూడటం వరకే. అది ఏవస్తువో, ఎలాంటిదో, అవసరమో కాదో, తేల్చి చెప్పాల్సింది బుద్ధి మాత్రమే. బుద్ధికి అలాంటి విచక్షణా శక్తి ఉన్నది. అయితే ఆ బుద్ధి ఎప్పుడు పనిచేస్తుంది? ఆ బుద్ధికి వెనుక చితి యొక్క ప్రకాశం, చైతన్యం ఉంటేనే. లేకపోతే జడమైన బుద్ధి పనిచేయదు. ఫ్యాను తిరిగి గాలినిస్తుంది. లైటు వెలిగి కాంతినిస్తుంది. అయితే ఆ రెండూ జరిగేది కరెంటు వాటిలోకి ప్రవేశించి ఉన్నప్పుడు మాత్రమే. అలాగే బుద్ధి విచక్షణను సాగించాలంటే దాని వెనుక చైతన్య ప్రకాశం ఉండాలి.

అంటే బుద్ధి పనిచేస్తున్నదీ అంటే అక్కడ చైతన్యం – చితి ఉన్నది అని. అదే నేను.

(3) ఇక అందరిలోను అంటే శరీర మనో బుద్ధులున్న మానవులలోను, కేవలం శరీరం మనస్సులు మాత్రమే ఉండి బుద్ధిలేని జంతువులలోను, కీటకాల్లోను అన్నింటిలో 'నేను–నేను అనే భావం ఉన్నది. (ఇదే అహంకారం). ఈ భావం దేనివల్ల ఉంటున్నది? అదీ చితియొక్క ప్రకాశమే. నిజంగా 'నేను నేను' అనేది చితియే. ఆత్మయే. ఏమీ చేయని, ఏమీ అనుభవించని ఆత్మయే. కేవలంగా ఉండే చైతన్యమే. అయితే నేను సుఖంగా ఉన్నాను, నేను దుఃఖంగా ఉన్నాను. నేను వెళుతున్నాను, నేను ఆలోచిస్తున్నాను, నేను చక్కగా ఈ పని నెరవేర్చాను అంటాంగదా. ఇదీ చితియేనా? నిజంగా చితియే అంటున్నది. కాకపోతే తననుతాను గుర్తించగలిగిన, తెలుసుకోగలిగిన, నేను ఆత్మనని ఎరుకలో ఉన్న చితిగాదు. ఈ దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యం పెట్టుకొని, దేహమే నేను అనుకుని భ్రమలో ఉన్న చితి నేను వెళ్తున్నాను, నేను చేశాను అంటుంది. శరీరంతో సహా మనస్సుతో తాదాత్మ్యం చెందిన చితి నేను ఆలోచిస్తున్నాను,

దుఃఖిస్తున్నాను అంటుంది. బుద్ధితో తాదాత్మ్యం చెందిన చితి నేను ప్రణాళికలు వేస్తున్నాను అంటున్నది. ఇలా దేహేంద్రియ మనోబుద్ధులతో తాదాత్మ్యం చెందిన చితినే అహంకారం అన్నారు. ఈ అహంకారమే నేను దేహంలో ఉన్నాను అని, ఈ ప్రపంచం నాకు బయట ఉన్నది అని అనుకుంటుంది. ఎందుకంటే దేహానికి పరిమితమై ఉంటుంది కనుక అల్పత్వంతో, పరిమితత్వంతో ఉంటుంది. అదే ఏ తాదాత్మ్యము లేని ఆత్మచైతన్యం – చితి ప్రకాశం తాను అంతటా ఉన్నానని, కేవలంగా ఉన్నానని, తాను ఏమీ చేయటం లేదని, ఏ అనుభవాలు పొందటం లేదని నిర్లిప్తంగా శాంతంగా ఆనందంగా పరిపూర్ణంగా ఉంటుంది. అన్ని జీవుళ్ళలోను 'నేను–నేను' అంటూ ఉండేది ఈ చితి ప్రకాశమే.

ఐతే నేను, నేను అని స్పష్టంగా పలికేది కేవలం మానవుడేగదా! కనుక ఈ చితి ప్రకాశం కేవలం మానవులలో మాత్రమే ఉంటుందా? నోరులేని మూగ జీవాలలో కూడా ఉంటుందా? అసలు ఏశబ్దాలు చేయని చీమలు, కొన్ని పురుగులలో కూడా ఈ చితి ప్రకాశం – ఆత్మ చైతన్యం ఉంటుందా? మరి అవేవీ నేను నేను అని అనవుకదా!

అన్ని ప్రాణులలోను ఈ అహంభావం – నేను–నేను అనే భావం ఉంటుంది. కాకపోతే పరిణతిచెందిన మానవుడు నేను–నేను అంటాడు. జంతువులు బుద్ధిలేనివి గనుక అలా అనలేవు. క్రిమి కీటకాలు కూడా అనలేవు. కాకపోతే అనలేని ఈ మూగ జీవాలన్నింటిలో అహంభావన మూగగా ఉంటుంది. చీమని చేత్తో ఒక వైపుకు నెడితే తిరిగి ఇటే వస్తుంది. తేలును చంపబోతే కుట్టి తప్పించుకుంటుంది. కుక్కని తోకపట్టుకు లాగితే మొరిగి కరుస్తుంది. కోతిని భయపెట్టబోతే పళ్ళన్నీ బయట పెట్టి మీదకు దూకుతుంది. ఈ ప్రతిచర్యలన్నీ అహంభావన యొక్క ప్రకట స్వరూపాలే. వాటిలోను భయం, సంతోషం, కోపం, తిరగబడటం మొ।న వికారాలుంటాయి. కనుక వాటిల్లో అహంభావన (చిత్) ఉన్నది.

ఈ ప్రకారంగా ఏ చితి యొక్క ప్రకాశం బాహ్యమైన విషయాలను, విషయవస్తువులను వెలిగించి చూపుతున్నదో, ఏచితి ప్రకాశం జ్ఞానేంద్రియాలకు

శక్తినిచ్చి విషయజ్ఞానం గ్రహించేట్లు చేస్తున్నదో, ఏ చితి ప్రకాశం కర్మేంద్రియాలకు శక్తి నిచ్చి పనిచేయగలిగేటట్లు చేస్తున్నదో, ఏ చితి ప్రకాశం బుద్ధికి శక్తినిచ్చి విచక్షణాజ్ఞానంతో ఉండేట్లు చేస్తున్నదో, ఏ చితి ప్రకాశం నేను – నేను అనే అహంభావానికి అధారంగా ఉన్నదో ఆ చితి ప్రకాశమే సంవిత్తు. అంటే అన్నింటిని తెలుసుకొనే చిత్ స్వరూపం. దేహేంద్రియమనోబుద్ధుల వృత్తులన్నింటిని తెలుసుకోగల చిత్ స్వరూపం – ఆత్మ చైతన్యం అని గ్రహించి నిరంతరం ఆత్మ గురించిన విచారణ చేయాలి. అట్టి చితిని – చైతన్యాన్ని – ఆత్మను నేనే అని విచారణచేయాలి.

ఇంకా విచారణ ఎలా సాగాలి?

**శ్లో॥ జాగ్రన్ముఖ త్రివిధ ధామసు సాక్షిణేయా**
**జాగ్రన్ముఖ త్రివిధ ధామ విలక్షణాయా ।**
**స్వప్నాద్యను స్మృతి బలాత్సత తైక రూపా**
**సైవాహమస్మి చితి రిత్యవ ధారయ త్వం ॥ 22**

**ప్రతిపదార్థం :–** జాగ్రత్ ముఖ = జాగ్రత్‌తో మొదలయ్యే; త్రివిధదామసు = మూడు అవస్థలలోను; యాసాక్షిణే = ఏది సాక్షిగా ఉంటుందో; జాగ్రత్ ముఖ త్రివిధధామ = జాగ్రత్‌తో మొదలయ్యే 3 స్థానాలకు; యావిలక్షణా = ఏది వేరుగా ఉంటుందో; స్వప్నఆది అనుస్మృతిబలాత్ = స్వప్న సుషుప్తుల నిరంతర జ్ఞాపకం కారణంగా; సతత్ఏకరూపా = ఎల్లప్పుడూ ఒకే రూపంలో ఉండేది ఏదో; సాచితి ఏవ అహంఅస్మి = ఆ చితియే నేను; ఇతి త్వం అవధారయ = ఇలా నీవు భావించు.

**భావం :–** జాగ్రత్ స్వప్న సుషుప్తులనే 3 అవస్థలలోను ఏది సాక్షిగా ఉంటుందో, జాగ్రత్‌తో మొదలయ్యే 3 స్థానాలకు ఏది వేరుగా ఉంటుందో, స్వప్న సుషుప్తుల నిరంతర జ్ఞాపకం కారణంగా ఎల్లప్పుడూ ఒకే రూపంగా ఉండేది ఏదో ఆ చితియే నేను అయి ఉన్నాను – అని నీవు నిరంతరం చింతించు.

**వ్యాఖ్య :– సాక్షిః** జాగ్రత్ – స్వప్న – సుషుప్తులనేవి జీవుడికి మూడు అవస్థలు

– ఆ అవస్థలలో జీవుడు దర్శించేలోకాలు కూడా వేరు వేరుగా మూడు ఉన్నాయి. జాగ్రత్ ప్రపంచం, స్వప్న ప్రపంచం, సుషుప్తి శూన్యం. ఇక ఈ లోకాలలో వ్యవహరించే జీవుణ్ణి కూడా వేరు వేరు పేర్లుతో వ్యవహరిస్తారు. జాగ్రదావస్థలో వ్యవహరించే జీవుణ్ణి విశ్వుడని; స్వప్నావస్థలో వ్యవహరించే జీవుణ్ణి తైజసుడని; సుషుప్తిలో ఏ అనుభవమూలేకుండా ఏమీ తెలియకుండా ఉన్న జీవుణ్ణి ప్రాజ్ఞుడని అంటారు.

ఇలా వేరు వేరు అవస్థలలో, వేరువేరు పేర్లుగల జీవుడు వేరువేరు లోకాలను చూస్తూ అనుభవాలు పొందుతున్నాడు. మేలుకున్న అవస్థ జాగ్రదావస్థ. ఈ అవస్థలో జీవుడు ఈ లోకంలో వ్యహరిస్తూ అనుభవాలు పొందుతాడు. ఇక స్వప్నావస్థ అంటే నిద్రించిన తర్వాత శరీరం అలిసి సొలసి మత్తుగా పడి ఉంటే మనస్సు ఇంకా అలుపురాక ఏవేవో లోకాలను సృష్టించుకుంటుంది. ఆ అవస్థలో జీవుడు తైజసుడుగా అనేక సుఖ దుఃఖ అనుభవాలు పొందుతాడు. ఇక సుషుప్తి అంటే గాఢ నిద్ర. శరీరం మనస్సు రెండూ అలసి పూర్తి విశ్రాంతి తీసుకున్న సమయం. ఆ సమయంలో జీవుడు హాయిగా నిద్రపోతాడు. అప్పుడు జీవుడికి ఏ అనుభవాలు ఉండవు. ఏ ఆలోచనలు ఉండవు. ఏమీ చేయడు. ఏమీ తెలియదు. (కిమపి నజానామి...) ఇలా వేరువేరు అవస్థలలో వేరువేరు అనుభవాలుంటాయి.

జీవుడు స్థూలశరీరంలో ఉన్నప్పుడు జాగ్రత్‌లోకాన్ని, సూక్ష్మ శరీరంలో ఉన్నప్పుడు స్వప్నలోకాన్ని, కారణ శరీరంలో ఉన్నప్పుడు సుషుప్తి శూన్యాన్ని చూస్తాడు.

అయితే ఈ 3 లోకాలని చూసే, అనుభవించే జీవుడు ఒక్కడేనా? వేరువేరు వ్యక్తులా? ఎందు కంటే జాగ్రదవస్థలో ఒక డాక్టరు, స్వప్నావస్థలో కూలీ అవుతాడు. జాగ్రదవస్థలో ఒక రైతు స్వప్నావస్థలో ఒక మంత్రి అవుతాడు. సుషుప్తిలో ఏమీలేని శూన్యంగా ఉంటాడు. కనుక ముగ్గురు వేర్వేరు వ్యక్తులని అనిపిస్తుంది. కాని యదార్థం ఆలోచిస్తే ఇలా ముగ్గురుగా కనిపించే మూడు వ్యక్తిత్వాలు ఒకే జీవుడు అని గ్రహించవచ్చు. అనుభవాలు మాత్రం వ్యక్తిత్వాలవి. జీవుడుమాత్రం ఒక్కడే.

నిజంగా జీవుడికి ఈ 3 శరీరాలు 3 ఇళ్ళ వంటివి. స్థూల శరీరమనే ఇంటిలో కూర్చుని జాగ్రత్‌లోకాన్ని దర్శించిన జీవుడే సూక్ష్మశరీరంలో కూర్చుని స్వప్నలోకాన్ని దర్శించి అనుభవిస్తున్నాడు. ఆ జీవుడే కారణ శరీరంలో కూర్చొని హాయిగా నిద్రపోతూ ఏమీ తెలియని శూన్యస్థితిలో ఉంటున్నాడు. జీవుడి అనుభవాలను బట్టి విశ్వ, తైజస, ప్రాజ్ఞులని పేరు పెట్టారేగాని నిజంగా జీవుడు ఒక్కడే. అలా ఒక్కడేగనుక కాక పోతే స్వప్న లోకంలో పొందిన అనుభవాలను ఎలా గుర్తు పట్టగలుగుతున్నాడు? అలాగే సుషుప్తిలో ఏమీ తెలియని అనుభవం, హాయిగా నిద్రపోయినట్లు ఎలా చెప్పగలుతాడు.

అంటే జాగ్రదవస్థలో అక్కడి జీవుడు చేసే పనులను, పొందే అనుభవాలను; అలాగే స్వప్నావస్థలో అక్కడి జీవుడి పనులను, పొందే అనుభవాలను; సుషుప్తిలో ఏమీ తెలియని అజ్ఞానాన్ని, సుఖాన్ని ఎవరు సాక్షిగా చూస్తున్నారో అదే జీవుడి అసలు స్వరూపం, చితిప్రకాశం, చైతన్యం. ఆ చితిప్రకాశం వల్లనే 3 అవస్థలు, అందులోని అనుభవాలు అన్నీను. 3 అవస్థలలోని అనుభవాలకు చితి ప్రకాశమే సాక్షి. చైతన్యమే సాక్షి. ఆ సాక్షియే నేను.

3 లోకాలని చూడాలన్నా, 3 ధామాలను (ఇళ్ళను) వాడుకోవాలన్నా, చైతన్యం కావాలి. అదే జీవుడి చైతన్యం. అదే నేను. ఆ చితినే నేను అని భావన చేయాలి. అంటే చితినైన నేను విశ్వుడి వేషంలో జాగ్రదావస్థలో ఒక రకమైన అనుభవాలు, తైజసుడి వేషంలో స్వప్నావస్థలో మరోరకమైన అనుభవాలు, ప్రాజ్ఞుడి వేషంలో సుషుప్తిలో, ఏ అనుభవాలు లేని అజ్ఞానంతో ఉంటున్నాను. కాకపోతే 3 వేషాలలోని 3 అనుభవాలు నాకు తెలుసు. కనుక నేను సాక్షిని. 3 అనుభవాలకు, వ్యక్తిత్వాలకు సాక్షిని.

(3) 3 ధామాలు ,3 లోకాలు, 3 వ్యక్తిత్వాలు మారిపోతున్నాయి గదా. మరి చితినైన నేను కూడా మారిపోతున్నానా? చితి మారుతుందా? అంటే చితి – చైతన్యం నిర్వికారం – ఏ మార్పులూ – వికారాలు లేనిది. అన్ని మార్పులని గమనించేది, సాక్షిగా ఉండి చూచేది. కనుక మార్పులకు అతీతమైనది. అది ఎప్పుడూ ఏకరూపంగా ఉండేది. చితి ఏకరూపంగా ఉండేది గాక మార్పులు

చెందేదే అయితే జాగ్రదావస్థ లోని చితి మారిపోయింది గనుక జాగ్రదావస్థ గుర్తుండదు. స్వప్నావస్థలోని చితి మారిపోతుంది గనుక స్వప్నంలో ఏం జరిగిందీ గుర్తుండదు. సుషుప్తిలోని చితి మారిపోయింది గనుక మేలుకున్న తర్వాత సుషుప్తిలోని అనుభవరాహిత్యం, హాయిగా నిద్రపట్టిన విషయం తెలియకుండా పోతుంది. కాని అన్ని అవస్థలలోని విషయాలు నిరతరం జ్ఞాపకం ఉంటున్నాయి గదా! కనుక చితిలో ఏమార్పులు లేవు. అది ఎల్లప్పుడూ ఒక్కటిగానే ఉంటుంది.

ఇలా 3 అవస్థలకు – ఆ అవస్థలలోని అనుభవాలకు సాక్షిని 'నేనే' అని నిరంతరము చింతనచేస్తూ ఆ 3 అవస్థలనుండి బయటపడాలి.

ఇంకా ఆత్మ విచారణ ఎలా సాగాలో...

**శ్లో॥ నోదేతి నాస్త ముపయాతి నవృద్ధిమేతి**
**నైవోపయాతి పరిణామ మపక్షయం వా ।**
**స్వాధ్యస్త సర్వజన నాది వికార సాక్షిణ్**
**ఏషా హిసంవిదితి చింతయ సంతతం త్వం ॥ 23**

**ప్రతిపదార్థం :–** న ఉదేతి = ఇది (ఆత్మ – చితి) పుట్టదు; న అస్తం ఉపయాతి = మరణించదు; నవృద్ధింఏతి = వృద్ధిచెందదు; న అపక్షయం = క్షీణించదు; పరిణామం న ఉపయాతి = మార్పు చెందదు; స్వఅధ్యస్త = ఆత్మపై ఆరోపించబడ్డ; సర్వజనన ఆది వికార సాక్షిణి = పుట్టుక మొ॥న అన్ని వికారాలకి సాక్షి; ఏషాహి సంవిత్ ఇతి = ఇదే సంవిత్తు (అన్నీ తెలుసుకొనేచిత్తు) అని; త్వం సంతతం చింతయ = నీవు ఎల్లప్పుడూ భావనచేస్తూ ఉండు.

**భావం :–** ఇది (చితి–ఆత్మ) పుట్టదు, మరణించదు. వృద్ధి చెందదు, క్షీణించదు, ఏ మార్పులు చెందదు. ఆత్మపై ఆరోపించబడ్డ పుట్టుక మొ॥న అన్ని వికారాలకి సాక్షిగా ఉంటుంది. ఇదే సంవిత్తు అని నిరంతరం నీవు భావన చేస్తూండు.

**వ్యాఖ్య :–** జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలకు, ఆ అవస్థలలోని జీవుడి యొక్క అనుభవాలకు సాక్షి అయినది ఈ చితి ప్రకాశమేనని, అట్టి చితి ప్రకాశాన్ని – ఆత్మ చైతన్యాన్ని నేనేనని నిరంతరం విచారణ చేస్తూ జీవుడు తనయదార్థ స్థితిలో తానుండాలని క్రిందటి శ్లోకంలో తెలుసుకున్నాం.

ఈ శ్లోకంలో ఇంకా జీవుడియొక్క స్థితి గతులను, యదార్ధ స్వరూప స్వభావాలను ఇంకా ఎలా విచారణచేయాలో తెలియ జేస్తున్నారు. అంతేగాక తన స్థితిని తాను మరచి పోవటానికి కారణాన్ని కూడా తెలియజేసి దానిని సరిచేసుకొని **గుర్తుంచుకొనే** ఉపాయాన్ని కూడా తెలియజేస్తున్నారు.

ఆత్మయొక్క స్థితి గతులు, లక్షణాలు ఏమిటో చెబుతున్నారు. ఆత్మ పుట్టేదికాదు. అలాగే ఆత్మకు మరణంలేదు. ఆత్మ వృద్ధి చెందేదికాదు, క్షీణించేది కృశించేదీకాదు. అసలు ఏమార్పులు లేనిదిఆత్మ. ఆత్మ అంటే అది ఎవరోకాదు – నేనే. అంటే నాకు పుట్టుకలేదు, మరణం లేదు, వృద్ధిక్షయాలులేవు, ఏమార్పులు లేవు. కాని నేను ఫలానా సంవత్సరం – ఫలానానెల, ఫలానా తేదీన పుట్టాను అంటున్నాం గదా! పుట్టిన రోజు చేసుకుంటున్నాంగదా! అలాగే ఎప్పుడో ఒకప్పుడు మరణిస్తాను అంటున్నాంగదా! నేను ఇప్పుడు ఇలా ఉన్నాను గాని, నా చిన్నప్పుడు భలేగోల చేసే వాణ్ణండీ! అంటున్నామే. అంటే అప్పటికీ ఇప్పటికీ వృద్ధి జరిగిందన్నమాట. అలాగే ఆ! ఇప్పుడున్న ఈ ఓపిక ఇంకా 10 సం॥లు పోతే ఉంటుందాండీ? శరీర పటుత్వంతగ్గిపోయి, ఏపనీచేయలేని స్థితి వస్తుందిగదా! అంటుంటాం. అంటే ఒకప్పటికి నేను క్షీణిస్తాను. కృశించిపోతాను అని భావం. ఇలా అనేక విధాలుగా మారిపోతాను, ఎప్పుడూ ఒకే విధంగా ఉండను అని తెలుసు – అంటుంటాం కూడా; ఇదేమిటి?

నేనేమో ఆత్మనాయె. ఆత్మకేమో జనన మరణాలు, వృద్ధి క్షయాలు లేవాయె. కాని నాకు జనన మరణాలు వృద్ధిక్షయాలు ఉన్నాయని భావిస్తుంటాం, అందరికీ చెబుతుంటాం. ఎందుకు ఇలా జరుతుగున్నది? ఎందుకంటే? భ్రమ. దేహం పుడుతున్నది. ఒకప్పుడు మరణిస్తున్నది, వృద్ధిచెందుతుంది, క్షీణిస్తుంది. అనేక మార్పులు చెందుతుంది. ఐతే నేను ఆత్మనని మరచి, దేహంతో తాదాత్మ్యంచెంది, దేహమే నేను అనుకొని, ఆ దేహలక్షణాలను నాపై ఆరోపించుకొని పుడుతున్నాను, చస్తున్నాను, వృద్ధిచెందుతున్నాను, కృశించిపోతున్నాను అని అంటాం. ఇదే భ్రమ, భ్రాంతి. తప్పుడు భావన. ఇది నిజంగా మానసిక ఊహ–భ్రమ. భ్రాంతియేకాని నిజంకాదు. మరి నిజమేమిటో శాస్త్రాలద్వారా, సద్గురువుల

ద్వారా తెలుసుకొని మనసుద్వారా జరిగిన పొరపాటును తిరిగి మనస్సు ద్వారానే సరిచేసుకోవాలి. 'దేహమే నేను' అనే ఈ తప్పుడు భావనను "ఆత్మయేనేను" అనే సరైన భావన ద్వారా - చింతన ద్వారా సరిచేసుకోవాలి. అలా సరిచేసుకోవాలంటే దేహం యొక్క పుట్టుకను, పెరుగుదలను, క్షీణతను, మరణాన్ని అన్నింటిని తెలుసుకునే నేను సంవిత్తును (సకలాన్ని తెలుసుకొనే) సాక్షిని. సాక్షినైన నాకు జననమరణాలు, వృద్ధిక్షయాలు లేవు. ఏ మార్పులు లేని నిర్వికార సాక్షి చైతన్యాన్ని. అన్ని మార్పులను నేను తెలుసుకుంటున్నాను అని నిరంతరం విచారణ చేస్తూ అలా సాక్షిగా - తెలుసుకొనే తెలివిగా - చితి ప్రకాశంగా ఉండిపోవాలి.

ఆత్మనైన నా యదార్ధ స్వరూపం ఏమిటి? నా స్వభావం ఏమిటి?

**శ్లో॥ ముచ్చేషతాం సమవలంబ్య సుతాది సర్వం**
**యేన ప్రియం భవతి తేన సుఖ స్వరూపః ।**
**దేహేంద్రియాది విషయ ప్రళయైక సాక్షీ**
**యస్యాత్ తతస్సఇతిమే నిజరూపమాస్వ ॥ 24**

**ప్రతిపదార్థం :-** యేన = దేని వల్ల; మత్‌శేషతాం సమవలంఖ్య = 'నేను' అనే శేషాన్ని ఆధారంచేసుకొని; సుతాది సర్వం ప్రియం భవతి = పుత్రులు మొ॥వి అన్నీ ప్రియమవుతున్నాయో; తేన = ఆకారణంచేత; సుఖ స్వరూపః భవతి = అది సుఖస్వరూపమవుతున్నది; దేహేంద్రియాది విషయ ప్రళయు = దేహేంద్రియాలు మొ॥న విషయాల నాశనానికి; ఏక సాక్షి యస్యాత్ = ఏకసాక్షి అయినందున; మేనిజరూపం = నానిజ స్వరూపం; తతః సత్‌ఇతి ఆస్వ = ఆకారణం చేత 'సత్' అని భావించు. ఉండిపో.

**భావం :-** దేని కారణంగా **నేను** అనే జీవుడికి పుత్రాదులు ప్రియం అవుతున్నారో అది ఆకారణంచేత సుఖస్వరూపమైదని, దేహేంద్రియాలు మొ॥న విషయాల నాశనానికి ఏకసాక్షి అయినందున నా నిజ స్వరూపం సత్తా అని నిలచి ఉండు.

**వ్యాఖ్య :-** ప్రతివానికి పుత్రులయందు, భార్యయందు, గృహాదులయందు, సుఖాన్నిచ్చే వస్తువులయందు, విషయాలయందు, భోగాలయందు ఎంతో ప్రీతి.

ఏవైనా తనకు సుఖాన్నివ్వవు అనుకుంటే వాటియందు అయిష్టత. వాటిని వదిలించుకొని మళ్ళీక్రొత్త వాటియందు ప్రీతిని కలిగి ఉంటాడు. ఇలా ఎప్పుడూ జీవుడు సుఖాన్ని పొందాలని, ఆనందాన్ని పొందాలని తపిస్తూ ఉంటాడు. అందుకొరకే ఎన్నో ప్రయత్నాలు చేస్తాడు. ఇలా ఎందుకు సుఖం కొరకే ప్రాకులాడుతాడు? దుఃఖాన్ని ద్వేషిస్తాడు? అంటే జీవుడి యొక్క నిజస్వరూపం అమిత సుఖస్వరూపం. కనుకనే సుఖాన్నే కోరుకుంటాడు. ఒకడికి సుఖాన్నిచ్చే వస్తువు మరొకడికి దుఃఖాన్ని వ్వవచ్చు గదా! ఒకడికి స్వీటంటే ప్రాణం. మరొకడికి అసలు ఇష్టం ఉండదు. అంటే ఈ ఇష్టాఇష్టాలు మనస్సుకు చెందినవే. మనస్సును బట్టి వస్తువులపై ఇష్టా ఇష్టాలు ఏర్పడతాయి. అయితే ఏ మనస్సైనా ఒక వస్తువును ఇష్టపడుతుంది అంటే ఆ వస్తువుతో సుఖించాలనే భావం మాత్రం ఆ జీవుడి అసలు స్వరూపమైన ఆత్మదే. ఎందుకంటే ఆత్మసుఖ స్వరూపంగనుక. ఆత్మ సుఖస్వరూపం కాకపోతే జీవుడు కొన్నింటిని ప్రియంగా, కొన్నింటిని అప్రియంగా చూచేవాడేకాదు.

ఇక దేహేంద్రియాలు కృశించి పోతుంటే మనకు తెలుస్తూనే ఉంటుంది. నాకు కనబడటం లేదని, వినబడటం లేదని, శక్తి తగ్గిపోయిందని అంటూ ఉంటాం. ఇలా అన్నింటిని తెలుసుకొనేది ఎవరు? జీవుడే. అంటే బుద్ధిలోని తెలివి ద్వారా తెలుసుకుంటాడు. తగిన చికిత్సలు చేస్తాడు. ఐతే బుద్ధిలోని తెలివిని, ఆచికిత్సలను కేవలం తెలుసుకొనేది జీవుడిలోని సత్తాయే. కనుక నా నిజస్వరూపం సత్తాయే. నేను కేవలసత్ – చిత్ – ఆనందస్వరూపాన్ని అని నిరంతరం విచారణ చేస్తూ ఉండాలి.

ఇంకా నీ స్వరూపం ఏదో విచారణ చెయ్యి – ఎలా?

నీ యదార్ధ స్థితిలో – స్వస్థితిలో ఉండి పోయేందుకు ఒక అద్భుత విచారణా మార్గం ఈ శ్లోకంలో – అసలు నేనెవరిని? అనే ప్రశ్నకు సమాధానం.

**శ్లో॥ ఆదౌ త్వమేవ సదభూత విశేషరూపః**
**త్వత్తోదితం జగదిదం సవిశేష జాతం ।**
**త్వయ్యేవ తిష్ఠతి తథాత్వయి చావసానే**
**సంలీయతే జలనిధా వివ బుద్బుదాదిః ॥** 25

**ప్రతిపదార్థం :–** ఆదౌ = మొదట్లో; త్వంఏవ = నీవు మాత్రమే; సత్ అవిశేషరూపః = ఏమీలేని సత్ రూపంలో; ఆ భూత్ = ఉన్నావు; త్వత్తః ఇదంజగత్ సవిశేషజాతం = నీ నుండే ఈ జగత్తు అనేక రూపాలతో, లక్షణాలతో పుట్టింది; త్వయి యేవతిష్ఠతి = నీలోనే ఉన్నది; తథా అవసానే = అలాగే చివరకు; జలనిధౌ బుద్బుద ఆది ఇవ = సముద్రంలో బుడగలలాగా; త్వయి = నీలోనే; సంలీయతే = లయమైపోతుంది.

**భావం :–** మొదట్లో నీవు మాత్రమే ఏ విశేషమూ లేకుండా సద్ రూపంలో ఉన్నావు. నీనుండే వైవిధ్యంతో కూడిన ఈ జగత్తు ఉదయించింది. నీలోనే కొంతకాలం ఉంటుంది. చివరకు సముద్రంలో బుడగలు ఎలా సముద్రంలోనే లయమౌతాయో అలాగే నీలోనే లయమై పోతుంది.

**వ్యాఖ్య :–** మొదట్లో కేవల సత్తా – కేవలచైతన్య స్వరూపమైన నీవే ఉన్నావు. నీ కన్నా అన్యంగా మరేమీ లేదు. ఏ వైవిధ్యమూలేదు. ఆ తర్వాత నీనుండే ఈ జగత్తు – వైవిధ్యంతో కూడిన జగత్తు – జడ చైతన్యాలతో కూడిన జగత్తు ఉదయించింది. **నీ నుండి ఈ జడ చైతన్యాలతో కూడిన జగత్తు ఎందుకు ఉదయించింది**? నీ అవసరం కోసం – లేదా నీ అనుభవాల కోసం ఈ జగత్తంతా సృష్టింప బడింది. కేవల సత్తాస్వరూపమైన నాకు, సర్వత్రా రెండవదేదీ లేకుండా ఉన్న నాకు ఏ అవసరాలున్నాయి? ఏ అనుభవాలను కోరుకుంటాను? నిజంగా నాకే అవసరాలు లేవు. ఏ కొరతలూ – కోరికలులేవు. కనుక నాకేమీ అక్కరలేదు. పైగా నేను ఆనందస్వరూపాన్ని. కనుక నేను ఏ అనుభవాలను కోరాల్సిన పనే లేదు. మరి అలాంటి నాకు ఈ జగత్తుతో పనేమిటి?

నిజంగా నాకే ఆవసరమూ లేదు, కాని పూర్వ సృష్టికి సంబంధించిన, సమిష్టి వాసనలు నాలో నిక్షిప్తమై ఉన్నాయి. అవి కొంతకాలం అచేతనంగా ఉండి పోయి – తగిన సమయం రాగానే అనుభవాల కొరకు ప్రేరణనిస్తాయి. అలా ప్రేరణ నివ్వటం వల్ల తగిన అనుభవాలు పొందేందుకు, కర్మలుచేసేందుకు తగిన క్షేత్రాన్ని –అనుభవక్షేత్రాన్ని – జగత్తును సృష్టించుకున్నాను. అయితే ఆ సృష్టి అంతా నాలోనే జరుగుతున్నది. ఇలా జడచైతన్యాలతో కూడిన సృష్టి

జరిగిపోతున్నది.  ముందుగా పంచతన్మాత్రలు. ఆ తన్మాత్రలయొక్క సత్వ రజోగుణ అంశాలనుండి జ్ఞానేంద్రియాలు 5, అంతః కరణాలు 4, కర్మేంద్రియాలు5, ప్రాణాలు 5 మొత్తం 19 సూక్ష్మ తత్వాలతో సూక్ష్మశరీరం తయారవుతున్నది. ఆ తర్వాత పంచతన్మాత్రల తమోగుణ అంశమునుండి పంచీకరణం చెంది స్థూలభూతాలు తయారై, వాటికలయికతో స్థూలదేహం, ఈ స్థూల జగత్తు, చరాచరములన్నీ సృష్టింపబడుతున్నాయి.

వాసనల కనుగుణంగా ఈ జగత్తు నందు జీవుళ్ళు కర్మలు చేయటం, అనుభవాలు పొందటం జరిగి పోతుంటుంది. ఇలా కొంతకాలం సృష్టికొనసాగి, చివరకు అంతా **నాలోనేలయమై** పోతున్నది. మరల ఎప్పటిలాగే నేను మాత్రమే ఉంటున్నాను. సత్‌గా – కేవల సత్తాగా ఉండిపోతున్నాను.

ఈ మొత్తం వ్యవహారాన్ని అర్థం చేసుకోవాలంటే మన స్వప్నావస్థను గుర్తు తెచ్చుకుంటే సరిపోతుంది.

నేను రాత్రి పడుకున్నాను. కొంతసేపటికి నిద్రపట్టింది. శరీరం అచేతనంగా పడి ఉన్నది. ఆ సమయంలో నాకేమీ అక్కరలేదు. ఆకలిలేదు, దప్పికలేదు, కోరికలు లేవు, కర్మలు చేయాల్సిన అవసరంలేదు. అసలు ఈ బాహ్య ప్రపంచంతో కూడా ఏ సంబంధం లేదు. ఏ అనుభవాలు పొందాలనీ లేదు.

ఇలా ఏ అవసరమూ లేని నాలో ఒక ప్రపంచం – స్వప్న ప్రపంచం సృష్టించబడింది. ఎందుకు సృష్టించబడింది? నేను ఇలా ఒక ప్రపంచాన్ని సృష్టించాలని అనుకోలేదే! మరి ఎందుకు స్వప్న ప్రపంచ సృష్టి జరిగింది? ఎందుకంటే నా మనస్సులో అంతకు ముందు చేసిన ఆలోచనలకు, కోరిన కోరికలకు సంబంధించి కొన్ని వాసనలున్నాయి. 50, 60 వేల మంది ఉన్న సభలో వేదాంత ఉపన్యాసాలు చేయాలని, అందరూ నా ఉపన్యాసాలకు చప్పట్లు కొట్టాలని, నాకు ఎందరో భక్తులు, శిష్యులు తయారుకావాలని, వారంతా ఏనుగు మీద అంబారీ కట్టి నన్ను ఊరేగించాలని, సన్మానాలు చేయాలని, ఎన్నోగ్రంథాలు వ్రాయాలనీ, దేశ విదేశాల్లో ఎందరో ఆకర్షింప బడాలనీ – ఇలా ఏవేవో నాలో

ఆలోచనలున్నాయి.  ఆ ఆలోచనలే మనస్సులో ముద్రలుగా పడ్డాయి. అవే వాసనలు. రాత్రి నిద్రపోయిన తర్వాత ఆ వాసనలు మనస్సును ప్రేరేపించి రెచ్చగొట్టాయి. దానితో మనస్సు ఒక ప్రపంచాన్ని సృష్టించింది. అయితే ఈ సృష్టి అంతా నాకు బయట జరగలేదు. నా మనస్సులో జరుగుతున్నది. అలా సృష్టించబడ్డ ఆ స్వప్న ప్రపంచంలో నేను కాషాయవస్త్రాలు ధరించి స్టేజీమీద వెండి సింహాసనం మీద ఆశీనుడినయ్యాను. ఎదురుగా వేలజనం, తండోపతండాలుగా ఉన్నారు. అనర్గళంగా ఉపన్యాసాలిస్తున్నాను. అలా 11 రోజుల యజ్ఞం పూర్తయింది. నిర్వాహకులు ఏనుగును తెప్పించి అలంకరించి అంబారీ కట్టించి ఊరేగింపు ఏర్పాటు చేశారు. అలా గంటన్నర సేపు ఊరేగింపు సాగింది. చివరకు ఏనుగు బెదిరి పరుగెత్తటం ప్రారంభించింది. జనం చెల్లా చెదరయ్యారు. నేను దభీమని క్రింద పడ్డాను. మెలకువ వచ్చింది. ఇప్పుడు ఆ స్వప్న ప్రపంచమంతా ఎక్కడకు పోయింది. నా మనస్సులోనే లయమై పోయింది.

మరిప్పుడు స్వప్నంలో ఏనుగును ఎక్కణ్ణించి తెచ్చాం? కాషాయ వస్త్రాలు, ఎక్కడ కొనుక్కొచ్చాం? 50, 60 వేలమంది జనాన్ని దేనితో తయారుచేశాం? ఇవన్నీ నేను పడుకొనే ముందే తయారు చేసి పెట్టుకున్నానా? లేదే. అవి అన్నీ మనస్సులో కల్పితం. అంటే మనస్సులోని వాసనలకు అను గుణంగా ఒక నాటకం కల్పించబడింది. అంటే ముందు కేవలం మనస్సు ఒక్కటే ఉంది. ఏవైవిధ్యం లేకుండా ఉంది. ఆ తర్వాత ఆ మనస్సు నుండే వైవిధ్యంతో కూడిన ప్రపంచం - స్వప్న ప్రపంచం - జడ చైతన్యాలతో కూడిన ప్రపంచం ఉద్భవించింది. కొంతసేపు అది అలా కొనసాగింది. చివరకు నా మనస్సులోనే సర్వమూ అంతమై పోయింది.

అలాగే ఆత్మనైన నేను కేవలంగా వైవిధ్య రహితంగా సత్తా మాత్రంగా ఉన్నాను. నాలోని పూర్వ వాసనలు – సమిష్టి వాసనల యొక్క ప్రేరణతో ఈ జాగ్రత్ ప్రపంచం సృష్టించబడింది. ఇదంతానాలోనే సృష్టించబడింది. నాలోనే కొంతకాలం సాగుతుంది. చివరకు అది మొత్తం నాలోనే లయమై పోయింది. నేను ఎప్పటిలాగా ఆత్మగా  – కేవలంగా – సత్తామాత్రంగా ఉండిపోతాను.

మరి ప్రపంచం అంతా నాలోనే ఉంటే నాకు బయట ఉన్నట్లుగా అనిపిస్తున్నదేమిటి? నీవు ఆత్మవైతే నీలో ఉంటున్నది. నీవు జాగ్రత్ పురుషుడుగా ఉంటే నీకు బయట ఉంటున్నది. ఎలాగైతే స్వప్న పురుషుడికి స్వప్న ప్రపంచం బయట ఉన్నదో – అదినిజంగా జాత్రగత్ పురుషుడి లోపలే ఉన్నదో – అలాగే ఆత్మనైన నాలోనే ఈ జగత్తు ఉన్నది. అది ఉన్నా లేకున్నా నేను మాత్రం ఆత్మగా – సచ్చిదానంద స్వరూప ఆత్మగా – సర్వవ్యాపక చైతన్యంగా – సత్తాగా – సత్యం. నేను ఎప్పుడూ ఆత్మనే – ఇలా విచారణ సాగాలి. ఇంకా నా నిజస్వరూపం ఎలాంటితో విచారణ –

అనంతమైన ఆత్మగా ఉండిపోయేందుకు విచారణా పద్ధతి.

**శ్లో॥ వ్యాపిత్వ హేతు బలతోన దిశాస్తిమేంతః**
**నిత్యత్వ హేతు బలతశ్చ న కాలతోంతః ।**
**సార్వాత్మ్య హేతు బలతశ్చ న వస్తుతోంతః**
**తస్మాదనంత మితిమే నిజరూప మాస్వ ॥ 26**

**ప్రతిపదార్థం :–** (1) వ్యాపిత్వహేతు బలతః = సర్వత్రవ్యాపించి ఉన్న బలమైన కారణం చేత; మే = నాకు; దిశ అంతః న అస్తి = దిక్కుల అంతమంటూ లేదు; (2) నిత్యత్వ హేతుబలతః = ఎల్లప్పుడూ ఉండటమనే బలమైన కారణంచేత; కాలతః నఅంతః = కాలంలో అంతంలేదు; (3) సార్వాత్మ్య హేతు బలతః = అందరిలో ఆత్మగా ఉన్న బలమైన కారణం చేత; వస్తుతః న అంతః = వస్తుపరమైన అంతం లేదు; తస్మాత్ మేనిజరూపం = అందువల్లనా నిజస్వరూపం; అనంతం ఇతి ఆస్వ = అనంతమని ఉండిపో.

**భావం :–** వ్యాపకం అనే ప్రబలకారణం చేత నాకు దిక్కుల అంతంలేదు. నిత్య త్వమనే ప్రబల కారణం చేత నాకు కాలంలో అంతంలేదు. సార్వాత్మ భావం కారణంగా నాకు వస్తుపరమైన అంతం కూడా లేదు. అందువల్ల నానిజస్వరూపం అనంతత్వం అని ఉండిపో!

**వ్యాఖ్య :–** ఈ ప్రపంచంలోని అన్ని వస్తువులకు, విషయాలకు, దేశ, కాల, వస్తు పరిచ్ఛేదాలనే 3 రకాల పరిమితులున్నాయి.

**(1) దేశ పరిచ్ఛేదం :-** దేశం అంటే ప్రదేశం అని. ప్రతి వస్తువు కొంత ప్రదేశాన్ని ఆక్రమించుకుంటుంది. పొడవు, వెడల్పు, ఎత్తు. 10 అడుగుల పొడవు ఉన్నదీ అంటే 10 అడుగుల పొడవున్న ప్రదేశాన్ని ఆక్రమించుకున్నదీ అని. 11వ అడుగులో ఆవస్తువు ఉండదు. అలాగే 2 అడుగుల వెడల్పు అంటే 2 అడుగులకు అవతల ప్రదేశంలో అది ఉండదు అని. అలాగే భారతదేశం కన్యాకుమారి నుండి కాశ్మీరువరకు ఉన్నది. కన్యాకుమారికి ఇటు – కాశ్మీరుకు అటు భారతదేశం లేదు. అంటే భారతదేశ పరిమితి అంత వరకే. అలాగే పరమాత్మకు ఏమన్నా పరిమితి ఉందా? లేదు. భగవంతుని విగ్రహానికైతే పరిమితి (దేశపరిచ్ఛేదం) ఉందిగాని నిరాకార, నిర్గుణ, సర్వవ్యాపక పరమాత్మకు పరిమితి లేదు. పరమాత్మ అంతటా ఉన్నాడు. క్రింద, పైన భూమండలం అంతటా ఉన్నాడు. భూమండలానికి ఆవలనో? అక్కడా ఉన్నాడు. దేవలోకాల్లోనో! అక్కడా ఉన్నాడు. అసలు బ్రహ్మాండం అంతటా ఉన్నాడు. మరి బ్రహ్మాండానికి ఆవలనో – అక్కడా ఉన్నాడు. కనుక పరమాత్మకు మొదలు – చివర అంటూ లేవు. దేశపరిచ్ఛేదము లేదు. దీనికి కారణం పరమాత్మయొక్క వ్యాపకత్వం అనే లక్షణమే. అందుకే **'ఇందుగలడందు లేడను సందేహము వలదు చక్రి సర్వోపగతుండు'** అని ప్రహ్లాదుడు చెప్పటం జరిగింది. శ్రీకృష్ణుడు తననోట బ్రహ్మాండాన్ని చూపటంలోని ఆంతర్యం కూడా పరమాత్మ సర్వవ్యాపకుడని – బ్రహ్మాండానికి ఆవలకూడా ఉన్నాడని తెలియజేయటానికే. కనుక పరమాత్మనైన నాకు దిక్కుల అంతంలేదు.

**(2) కాల పరిచ్ఛేదం :-** కాలం మరో రకమైన పరిమితుల్ని పెడుతుంది. ఈ కాలంలో ఉన్న వస్తువు మరో కాలంలో ఉండదు. ఈ రోజు ఉన్న వ్యక్తి మరోరోజుకు కనుమరుగై పోతాడు. ఎంతటి గొప్పరాజులైనా చక్రవర్తులైనా ఒక కాలంలో ఉంటారు. మరో కాలంలో కనిపించరు. చివరకు కాలాలలో పెద్దదైన సంవత్సరానికీ పరిమితి ఉంది. యుగానికీ పరిమితి ఉంది. మహాయుగానికీ పరిమితి ఉంది. కల్పానికీ పరిమితి ఉంది. చివరకు సృష్టికర్త బ్రహ్మకూ పరిమితి ఉంది. కాని పరమాత్మకు మాత్రం కాల పరిమితిలేదు.

పరమాత్మ నిత్యుడు, శాశ్వతుడు. కనుక అన్నికాలాలలో అన్ని యుగాలలో ఉండేవాడు. కనుక పరమాత్మనైన నాకు కాలంలో అంతంలేదు. నేను అన్ని కాలాలలో ఉండేవాణ్ణి. నేను లేని సమయం అంటూలేదు.

**(3) వస్తు పరిచ్ఛేదం :-** వస్తువుల యొక్క గుణాలను బట్టి పరిమితిలుంటాయి. తీపి అనే గుణం చక్కెరలో ఉంటుంది, బెల్లంలో ఉంటుంది. వేపకాయలో ఉండదు. మిరపకాయలో ఉండదు. అంటే తీపి కొన్ని వస్తువులలో ఉంటుంది. కొన్ని వస్తువులలో ఉండదు. ఇదే వస్తుపరిచ్ఛేదం. సంతానశక్తి మనుష్యులలో ఉంటుంది. జంతువులలో ఉంటుంది. కాని రాళ్ళల్లో ఉండదు. ఇదే వస్తుపరిచ్ఛేదం. కాని సర్వవ్యాపకమైన పరమాత్మ, సర్వములోను అంతరాత్మగా ఉండే పరమాత్మకు వస్తుపరిచ్ఛేదం లేదు. అన్ని వస్తువులలో, అన్ని ప్రాణులలో పరమాత్మ ఉన్నాడు. **అహమాత్మా! గుడాకేశా! సర్వభూతాశయస్థితః, ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్టతి**. కనుక పరమాత్మనైన నాకు వస్తు పరమైన అంతంలేదు. హిరణ్య కశిపునకు స్తంభంలో కనిపించాడు పరమాత్మ. ప్రహ్లాదునికి ఏనుగులోను, పాములోను, విషంలోను, సముద్రంలోను అంతటా కనిపించాడు. దీనిని బట్టి పరమాత్మనైన నాకు ఏవిధమైన పరిమితులు లేవు. నేను అనంతుడను సర్వవ్యాపకుడను, సర్వాంతర్యామిని అని నిత్యమూ నిరంతరమూ భావన చేస్తుండాలి. దీనితో విచారణ పూర్తి. గురుబోధముగిసింది. ముగింపు వాక్యాలను తెలియజేస్తున్నాడు.

**శ్లో॥ ఏవం నిరంతర సమాధి వశాన్నిరాధిః**
**జ్ఞానాగ్నిదగ్ధ సహకారణ జన్మ బీజః ।**
**ఆవిర్భ వన్నిజ సుఖాను భవైక తృప్తః**
**బ్రహ్మైవ నూన మిహసంభవ సిద్ధ్రువం త్వం ॥ 27**

**ప్రతిపదార్థం :-** ఏవం నిరంతర సమాధివశాత్ = ఇలా నిరంతరం సమాధిలో ఉంటున్నందువల్ల; నిరాధిః = మానసిక తాపాలన్నీ తొలగిపోయి; సహకారణ జన్మబీజః = మళ్ళీమళ్ళీ జన్మకు కారణమయ్యే వాసనలన్నీ; జ్ఞానాగ్నిదగ్ధః =

జ్ఞానమనే అగ్నిలో దగ్ధమై ; ఆవిర్భవన్ = ఆత్మానుభూతితో జనించే; నిజసుఖానుభవ ఏకతృప్తః = సుఖాన్ని పొందుతూ సంతృప్తి చెందిన వాడవై; నూనం = ఖాయంగా; త్వం ఇహ = నీవు ఇక్కడే; బ్రహ్మైవ సంభవసి ధృవం = బ్రహ్మముగానే ఉండిపోతావు. ఇది నిశ్చయం.

**భావం :–** ఈ విధంగా నిరంతర సమాధిలో ఉంటూ ఉన్నందువల్ల మానసిక మైన తాపాలన్నీ వదిలి పోతాయి. మళ్ళీ మళ్ళీ జన్మలెత్తటానికి కావలసిన వాసనలు అన్నీ జ్ఞానమనే అగ్నిలో – నేను ఆత్మను – బ్రహ్మమును అనే నిశ్చయంలో దగ్ధమై పోయి ఆత్మాను భూతిలోనే సుఖాన్ని పొందుతూ సంతృప్తి చెందినవాడవై తప్పకుండా ఇక్కడే నీవు పరబ్రహ్మమే అవుతావు.

**వ్యాఖ్య :–** ఇంతవరకు 16వ శ్లోకం నుండి చెప్పిన విచారణామార్గాన్ని ఆశ్రయించి నిరంతరం నేను ఆత్మనని, ఆత్మంటే బ్రహ్మమేనని, కనుకనేను బ్రహ్మమునేనని నిశ్చయం కలిగేంతవరకు విచారణ చేసి అలా అనంతమైన బ్రహ్మముగా నిలచిపోవటమే సమాధి. సమాధి అంటే సమబుద్ధిఅని. అంటే బుద్ధి కదలకుండా, స్థిరంగా, ఎప్పుడూ ఆత్మలోనే నిలిచిపోవాలి, ఆత్మగానే ఉండిపోవాలి. అలా ఉండటం ఎప్పుడో ఒకసారి ప్రయత్నం చేసినప్పుడో, గుర్తువచ్చినప్పుడోకాదు. ఏదో ఒకరోజో, సాధనచేస్తున్నప్పుడోకాక నిత్యము, నిరంతరము ఆ బ్రహ్మభావనలోనే నిలిచిపోవాలి. అలా నిలిచిపోవాలంటే విచారణ చేయాలి. ముందుగా జడచైతన్యాలను విడగొట్టి చూచి, తాను జడమైన దేహాన్ని కాదని, అలాగే జడమై, దృశ్యమైన ప్రాణ, మనో, బుద్ధులుకాదని, వీటన్నింటిని తెలుసుకొనే చితినే నేనని గ్రహించాలి. అలా నిరంతరం విచారణ ద్వారా నేను చితిని అని గ్రహించి, చితినైన నేను ఈ దేహేంద్రియ మనోబుద్ధులను కేవల సాక్షిగా చూస్తున్నానని, వాటి వృత్తులను కేవలంగా గమనిస్తున్నానని సాక్షీభావన చెయ్యాలి. ఈ దేహాదులు గాని, ఈ జగత్తుగాని సత్యంకాదని, ఇవి చితినైన నాలో – ఆత్మ నైన నాలో కల్పించబడ్డవని కనుక మిథ్యయని నిరంతరం భావన చెయ్యాలి.

జీవుడియొక్క జాగ్రత్ స్వప్నసుషుప్తి అనే 3 అవస్థలకు, ఆ అవస్థలలోని జీవుడి అనుభవాలకు నేను కేవల సాక్షిని అని; నావల్లనే దేహేంద్రియాలు, మనోబుద్ధులు వాటి వాటి ధర్మాలను నిర్వర్తించ గలుగుతున్నాయని; వాటి వృత్తులను నేను తెలుసుకుంటున్నానని; అలాతెలుసుకొనే నాకు ఏ అవస్థలు లేవని; సృష్టి, స్థితి, లయాలన్నీ నాలో కల్పించబడినవేనని; నేను దేశకాలవస్తుపరిచ్ఛేదాలు లేని సర్వవ్యాపక సర్వాంతర్యామి నైన పరమాత్మనని; ఆది మధ్యాంత రహితుడను, అనంతుడను అని నిత్యము, నిరంతరము విచారణ చేస్తుంటే బుద్ధి నిజస్థితిలో – ఆత్మ స్థితిలో నిలిచిపోతుంది. అలా నిలిచి పోవటమే సమాధి. సందేహాలు, శంకలు తీరిపోయి తాను దేహమనోబుద్ధులకు వేరైన ఆత్మనని – అంతటా ఉన్న బ్రహ్మమునని గ్రహించి దేహేంద్రియమనోబుద్ధులతో ఇప్పటి వరకుగల తాదాత్మ్యాన్ని పూర్తిగా విడిచిపెడితే జీవభావం పూర్తిగ అంతమైనట్లే. అదేజ్ఞానాగ్ని. ఆ జ్ఞానాగ్నిలో సమస్త కర్మఫలాలు, వాసనలు భస్మీపటలమై పోతాయి. అంటే ఆత్మగా – బ్రహ్మముగా ఉన్న వానికి వాసనలుండే ప్రసక్తే లేదు. ఈ వాసనలే తిరిగి జన్మకు బీజాలు కనుక వాసనలు రద్దయితే ఇక జన్మకు బీజాలులేనట్లే. కనుక జన్మ లేదు. ఈ జన్మరాహిత్యమే మోక్షం. అదే జీవన్ముక్తి. 'నేను' అనే జీవుడున్నంత వరకే తిరిగి పుట్టుక ఉంటుంది. అసలు జీవుడే లేకుండా పోతే పుట్టుకే ఉండదు. ఈ స్థితిలో బుద్ధి నిలవాలంటే విషయాల ద్వారా వచ్చే ఆనందం కన్న ఆత్మలోనే ఆనందాన్ని పొందాలి. అలా ఆత్మానందం అందుతున్నకొద్దీ ఆత్మకు మరింత దగ్గరౌతాడు. తాను ఆత్మకన్నవేరుగా ఉండలేడు. చివరకు ఆత్మగానే ఉండిపోతాడు. అలా, నీవు ఇక్కడే – జీవించి ఉండగానే బ్రహ్మమే అవుతావు, అని గురువు ఆశీర్వాదం అందిస్తున్నాడు.

ఇక శిష్యుని స్థితి –

**శ్లో॥ ఇత్థం గిరా విమలయా పరసౌఖ్య దాత్ర్యా**
**వాచాగురోర్విమథి తాఖిల సంశయోఘః।**
**శిష్యస్సమాధి పరిశీలన తీక్ష్ణ దివ్య**
**జ్ఞానాసి ఖండిత భవాఖ్య విషద్రుమోభూత్ ॥ 28**

**ప్రతిపదార్థం :–** ఇత్థం = ఈ ప్రకారంగా; పరసౌఖ్య దాత్ర్యా = పరమ సుఖాన్ని కలిగించే; గురోః గురువుయొక్క; విమలయా = నిర్మలమైన; వాచాగిరా = శాస్త్రసమ్మతమైన వాక్కుల ద్వారా; విమథిత = బాగా మథించబడిన; అఖిలసంశయోఘః = అన్ని సంశయాలు తీరిన వాడైన; శిష్యః = శిష్యుడు; సమాధిపరిశీలన తీక్షణ దివ్యజ్ఞాన అసి = సమాధిద్వారా పరిశీలించి పొందిన దివ్యజ్ఞాన మనే పదునైన కత్తిచేత; భవాఖ్య విషద్రుమ = సంసారమనే విషవృక్షాన్ని; ఖండిత ఆభూత్ = ఖండించిన వాడయ్యాడు.

**భావం :–** ఈప్రకారంగా పరమ సౌఖ్య ప్రదాలైన గురువుయొక్క నిర్మలమైన శాస్త్ర సమ్మతములైన వాక్కులద్వారా సర్వసంశయాలు తీరిపోయినవాడైన శిష్యుడు సమాధి ద్వారా పరిశీలించి పొందిన పదునైన దివ్యజ్ఞానమనే ఖడ్గం చేత ఖండించబడిన సంసార విషవృక్షంగల వాడయ్యాడు.

**వ్యాఖ్య :–** సంసార ఘోర సాగరంలో మునిగి దుఃఖాల పాలైన ఒకానొక శిష్యుడు పూర్వజన్మ సుకృతం చేత గురువును సమీపించి తన ఈ సంసార దుఃఖాలను గురించి చెప్పి స్వామీ! ఈ సంసార సముద్రాన్ని సులభంగా తరించే ఉపాయం చెప్పమని ప్రార్థించాడు. దానితో గురువు శిష్యుని యొక్క పరిపక్వతను, అప్పటికే అతడు మంచి సాధకుడని, గుర్తించి, సూటిగా ఆత్మ విచారణా మార్గాన్ని ఉపదేశించాడు. 16వ శ్లోకం నుండి 26వ శ్లోకం వరకు గల 11 శ్లోకాల్లో ఈ విచారణ ఎలా చేయాలో మార్గాన్ని, ఉపాయాన్ని సూచించాడు. "అర్హతగల శిష్యుడు నిరంతర ఆత్మ విచారణతో సమాధి అభ్యాసం చేసి తన స్వరూపం ఏదో తెలుసుకొని, అందులో స్థిరంగా నిలిచి పోయేందుకు సాధనచేస్తే సమస్త కర్మబంధాలు, జన్మలకు కారణమైన వాసనలు జ్ఞానమనే అగ్నిలో దగ్ధమై ఇక్కడే – జీవించి ఉండగానే పరబ్రహ్మముగా – పరమాత్మగా ఉండి పోతాడు" అని కూడా గురువు శిష్యునికి అన్యాపదేశంగా బోధిస్తూ ఆశీర్వదించాడు.

ఈ గురువాక్యాలను శ్రద్ధతో భక్తితో విన్నాడు శిష్యుడు. గురువుపట్ల అచంచల విశ్వాసం గల శిష్యుడు ఆ గురువాక్యాలను పరమ సౌఖ్యప్రదాలుగా భావించాడు. తన యొక్క సమస్త సంసార దుఃఖాలను తొలగించి, శాశ్వత

అఖండ ఆనందాన్ని ప్రసాదించగలవని విశ్వసించాడు. ఇలా విశ్వసించటానికి కారణం అవి శాస్త్రసమ్మతము లైన వాక్కులు గనుక. గురువు ఆ వాక్కుల వెనుక నున్న లక్ష్యార్థాన్ని అనుభవ పూర్వకంగా గ్రహించి తనకు ఉపదేశిస్తున్నాడని తెలుసుకున్నాడు. ఆ గురువాక్యాల ద్వారా తనసర్వ సందేహాలు తీరి పోయినవి.

ఆత్మ జ్ఞానాన్ని బోధించాలంటే గురువుకు సంపూర్ణ శాస్త్రజ్ఞానమూ ఉండాలి, అనుభవజ్ఞానమూ ఉండాలి. శాస్త్రాన్ని జీవితానికి అన్వయించి చెప్పగలనేర్పు, ఓర్పు ఉండాలి. శాస్త్ర వాక్యాలు తర్కానికి అందాలి. అలాగే ఆచరణకు అనుకూలంకావాలి. తన అనుభవంలో ఆ వాక్యాలు సత్యం కావాలి. అప్పుడే శిష్యుని సర్వసందేహాలు తీరేది. అయితే శిష్యునికి తీవ్రజిజ్ఞాస ఉండాలి. గురుభక్తి, శ్రద్ధ ఉండాలి.

**జగత్తు మిథ్య అని శాస్త్రవాక్యం. కాని జగత్తుకనిపిస్తున్నది గదా! అని సందేహం. తర్కం ప్రకారం ఆలోచిస్తే గారడీవాడు చూపించే వస్తువు కనిపిస్తూనే ఉంటుంది. కాని అది సత్యం కాదు గదా – ఇక అనుభవం విషయానికి వస్తే కల కనిపిస్తూనే ఉన్నది గదా! కనిపిస్తున్నదానిని, సత్యమని కలగంటున్నంతసేపు భావించేదానిని మనం సత్యం అంటున్నామా? లేదే. అంటే కలలో చూచేవాడున్నంత వరకూ సత్యం. ఆచూచేవాడు అదృశ్యం కాగానే కలయావత్తు అదృశ్యం. ఇలా శ్రుతి, యుక్తి, అనుభవాల ద్వారా విచారణచేస్తే సర్వసందేహాలు మాయం.**

అయితే గురువాక్యాలను కేవలం వింటే చాలదు. వాటిని మననంచేయాలి. నిధిధ్యాసన చేయాలి. నిరంతర ఆత్మ విచారణ చేయాలి. అలా చేస్తూ సమాధిలో సత్యదర్శనంకావాలి. ఆత్మననే ధృడభావన కలగాలి. ఎప్పుడైతే తాను ఆత్మననే నిశ్చయంకలిగిందో జీవభావం వదిలి పోతుంది. ఉపాధులతాదాత్మ్యం వదిలి పోతుంది. ఈ జగత్తే దృష్టి పథంనుంచి తొలగిపోతుంది. అంతటా కేవలం తాను మత్రమే ఉంటాడు. దానితో సంసార బంధనాలు తొలగి పోతాయి. జన్మకుకారణమైన సమస్త కర్మఫలాలు వాసనలు దగ్ధమైపోతాయి. దానితో ఆనంత అఖండ ఆనందసాగరుడవుతాడు. అదే జీవన్ముక్తి – మానవజన్మ చరితార్థం. ఇలా ముక్తుడైన సాధకుడు ఏం చేస్తాడు? అతడి మన స్థితి ఎలా ఉంటుంది?

శ్లో॥ స్వానందమ ప్రతిహతః పరిభుజ్యహర్షాత్

అశ్రుప్రపూర్ణ నయనః పులకాంకి తాంగః ।

శిష్యః సగద్గద మువాచ గురుం ఘృణాబ్ధిం

నత్వా తదంఘ్రియుగళం వినయోపయుక్తః ॥ 29

**ప్రతిపదార్థం :–** స్వానందం = ఆత్మానందాన్ని; అప్రతిహతః = అడ్డులేకుండా; పరిభుజ్య = పరిపూర్ణంగా అనుభవిస్తూ; హర్షాత్ అశ్రు ప్రపూర్ణనయనః = సంతోషంతో నీళ్ళు నిండిన కళ్ళతో; పులకాంకిత అంగః = శరీరం పులకరించి పోతుండగా; శిష్యః = శిష్యుడు; ఘృణాబ్ధిం గురుం = కరుణాసముద్రుడైన గురువుకు; తత్ అంఘ్రి యుగళం నత్వా = ఆయన రెండు పాదాలకు నమస్కరించి; వినయ ఉపయుక్తః = వినయపూర్వకంగా; సగద్గదం ఉవాచ = గద్గదస్వరంతో (కంఠం డగ్గుత్తిక కాగా) ఇలా అంటున్నాడు.

**భావం :–** ఆత్మానందాన్ని అడ్డులేకుండా పరిపూర్ణంగా అనుభవిస్తూ సంతోషంతో నీళ్ళు నిండిన కళ్ళతో, శరీరం పులకరించిపోతుండగా శిష్యుడు, కరుణా సముద్రుడైన గురువుయొక్క రెండు పాదాలకు సమస్కరించి వినయంతో డగ్గుత్తికతో ఇలా అంటున్నాడు.

**వ్యాఖ్య :–** ఆత్మానందాన్ని అఖండంగా అనుభవిస్తున్న శిష్యుడు గురువు పట్ల ఎలా వ్యవహరిస్తాడో – ఆ సమయంలో అతడి మనస్థితి ఎలా ఉంటుందో – వీలైనంత తక్కువ పదాలతో తెలియజేస్తున్నారు. శ్రీ సదాశివబ్రహ్మేంద్ర స్వాములవారు.

ఒక గురువు వద్ద అనేక మంది శిష్యులుంటారు. అందరూ ఒకే విధమైన ఆలోచనతో ఉండరు. అందరూ గురువును ఒకే విధంగా గౌరవించరు. అందరూ ఒకే విధంగా గురువును అర్థం చేసుకోలేరు. ఏదో తెలిసిన రెండు ముక్కలు చెబుతున్నాడు, విందాం అనుకొనే వారు కొందరు. వింటే వింటాం కుదరకపోతే లేదు అనుకునే వారు కొందరు. వీరు ఒకటవ తరగతివారు. ఇక ఇలాంటి వారిని తప్పిస్తే శ్రద్ధగా శాస్త్రాన్ని తెలుసుకుందాం అనుకొనేవారు బహుకొద్ది

మంది. వీరిలో గురువు పట్ల కృతజ్ఞత సహజంగా చూపేవారు కొందరైతే, వారు నమస్కరిస్తున్నారుగదా! మనమూ నమస్కరిద్దాం పోయేదేముంది అనుకొనేవారు కొందరు. గురువును గౌరవించాలని, నమస్కరించాలని శాస్త్రాలు చెబుతున్నాయిగనుక నమస్కరిద్దాం అని కొందరు అనుకుంటారు. వీరు 2వ తరగతి వారు. ఇక గురువు చెప్పేజ్ఞానం చాలా గొప్పదని, అది జీవితాలను తరింపచేస్తుందని స్వయంగా విశ్వసించేవారు, లేదా ఇతరుల ద్వారా తెలుసుకొనేవారు – వీరు గురువుకు మనసారా నమస్కరిస్తారు. గురువును పూజిస్తారు. అదీ మనస్ఫూర్తిగానే చేస్తారు. వీరు 3వ తరగతి వారు. నిజంగా వీరికి ఆత్మానందం లభించకపోయినా గురువాక్యాలు గాని, గురుసన్నిధిగాని సౌఖ్య ప్రదంగా ఉంటుంది. అందువల్ల ఆత్మానందాన్ని కూడా పొందగలమని నమ్మకం కుదురుతుంది.

ఇక గురు వాక్యాలను తు.చ.తప్పకుండా పాటించేవారు, ఆయన చూపిన మార్గంలో ప్రయాణించేవారు, ఎంతటి త్యాగానికైనా వెనుదీయనివారు, వారి దైనందిన జీవితంలో గురువును స్మరిస్తూ, గురువును ధ్యానిస్తూ, గురువు కనిపించినప్పుడు కృతజ్ఞతా భావంతో వినయ విధేయతలతో ప్రత్యక్షంలోనూ, పరోక్షంలోనూ ఉండేవారు, గురువుకోసం ఎంతటి త్యాగమైనా చేస్తారు. గురువును సేవించటం కోసం తపిస్తారు. గురువుయొక్క అనుగ్రహం కోసం నిరంతరం ఏం చేయాలి? అని ఆలోచిస్తారు. తమకు ఏ ప్రయోజనం కలిగినా, అది గురుప్రసాదంగా భావిస్తారు. గురువుద్వారా తాము పొందే జ్ఞానం – బోధ అత్యంత విలువైనదని, అసాధారణమైనదని భావిస్తారు. వీరు ఉత్తమ తరగతి శిష్యులు. ఇలాంటివారు ఒక్కరు దొరికినా గురువు అదృష్టవంతుడే.

ఇక ఆత్మానందాన్ని అందుకుంటున్న శిష్యుని మనస్థితిని గురించి ఇక్కడ చెబుతున్నారు. ఇక్కడ ఈ శిష్యుడు నిజంగా గురువుతో సమానమే. ఎందుకంటే ఇరువురు ఒకే ఆత్మగనుక. కాని గురువు సమక్షంలో అతడెప్పుడూ శిష్యుడే. నీవే నేను అనేభావం ఉండదు. వినయ వినమిత శిరస్కుడై యుంటాడు.

గురువును చూడగానే అశ్రుపూర్ణ నయనాలౌతాయి. శరీరం పులకరించిపోతుంది. ఎందుకటే ఇలాంటి స్థితి తనజీవిత కాలంలో వస్తుందనుకోలేదు. కోట్లాది జన్మలు ఎత్తాల్సి ఉన్న స్థితిని తొలగించిన మహాత్ముడు గురువు. అందుకే కృతజ్ఞత. మాటలలో చెప్పలేని ఆ భావాన్ని కళ్ళల్లో చూపించబోగా కన్నులనీరు నిండుతాయి. మాట్లాడుదామంటే గొంతు గాద్గదిక మవుతుంది. మాటలు రావు. ఆశ్చర్యానందాలతో శరీరం పులకరించి పోతుంది. జీవభావంలో ఉన్నంత కాలం ఆత్మానుభూతికై తపించాడు. ఈ జన్మలో నేను ఆత్మాను భూతిని పొందగలనా? ముక్తుడనౌతానా? అని ఆశతో ఎదురుచూశాడు. ఒక్కొక్కసారి సందేహం కలుగుతుంది. కొన్ని పరిస్థితులలో ఆటంకాలు వచ్చి అసహనం కలుగుతుంది. అలాంటిది ఇప్పుడు తన అజ్ఞానం పూర్తిగా తొలగిపోయింది. జీవభావం అంతమైంది. తాను ఆత్మనని, పరమాత్మనని సర్వకాల సర్వావస్థలలోను అనుభూతిలో ఉన్నాడు. ఎలా ఉంటుందో ఎలా ఉంటుందో అనుకున్న ఆత్మానందాన్ని ఇప్పుడు స్వయంగా అనుభవిస్తున్నాడు. అఖండంగా – ప్రవాహంగా ఆనంద సాగరుడయ్యాడు. పరిపూర్ణత్వం, పరమశాంతి. ఇంతటి గొప్ప స్థితికి – ఇంతటి ఆనందానికి – తన ఊహకు అందని ఈ ఆనందానికి కారకుడైన గురువును చూడగానే గతం కన్నుల ముందు కదలాడింది. అందుకే కృతజ్ఞతతో కన్నులు ఆనంద భాష్పాలతో నిండిపోయినవి. గొంతుగాద్గదికమయ్యింది. ఏంచెయ్యాలి? ఆలోచనా రహితయ్యాడు. గురువుకు సంపూర్ణంగా ప్రణమిల్లి తన కృతజ్ఞతను తెలుపుకోవటం తప్ప తనకింక మరోమార్గం లేదు అనుకున్నాడు. అందుకే గురువుయొక్క పాదపద్మాలకుతన శిరస్సును తాకించి సంపూర్ణ శరణాగతుడయ్యాడు. అలా ఎంతసేపున్నాడో! ఏదో మాట్లాడాలి. గురువుకు తన హృదయంలోని భావాన్ని చెప్పాలి. తనలో భావాలు అనేకం. కాని మాట్లాడాలంటే గొంతులో నుండి మాటలు పెగలటం లేదు. ఎలాగో ప్రయత్నం మీద గొంతు సవరించుకున్నాడు. ఎంతో వినయంతో, అవనత శిరస్కుడై, కృతజ్ఞత ఉట్టిపడే విధంగా తనపై కృపావర్షం కురిపించిన కరుణా సముద్రుడైన గురుదేవులతో ఇలా అంటున్నాడు.

ఆత్మానుభూతి నొందిన శిష్యుడు గురువుతో ఏమంటున్నాడో...

శిష్య ఉవాచ –

**శ్లో॥ స్వామిన్ భవద్వచన దివ్య సుధాభిషిక్తః**
**స్వానంద మంజు నగరే విహరామి నిత్యే ।**
**అజ్ఞాన దుర్హృదమతీవ శితేన సమ్యగ్**
**జ్ఞానాసినా పరివితాయ సహానుజాతం ॥ 30**

**ప్రతిపదార్థం :–** స్వామిన్ = పూజ్యగురుదేవా!; అజ్ఞానదుర్హృదం = అజ్ఞాన మనేశత్రువును; సహఅనుజాతం = తోబుట్టువులైన దుర్గుణాలతోసహా; అతీవశితేన = బాగాపదునైన; జ్ఞానాసినా = జ్ఞానమనేఖడ్గంతో; సమ్యక్పరివితాయ = చక్కగానాశనంచేసి; భవత్వచన దివ్యసుధాభిషిక్తః = తమవాక్కు అనే దివ్యమైన అమృతంతో తడుపబడిన, స్వఆనంద = ఆత్మానందమనెడి; నిత్యేమంజునగరే = నిత్యమైన ఆనందనగరంలో; విహరామి = విహరిస్తున్నాను.

**భావం :–** ఓ పూజ్యుడా! అజ్ఞానమనే శత్రువును తోబుట్టువులైన దుర్గుణాలతో సహా పదునైన జ్ఞానమనేఖడ్గంతో చక్కగా నాశనం చేసి తమ దివ్యవాగామృతంతో తడిసిన శాశ్వత ఆత్మానంద నగరంలో విహరిస్తున్నాను.

**వ్యాఖ్య :–** ఆత్మానుభూతిని పొందిన శిష్యుడు ఆత్మానంద సాగరంలో ఓలలాడుతూ తన అనుభూతిని తెలియజేస్తున్నాడు. శిష్యుడు ఆత్మానందంలో రమిస్తున్నాడు ఈ లోకంలో ఇంత వరకు లభించిన ఆనందం విషయానందం మాత్రమే. విషయానందం విషయాలున్నంత వరకు, అవి చెడిపోకుండా, జారిపోకుండా ఉన్నంతకాలం మాత్రమే లభిస్తుంది. కాని ఆత్మానందం అనేది ఆత్మద్వారా లభించేది. ఆత్మ నిత్యము, శాశ్వతము. అది ఒకప్పుడుండి ఒకప్పుడు లేకుండా పోయేది కాదు. అట్టి నిత్యము శాశ్వతము అయిన ఆత్మద్వారా లభించే ఆనందంకూడా నిత్యము, శాశ్వతము అవుతుంది. అందుకే అట్టి ఆనందాన్ని 'నిత్యే స్వానంద మంజునగరే' అని వర్ణిస్తున్నాడు శిష్యుడు. నిత్యమైన ఆత్మానందమనే అందమైన నగరంలో విహరిస్తున్నాను అని భావం. ఇది శిష్యుని

పరిస్థితి. ఈ పరిస్థితి ఇక మారేది కాదు. శాశ్వత స్థితి. ఇట్టిస్థితిని పొందటానికే ముముక్షువులైన మానవులు ప్రయత్నం చేస్తారు. ప్రయత్నించిన వారిలో ఏ కొద్దిమందో సఫలీకృతులౌతారు. ఎవరు అలా ప్రయత్నించి సఫలీకృతులౌతారు? అన్ని విధాలైన అర్హతలు కలిగియుండి, తీవ్రమైన మోక్షాపేక్షతో ఒక సద్గురువును ఆశ్రయించి, ఆయనను అన్ని విధాలా సేవించి, పూజించి ఆయనయొక్క దివ్య వచనామృతాన్ని, బోధామృతాన్ని తనివితీరా గ్రోలినవారు మాత్రమే. ఇక్కడి శిష్యుడు కూడా తనకు లభించిన ఈ ఆత్మానందం తన గురుదేవుల దివ్యవాణి (వాక్కు) అనే అమృతంచే తడిసిన నిత్యమైన ఆత్మానందనగరం అంటున్నాడు. ఐతే కేవలం గురువాక్యాలనే అమృతం ద్వారానే ఆత్మానందం లభిస్తుందా? అంటే గురువాక్యాల అవసరం తప్పనిసరేకాని, గురు వాక్యాలను అనుసరించి శిష్యుడు ఎంతో సాధన చెయ్యాలి. శిష్యునిలో అజ్ఞానం గూడుకట్టుకొని ఉంటుంది. ఆ అజ్ఞానం తొలగాలి.

అజ్ఞానం అంటే నేను ఆత్మనని తెలియని స్థితి. ఆ స్థితి తొలగాలంటే శాస్త్ర వాక్యాలపై, గురువాక్యాలపై విశ్వాసంతో, తానెవరో తెలుసుకోవాలి. **'తత్త్వమసి'** అది నీవే అని చెప్పే మహావాక్యాల ద్వారా తాను ఈ దేహమనో బుద్ధులు కాదని వీటికి వేరుగా ఉన్న ఆత్మనని తెలుసుకొని, అట్టి ఆత్మగా ఉండిపోవటానికి ఆత్మవిచారణ చేయాలి. ఇలా నిరంతరం ఆత్మవిచారణ చేయగా చేయగా తాను ఆత్మననే దృఢనిశ్చయం కలుగుతుంది. అజ్ఞానం తొలుగుతుంది.

అయితే ఈ అజ్ఞానాన్ని తొలగించుకోవాలంటే ముందుగా అజ్ఞానానికి బలం ఇచ్చే దాని తోబట్టువులను కూడా జయించాలి. అవే **'కోరికలు'** – ఈ ప్రపంచం పట్ల ఆసక్తిని కలిగించి, వ్యామోహం పెంచి మనిషిని ప్రపంచంలోనికి ఈడ్చి, ఇంకా ఇంకా ఆత్మకు దూరం చేస్తాయి కోరికలు. అలాగే **'మమకారం'** నాది–నాది అనేభావం. **'అసూయ'** తన కంటే ఇతరులు బాగున్నారని ఏడవటం. మనస్సును ఆందోళనలకు గురిచేసి పరమాత్మ వైపుకు మరల కుండా ఏకాగ్రం చెందకుండా ఈ దుర్గుణాలు చేస్తాయి. కనుక ముందుగా ఈ దుర్గుణాలను కూడా నాశనం చెయ్యాలి, అలా చెయ్యాలంటే ఒక మంచి పదునైన గొడ్డలి

కావాలి. అదే **'జ్ఞానాసినా'** జ్ఞానమనే గొడ్డలి. ఇలా జ్ఞానంతో అజ్ఞానాన్ని సోదరులతో సహా నశింపచేస్తే ఇక ఆనందసాగరమే. అదే శిష్యుని స్థితి. ఇట్టి స్థితికి సంపూర్ణంగా కారకుడైన గురువుపట్ల కృతజ్ఞతాభావం.

ఆస్థితిలో శిష్యుని మనోభావాలెలా ఉన్నాయో, ఎంతగా తన్మయుడవుతున్నాడో – సంపూర్ణ ఆత్మానంద స్థితిలో ఆత్మగానున్న అనుభూతిలో శిష్యుని భావాలు.

**శ్లో॥ గచ్ఛామి కుత్ర కిమహం కరవాణి కింవా**
**గృహ్ణామికింపరి జహామి మయి ప్రపూర్ణే ।**
**నిర్వ్యాజ్య సౌఖ్య జలధే పరిదృశ్యమానం**
**ఫేనాదికం జగదితి స్థిర నిశ్చయోమే ॥ 31**

**ప్రతిపదార్థం :–** జగత్ = ఈ దృశ్య ప్రపంచం అంతా; ప్రపూర్ణే = పరిపూర్ణ; నిర్వ్యాజ్య సౌఖ్యజలధే = అఖండ ఆనందసాగరమైన; మయి = నాలో; ఫేన ఆదిక ఇతి = నురుగు మొ॥న వాటి వంటిదే అని; మేస్థిరనిశ్చయః = నా దృఢవిశ్వాసం; కుత్రగచ్ఛామి = ఇక నేను ఎక్కడికి వెళ్ళాలి? అహం కిం కరవాణి = నేను ఏమి చేయాలి? వాకిం గృహ్ణామి = దేనిని స్వీకరించాలి? కింపరిజహామి = దేనిని విడిచి పెట్టాలి?

**భావం :–** ఈ దృశ్య ప్రపంచం అంతా పరిపూర్ణ, అఖండ, ఆనంద సాగరమైననాలో నురుగుల వంటిదని నా దృఢవిశ్వాసం. నేను ఎక్కడికి వెళ్ళాలి? ఏం చేయాలి? దేనిని స్వీకరించాలి? దేనిని త్యజించాలి?

**వ్యాఖ్య :–** జీవభావం – దేహభావం పూర్తిగ తొలగి పోయి, నేను అఖండ, పరిపూర్ణ, ఆనందస్వరూప చైతన్యాన్నని, సూక్ష్మాతి సూక్ష్మ, సర్వవ్యాపక, స్వయం ప్రకాశ పరమాత్మ చైతన్యాన్నని దృఢమైన అనుభూతితో నున్న శిష్యుని మనోభావన ఇది. మాటలకందని మహా అనుభవం ఇది. ఇప్పుడు శిష్యునికి తానుదేహాన్ని మనస్సుని అనే భ్రమలేదు. దేహాన్ని అనుకున్నప్పుడు తన దేహానికి చెందిన వారు, తన దేహానికి చెందని వారు ఉన్నారు. తన అనుభవానికి ఒక నామ రూపప్రపంచం ఉంది. కాని ఇప్పుడు ఈ ప్రపంచం అంతా, అందరు జీవుళ్ళు,

అందులో తనదని ఇంతవరకు అనుకున్న దేహంతో సహా చరాచరములన్నీ తనలో (చైతన్యమైన తనలో) స్వప్నమాత్రంగా కదలాడుతూ ఉన్నాయి. ఇప్పుడు ఎక్కడ చూచినా, ఎటు చూచినా స్వయం ప్రకాశ చైతన్యమైన తానే. తాను దప్పమరేమీలేదు. తానేమో పరమానంద స్వరూపం. ఇంతవరకు నేను-నేను అనుకున్న దేహం కూడా అనేక ఇతరదేహాలతో పాటు తనలో ప్రతిభాసిస్తున్నాయి. అవి ఏవేవో వాటి వాటి పనులు చేసుకుంటున్నాయి. వాటితో ఏమాత్రం సంబంధంలేకుండా బ్రహ్మానంద సాగరంగా తానున్నాడు. ఈ ప్రపంచం అంతా బ్రహ్మానంద సాగరమైన తనలో అలలలాగా, నురుగులాగా, తుంపరలలాగా ఆటలాడుకుంటూ ఉన్నాయి. మరి ఇలాంటి స్థితిలో (సర్వవ్యాపక చైతన్యమైన) తనకు ఏంకావాలి? తానెక్కడకు వెళ్ళాలి? అసలు ఎక్కడికైనా వెళ్ళాలంటే అసలు ఎలా కుదురుతుంది? తానేమో సర్వ వ్యాపక చైతన్యమాయె. తనకన్న వేరుగా చోటు లేదాయె! కనుక ఎలా వెళ్తాడు? ఇంతకు ముందు అయితే తాను దేహాన్ని అనే భ్రమలో ఉన్నాడు గనుక, తనకన్న వేరుగా ప్రపంచం ఉన్నది గనుక, ఆ ప్రపంచంలో తనకేదో కావాలనుకున్నాడు గనుక, తన దేహాన్ని కదిలించి అక్కడకు వెళ్ళాడు. కోరినదానిని తెచ్చుకున్నాడు, అనుభవించాడు, ఆనందించాడు. కొన్ని సందర్భాలలో దుఃఖించాడు.

మరి ఇప్పుడో! తాను అఖండ ఆనంద స్వరూపం. కనుక తన కేమీ అక్కరలేదు. కనుక దేనికోసం వెళ్ళాలి? ఎక్కడకు వెళ్ళాలి? దేన్ని తెచ్చుకోవాలి? దేనిని వదులు కోవాలి? అసలు ఏం చేయాలి తాను? తనకిప్పుడు దేహంలేదు, మనస్సులేదు, కోరికలు లేవు, కొరతలు లేవు. తానిప్పుడు పరిమితుడూ కాదు. కనుక తనకు ఏకర్తవ్యాలు లేవు. అసలు ఇలా ఎక్కడకు వెళ్ళాలి? ఏంచెయ్యాలి? ఏంతెచ్చుకోవాలి? ఏం వదులుకోవాలి అనే ప్రశ్నలు కూడా ఆత్మాను భూతిలో - ఆత్మగా అఖండ ఆనందస్వరూప ఆత్మగా సర్వవ్యాపక చైతన్యంగా ఉన్న వానికి రావు. అసలు ఆలోచనలే ఉండవు. ఐతే జీవభావంలో ఉన్న వారికి అర్థంచేసుకొనేందుకు చెప్పటమే.

తెరమీద జరిగే సంఘటనలతో, పోట్లాటలతో, కత్తియుద్ధాలతో, ప్రేమలతో, ద్వేషాలతో, కుట్రలు కుతంత్రాలతో, ఏడ్పులతో, తెరకు ఎంత సంబంధం ఉందో ఈ ప్రపంచ వ్యవహారాలతో సర్వవ్యాపక పరమాత్మనైన నాకు అంతే సంబంధం. చైతన్య స్వరూపుడు ఈ ప్రపంచాన్ని, ఇందులోని జీవుళ్ళను, తన దేహాన్ని, మంచి చెడులను, సర్వాన్ని ఒక ఆటగా – క్రీడగా – కేవలంగా దర్శిస్తుంటాడు. దర్శించాలనే ఉత్సుకత ఏమాత్రం లేకుండా అది కనిపిస్తుంటే చూస్తాడు. అంతే –

ఇంకా అప్పటి భావాలు ఎలా ఉంటాయి?

**శ్లో॥ మాయా భిదోజలదరో జగదాఖ్యమంబు**
**వర్షత్వనేన మమచిద్వపుషః క్షతిః కా ।**
**లాభో ఽపి వాక ఇతి సంతత మాత్మరూపం**
**సంచింతయన్ స్థిరమతి ర్విహరామి నిత్యే ॥ 32**

**ప్రతిపదార్థం :–** మాయఅభిదః జలధరః = మాయ అనే పేరుగల మేఘం; జగత్ ఆఖ్యం అంబువర్షతు = జగత్తనే పేరుగల నీటిని వర్షించుగాక; అనేన = దానివల్ల; చిద్ వపుషః మమ = చిత్ రూపుడనైన నాకు; క్షతిః కా? లాభః అపి వాకః? = నష్టమేమున్నది; లాభంమాత్రం ఏముంది?; ఇతి సంతతం ఆత్మరూపం సంచింతయన్ = ఇలా నిరంతరం ఆత్మరూపాన్ని తలచు కుంటూ; స్థిరమతిః నిత్యే విహరామి = స్థిరమైన బుద్ధితో నిత్య వస్తువైన ఆత్మలో విహరిస్తూ ఉంటాను.

**భావం :–** మాయ అనే పేరు గల మేఘం ప్రపంచం అనే పేరుగల నీటిని వర్షించుగాక! దాని వల్ల చిత్ స్వరూపుడనైన నాకు నష్టమేమి? లాభం మాత్రం ఏముంది? ఇలా నిరంతరం ఆత్మ రూపాన్ని తలచుకుంటూ స్థిరమైన బుద్ధితో నిత్య వస్తువైన ఆత్మలోనే సంచరిస్తున్నాను.

**వ్యాఖ్య :–** సృష్టికి ముందు కేవల సత్తామాత్రమే ఉన్నది. అది ఎప్పుడూ కేవలంగానే ఉంటుంది. అయితే అందులో మాయ యొక్క ప్రేరణవల్ల ఈ నామ రూపజగత్తు ఏర్పడుతున్నది. జగత్తు ఏర్పడినా నశించినా ఆసత్తాకు వచ్చిన నష్టమూలేదు. లాభమూలేదు.

ఆ సత్తా రూపంలో నిలిచిన శిష్యుడు, తాను ఏమార్పులు లేకుండా కేవలంగా ఎల్లప్పుడు సత్తాగా ఉండేవాడిననే అనుభవంతో "మాయ ఈ ప్రపంచాన్ని సృష్టించుకోనీ నాకు నష్టమేమి? అలాగే లాభం మాత్రం ఏముంది?" అంటూ నిరంతరం ఇలా విచారణ చేస్తూ తాను తానుగా – సత్తాగా – ఆత్మస్వరూపంగా ఆనందంగా ఉండిపోతున్నాడు.

నేను వేసుకున్న చొక్కాతో నాకుతాదాత్మ్యం లేక నేను నేనుగా ఉంటే ఈ చొక్కా చినిగి ముక్కలు ముక్కలైతే నాకు నష్టం ఏమిటి? నేను ఇంటి వరండాలో కూర్చుని ఉన్నప్పుడు రోడ్డుమీద ఎందరు మనుష్యులు పోతూఉంటే మాత్రం నాకు నష్టంఏమి? లాభం ఏమిటి?

అలాగే నేను కేవల ఆత్మగా – పరమాత్మగా ఉన్నప్పుడు నాలోని వాసనలనే మేఘం ప్రపంచమనే వర్షాన్ని కురిపిస్తే నాకు నష్టంఏమి? లాభం ఏమి?

వర్షం పడుతున్నప్పుడు నేను (స్థూల దేహం) బయట నిలబడితే తడుస్తాను. అలాగాక నేను స్థూల దేహాన్ని అనిగాక చైతన్యాన్ని అని భావిస్తే చైతన్యమైన నేను ఎలా తడుస్తాను?

ఇంకా నేను ఆత్మనేననే దృఢనిశ్చయంలో ఎలా అనిపిస్తుందో.

**శ్లో॥ వాక్కాయ మానస భవం సకలం హి కర్మ**
**ప్రోక్తం శుభాశుభమయం న తతోస్తి భిన్నం ।**
**వాగాది సాక్షిణి కథం మయి నిర్మలే స్యాత్**
**కర్మద్వయం తదుదితం జననాది కంవా ॥ 33**

**ప్రతిపదార్థం :–** వాక్కాయమానస భవం = మనో వాక్కాయములతో చేసే; సకలంహికర్మ = కర్మలన్నీ కూడా; శుభాశుభమయం ప్రోక్తం = శుభం, అశుభం అని చెప్పబడతాయి; తతః భిన్నం నఅస్తి = దానికన్న వేరుగా ఏమీ ఉండదు; వాక్కు ఆది సాక్షిణి = మనోవాక్కాయాలకు సాక్షి అయిన; నిర్మలేమయి = నిర్మలమైననాలో; కర్మద్వయం = ఈ రెండురకాల (శుభఅశుభ) కర్మలుగాని; తత్ ఉదితం = దానినుండి జనించే; జననాదికంవా = పుట్టుక మొ॥నవి గాని; కథంస్యాత్? = ఎలా ఉంటాయి? (ఉండవు)

**భావం :–** మనోవాక్కాయాలతో చేసే కర్మలన్నీ శుభమనీ అశుభమనీ అంటారు. ఆ రెంటికన్నా వేరుగా ఏమీలేదు. మనోవాక్కాయాలకు సాక్షినై నిర్మలంగా ఉన్న నాలో ఆరెండు రకాల (శుభ–అశుభ) కర్మలుగాని, వానివల్ల కలిగే జనన మరణాలుగాని నాకు ఎలా ఉంటాయి?

**వ్యాఖ్య :–** సామాన్యంగా మనం లోకంలో అనేకమైన కర్మలు చేస్తుంటాం. వాటిలో పాపకర్మలు, పుణ్య కర్మలు లేదా మంచి కర్మలు, చెడ్డ కర్మలు అని రెండు రకాలుంటాయి. ఈ కర్మలన్నింటిని మనం శరీరంతో చేస్తాం. లేదా వాక్కుతో చేస్తాం. లేదా కొన్ని మనస్సుతో చేస్తాం. ఈ 3 తప్ప మరివేటితోను కర్మలు జరగవు. శరీరంతో వాక్కుతో చేసే కర్మల వల్ల కర్మఫలాలు వస్తాయి, మనస్సుతో చేసిన వాటి వల్ల వాసనలు కూడుకుంటాయి. ఈ వాసనలు, కర్మఫలాల కారణంగా మళ్ళీ జన్మలు వస్తాయి. ఆ జన్మలలో వాసనల ప్రేరణతో కర్మలు చేస్తాం. కర్మఫలాల వల్ల సుఖ దుఃఖాలు అనుభవిస్తాం. అంటే మనం ఏంచేశామో వాటి యొక్కఫలం అనుభవించటానికి మళ్ళీ జన్మతప్పదు. ఇదే జన్మబంధం. కర్మ బంధం. జన్మ కర్మవలయం. జనన మరణచక్రం.

ఐతే ఆత్మాను భూతి నొందిన వాని పరిస్థితి ఏమిటి? అతడు ఎల్లప్పుడు తాను ఆత్మననే నిశ్చయంలో – అనుభూతిలో ఉంటాడు. అంతే కాదు తాను ఈదేహ మనోబుద్ధులుకాదు అనే దృఢభావన ఉంటుంది. అలాంటప్పుడు ఈ మనోవాక్కాయాలు ఏపనిచేస్తున్నా, ఏం మాట్లాడుతున్నా, ఏం ఆలోచిస్తున్నా ఆయా ఇంద్రియాలు వాటి పనులు అవి చేసుకుంటున్నాయి అనుకుంటాడేగాని వాటితో తాదాత్మ్యం చెంది, తనను తాను మరచిపోయి నేనేచేస్తున్నాను, ఆలోచిస్తున్నాను అని అనడు, అనుకోడు. కాక పోతే నిర్మల ఆత్మనైన తాను ఈ మనో వాక్కాయాలను, వాటి వృత్తులను కేవలంగా గమనిస్తున్న సాక్షిని అని అనుకుంటాడు. అలా కేవల సాక్షిగా ఉంటాడు. **"ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ – నైవ కించిత్ కరోమీతి యక్తోమన్యేత తత్త్వవిత్".** అని గీతలో చెప్పినట్లు తాను అకర్తగా సాక్షిగా కేవలంగా ఉంటాడు.

మరి కర్మలు చేస్తే కర్మఫలాలు తప్పక వస్తాయి గదా!. అవును, తప్పక వస్తాయి. అయితే ఎవరుచేస్తే వారికే వస్తాయిగాని ఒకరు చేస్తే మరొకరికి రావు. మరి ఇక్కడ కర్మలు చేసింది ఎవరు? మనోవాక్కాయాలేగాని, ఆత్మయైన తానుకాదు గదా! అందుకే కర్మఫలాలు ఆ మనోవాక్కాయాలకే గాని తనకురావు. కనుక తనకు కర్మఫలాలూలేవు; వాటి కారణంగా తిరిగి జన్మలూ లేవు. తాను కేవల సాక్షి. ఎప్పుడైనా చేసే వాడికే తప్ప చూసేవాడికి ఎలాంటి కర్మఫలాలు రావు. బజార్లో ఇద్దరు తగాదాపడి కొట్టుకుంటారు. దెబ్బలు తగిలేది వాళ్ళకేగాని ఇంటిపై అంతస్తు వరండాలో నిలబడి చూచే వాడికేమీ దెబ్బలు తగలవుగదా! అందువల్ల ఆత్మగా కేవల సాక్షిగా ఉన్న ఆత్మనిష్ఠునికి కర్మఫలంగా సుఖదుఃఖాలూ ఉండవు. అలాగే కర్మఫలానుభవం కొరకు తిరిగి జన్మా ఉండదు. జన్మరహితుడే అవుతాడు. అదే ముక్తి – జీవన్ముక్తి.

అయితే మరి ఈ కర్మఫలాలను తిరిగి మనో వాక్కాయాలు అనుభవించాలిగదా! అవి ఎలా అనుభవిస్తాయి? దేహం గాయపడవచ్చు. వాక్కుద్వారా ఆగాయాన్ని తలచుకుంటూ ఉండొచ్చు. లేదా ఏవిషయం గురించైనా పదే పదే బాధపడుతూ మాట్లాడవచ్చు. మనస్సులో దుఃఖమో సంతోషమో కలగవచ్చు. అయితే ఈ మనోవాక్కాయాలు ఎలా దుఃఖిస్తున్నా, సంతోషిస్తున్నా ఆత్మ నిష్ఠుడు మాత్రం వాటిని కూడా నిర్లిప్తంగా సాక్షిగా చూస్తాడేగాని తనవిగాచేసుకోడు. కర్మలు జరిగేటప్పుడూ సాక్షిగానే ఉంటాడు, కర్మఫలాలు అనుభవించేటప్పుడూ సాక్షిగానే ఉంటాడు. నిర్లిప్తంగా ఉంటాడు. అంటే ఆత్మ నిష్ఠుడు ఈ సుఖదుఃఖాలను పట్టించుకోడు. తన (ఆత్మ) స్థితిలో తానుంటాడు. అనంత అఖండ ఆనంద సాగరుడుగా ఉండిపోతాడు.

ఏ భేదాలు లేని ఏకరూపుడే చిత్ స్వరూపుడు అని –

**శ్లో॥ వ్యావృత్త రూపమిద మేవ జగద్విభిన్నం**
**జ్ఞానం త్వభిన్న మనువృత్త తయాఖిలేషు।**
**జ్ఞానంచ భిన్నమితిచేత్ జడతాది దోష**
**ప్రాప్తిర్భవేచ్ఛ్రుతి శిరాంసి నతం నహంతే॥ 34**

**ప్రతిపదార్థం :-** వ్యావృత్తరూపం = వెల్లడి అవుతున్న; ఇదం జగత్ఏవ = ఈ ప్రపంచమే; విభిన్నం = భేదాలతో ఉన్నది; జ్ఞానంతు = జ్ఞానం మాత్రం; అభిన్నం = ఏ భేదాలు లేనిది; అఖిలేషు అనువృత్తయా = అన్నింటిని అనుసరించి ఉన్నందున; జ్ఞానంచ భిన్నం ఇతిచేత్ = జ్ఞానం కూడా భేదాలతో ఉన్న దని భావిస్తే; జడత ఆది దోష ప్రాప్తిః భవేత్ = జడత్వం మొ॥న దోషాలు కలుగుతాయి; శ్రుతి శిరాంసి = ఉపనిషత్తులు; తంనహంతే = దానిని అంగీకరించవు.

**భావం :-** కనిపించే ఈ జగత్తు మాత్రమే భేదాలతో కూడుకొని ఉన్నది. (ఈ జగత్తును ప్రకాశింపచేసే) జ్ఞానం (చిత్) మాత్రం ఏభేదాలు లేనిది. అన్నింటిలోను అనుసరించి ఉన్నందున జ్ఞానం భేదాలతో కూడుకున్నది అని అనుకుంటే (ఆత్మ చైతన్యానికి – చిత్‌కు) జడత్వం మొదలైన దోషాలు వస్తాయి. ఉపనిషత్తులు దీనిని అంగీకరించవు.

**వ్యాఖ్య :-** ఆత్మ స్వరూపుడు తాను ఏకము. అద్వయము, ఏ భేదాలు లేని ఏకరస జ్ఞాన స్వరూపము అని ఈ శ్లోకంలో తెలియజేస్తున్నాడు.

ఈ కనిపించే జగత్తంతా భేదాలతో కూడుకొని ఉన్నది. రూపంతో ఉన్నవి, శబ్దంతో ఉన్నవి, రుచితో ఉన్నవి, వాసనతో ఉన్నవి. చరమైనవి, అచరమైనవి, జడమైనవి, చైతన్యంలా భ్రమగొలిపేవి ఎన్నో భేదాలతో ఈ ప్రపంచం కనిపిస్తున్నది. అయితే ఈ జగత్తును ప్రకాశింపజేసే జ్ఞానం (చిత్) మాత్రము ఏ భేదాలు లేనిది. కన్ను ఎన్నో రకాల వస్తువులను చూస్తుంది. కాని ఆ కంటి వెనుక జ్ఞానం (చిత్) మాత్రం ఒక్కటే – అభిన్నం. అలాగే చెవి, ముక్కు, చర్మం నాలుక అన్నీ.

అయితే కంటి వెనుకనున్న చిత్ (జ్ఞానం), చెవి వెనుక నున్న చిత్ (జ్ఞానం), ఇలా ఒక్కొక్క ఇంద్రియం వెనుకనున్న జ్ఞానం భేదాలతోనే ఉంటుంది – అంటే ఉపనిషత్తులు ఒప్పుకోవు. ఎందుకంటే జ్ఞానం వేరువేరు అయితే అది పరిమితమై జడం అవుతుంది. చిత్ ప్రకాశం జడం అనే మాటను ఉపనిషత్తులు ఎలా అంగీకరిస్తాయి? లైటు, ఫ్యాను, ఫ్రిజ్, హీటరు, ఎసి అన్నీ వేరువేరు వస్తువులు, వేరువేరు ప్రయోజనాలకు ఉపయోగపడేవి. అయితే అన్నింటి వెనుక నున్న

కరెంటు కూడా వేరు వేరుగా ఉండేదా? కాదు. కరెంటు మాత్రం ఒక్కటే. లైటు వెనుక కరెంటు వేరు, ఫ్యాను వెనుక కరెంటువేరు అంటే బుద్ధి ఉన్న ఎవ్వడైనా అంగీకరిస్తాడా? అలాగే అన్ని విషయవస్తువులను ప్రకాశింపజేసే జ్ఞానం ఒక్కటే. జ్ఞానం అనేకరకాలు ఉంటే అవన్నీ పరిమితమై జడమైపోతాయి. జడమైనది చిత్ ఎలా అవుతుంది? కనుక ఉపనిషత్తులు అంగీకరించవు. అంటే ఆత్మ స్వరూపుడుతాను ఏకరూపుడే –అభిన్నుడే అనే అనుభూతిలోనే ఉంటాడు.

ఆత్మ నిష్ఠుని ఆచరణ –

**శ్లో॥ నైవేంద్రియాణి విషయేషు నియోజయామి**
**ప్రాగ్వాసనా వశతఏవహి తాని యాంతి ।**
**స్వాన్ గోచరాన్ ప్రతి మమాస్తిన సాక్షితాపి**
**సాసాక్ష్యభేద కవితాఖలు సోఽప్య సత్యః ॥ 35**

**ప్రతిపదార్థం :–** ఇంద్రియాణి = ఇంద్రియాలను; విషయేషు న నియోజయామి = విషయవస్తువులలో నియోగించను; ప్రాక్ వాసనా వశత ఏవహి = పూర్వపు వాసనల ప్రభావంతో–ప్రేరణ వల్లనే; తాని = అవి; స్వాన్గోచరాన్ప్రతి = తమకు గోచరమయ్యే విషయాలవైపుకు; యాంతి = వెళ్ళిపోతుంటాయి; మమ = నాకు, సాక్షితేఅపి నఅస్తి = వాటిపట్ల సాక్షిత్వంకూడా లేదు; సా = ఆ సాక్షిత్వం; సాక్ష్యభేద కవితా = సాక్షిభేదంతో కూడుకున్నది; ఖలు సఃఅపి అసత్యః = నిజంగా అదీ అబద్ధమే.

**భావం :–** ఇంద్రియాలను విషయవస్తువులలో నియోగించను. పూర్వ వాసనలను అనుసరించి మాత్రమే అవి వాటికి గోచరమయ్యే విషయాలవైపుకి పరుగుతీస్తాయి. నాకు (వాటిపట్ల) సాక్షిత్వం కూడా లేదు. సాక్షిత్వం సాక్ష్య భేదంతో కూడుకున్నది. నిజానికి అదీ అబద్ధమే.

**వ్యాఖ్య :–** ఒక సాధకుడు దైవానుగ్రహం, గురు అనుగ్రహం, స్వప్రయత్నంతో జీవిత కాలంలో ఎప్పుడో ఒకప్పుడు ఆత్మానుభూతిని చెంది, నిరంతరం తాను ఆత్మగానే ఉండిపోతాడు. అయితే అలా ముక్తినొందినప్పటికీ శరీర ప్రారబ్ధం

ప్రకారం ఇంకా శరీరం నిలచే ఉంటుంది. అలా జీవించి ఉన్నంతకాలం శరీరం ఏవో పనులు చేస్తూనే ఉంటుంది. ఇంద్రియాలు వాటి వాటి కర్తవ్యాలను నిర్వర్తిస్తూనే ఉంటాయి. అయితే సామాన్యుడు నేను చేస్తున్నానంటాడు. కాని ఆత్మానుభూతి నొందిన మహాత్ముడు ఎల్లప్పుడూ ఏ కొరతాలేకుండా ఆత్మానందంలో రమిస్తూనే ఉంటాడు కనుక అతడికి ఈ లోకంలో తీర్చుకోవాల్సిన కోరికలుండవు, నెరవేర్చ వలసిన కర్తవ్యాలూ ఉండవు. కనుక అతడు కావాలని శరీరాన్ని పని చేయించడు. ఇంద్రియాలను విషయవస్తువులలోనికి పోనివ్వడు. అతడు ఆత్మగా అకర్తే. ఎల్లప్పుడూ ప్రశాంతంగా నిర్లిప్తంగా ఉండిపోతాడు. అతడికి ప్రపంచ విషయాలతోగాని, వస్తువులతోగాని ఎలాంటి సంబంధమూ ఉండదు.

అలాగని దేహం ఊరికే ఉండదు. ఇంద్రియాలన్నీ బిగుసుకుపోయి పనిచెయ్యకుండా ఉండవు. ఎందుకంటే ఏవాసనల కారణంగా ఈ దేహం ఏర్పడిందో ఆ పూర్వ వాసనలు ప్రేరేపిస్తూ ఉంటే ఇంద్రియాలు ఆయా విషయాలలో వస్తువులలో తిరుగుతూ ఉంటాయి. వాటి వాటి వృత్తులను కొనసాగిస్తూ ఉంటాయి. కన్ను ఎదురుగా ఉన్న వాటిని చూస్తుంటుంది. చెవి శబ్దాలను వింటూనే ఉంటుంది. కాళ్ళు, చేతులు, వాక్కు పనిచేస్తూనే ఉంటాయి. అయితే ఇవన్నీ ఆయనకావాలని చేస్తున్నట్టా? కాదు. పోనీ అవి అక్కడ ఏవో చేస్తుంటే ఏదేదో జరిగిపోతుంటే కావాలని చూస్తున్నట్టా? కాదు. అద్దంలో ఎన్నోరూపాలు ప్రతిబింబిస్తే అద్దానికి ఏమీ తెలియదు. సంబంధంలేదు. అలాగే ఆత్మకూడా. కాని అద్దం జడంగదా అంటావా? ఆత్మచైతన్యమైనా ఆత్మయొక్క ప్రమేయం లేకుండా అన్నీ ప్రతిఫలిస్తాయి కాబట్టి ఆత్మ కూడా సాక్షి కాదు.

నిజంగా అంతః ప్రేరణతో – పూర్వవాసనల ప్రేరణతో దేహంద్వారా ఏకర్మలు జరిగినా అవి మహాత్మునికి పట్టవు. వాటి స్పృహకూడా ఉండదు. అదే సాధక దశలో అయితే బుద్ధిలోని కోరికలకు అనుగుణంగా మనస్సు ఆలోచనలు చేస్తున్నా, ఆలోచనల కనుగుణంగా దేహేంద్రియాలు కర్మలు చేస్తున్నా ఆ సాధకుడు తాను ఆత్మనని భావిస్తూ ఆపని చేస్తున్న దేహేంద్రియాలను,

ఆలోచిస్తున్న మనస్సును, కోరికలను వ్యక్తీకరిస్తున్న బుద్ధిని తానుతెలుసుకుంటూనే ఉంటాడు, చూస్తూనే ఉంటాడు, కనుక అతడు సాక్షి అవుతాడు. సాక్ష్యంలో ఎన్నో మార్పులుంటాయి, వాటిని చూసే సాక్షిలో కూడా మార్పులుంటాయా? ఉండవు.

నిజంగా ఆత్మస్థితిలో నున్న వానికి తాను కేవల ఆత్మగానే ఉంటాడు గనుక సాక్షిత్వం కూడా ఉండదు. చూచేవాడు సాక్షి. చూడబడేది సాక్ష్యం. సాక్ష్యం ఉంటేనే సాక్షి ఉంటాడు. అసలు సాక్ష్యమే లేకపోతే ఇక సాక్షి ఎక్కడ? ఆత్మానుభూతినొందిన వాని దృష్టిలో ప్రపంచమూ ఉండదు. దేహాదులూ ఉండవు. కర్మలూ ఉండవు. కర్మఫలాలు ఉండవు. కనుకనే అతడు చూడటానికి ఏమీలేదు గనుక అతడు సాక్షికూడా కాదు. సాక్షి అనటం అసత్యమే. అతడు ఏమార్పులు లేని సర్వవ్యాపక ఆత్మయే –పరమాత్మయే.

మరి భేదాలన్నీ ఎవరికి చెందినవి?

**శ్లో॥ భేద్యోపి సాక్ష్యగత ఏవన సాక్షిణో మే**
**భేదస్య సాక్షిణి కథం ప్రభవేత్ సభేదః ।**
**భేదోస సుప్తిసమయే నుపలంభ నాచ్ఛ**
**సన్నాస్తి తాన ఇహ దృష్టతయా నవాచ్యా ॥ 36**

**ప్రతిపదార్థం :–** భేదః అపి = భేదాలుకూడా; సాక్ష్యగత ఏవ = సాక్ష్యానికి చెందినవే; సాక్షిణః మే = సాక్షినైన నాలో; న = (భేదాలు) లేవు; భేదస్యసాక్షిణి = భేదాలను గమనించే సాక్షిలో; సభేదః కదం ప్రభవేత్ = ఆభేదం ఎలా పుడుతుంది? సుప్తిసమయే = గాఢనిద్రలో; భేదః అనుపలంభనాత్ = భేదాలు లేనందున; ఇహ = ఇక్కడ; సత్‌నాస్తితే = దానికి సత్తాలేదు; నః = మనకు; దృష్టతయా = స్పష్టంగా తెలుస్తున్నందున; నవాచ్యా = వాదించతగదు.

**బావం :–** భేదాలు కూడా సాక్ష్యానికి చెందినవే. సాక్షినైన నాలో భేదాలనేవి ఉండవు. భేదాలను గమనించే సాక్షినైన నాలో భేదాలు ఎలా పుడతాయి? గాఢనిద్రలో ఏభేదాలు కనపడనందువల్ల ఇక్కడ భేదాలకు సత్తాలేదు. మనకు స్పష్టంగా తెలుస్తున్నందున వాదించ తగదు.

**వ్యాఖ్య :-** సాధారణంగా బాహ్య ప్రపంచంలోని వస్తువులను, విషయాలను ఇంద్రియాలు చూస్తుంటాయి, వింటుంటాయి, తెలుసుకుంటాయి. ఇలా తెలుసుకొనే ఇంద్రియాలు సాక్షి. ఆ చూడబడే విషయాలు సాక్ష్యం. విషయాలలో ఎన్నో భేదాలుంటాయి. పొడుగు పొట్టి, లావు సన్నం, ఎరుపు నలుపు, మంచి చెడు... ఇలా. అయితే ఈ మార్పులన్నీ సాక్ష్యానికి చెందినవేగాని వీటిని చూచే – తెలుసుకొనే సాక్షికి (ఇంద్రియాలకు) చెందినవి కావు. అంటే భేదాలు ఇంద్రియాలలో లేవు.

ఇక ఇంద్రియాలు ఎన్నో భేదాలతో ఉంటాయి. కన్నుచేసేపని వేరు. చెవి చేసేపనివేరు. ఇలా ఒక్కొక్కటి ఒక్కోరకంగా పనిచేస్తుంది. అలాగే ఒక ఇంద్రియం ఒకప్పుడు బాగా పనిచేసింది. ఇప్పుడు అంతబాగా పనిచేయక పోవచ్చు. మరొక సమయానికి అసలే పని చేయకపోవచ్చు. ఇలా ఇంద్రియాలలో ఎన్నో భేదాలు ఉంటాయి. ఇంతకుముందు ఇంద్రియాలను సాక్షిగా చెప్పి భేదాలు లేవని చెప్పటం జరిగింది గదా! రెండు మాటలకు పొత్తు ఎట్లా కుదురుతుంది?

నిజంగా ఇంద్రియాలు ఇక్కడ సాక్ష్యనికి చెందినవి. సాక్షికాదు. వాటిని చూచే – తెలుసుకొనే ఆత్మ చైతన్యమే సాక్షి. కనుక భేదాలు ఇంద్రియాలలో ఉంటాయి కాని సాక్షినైన నాలో (ఆత్మలో) లేవు. కనుక భేదాలన్నీ సాక్ష్యానికి చెందినవే (దృశ్యానికి చెందినవే) గాని ద్రష్టనైన – సాక్షినైన – ఆత్మనైన నాలో ఏమార్పులు, భేదాలు లేవు. భేదాలను చూచేనాలో భేదాలెలా ఉంటాయి?

సాక్ష్యంగా చూడబడే దేహంగాని, ఇంద్రియాలుగాని, మనస్సు – అందులోని ఆలోచనలుగాని, బుద్ధి – అందులోని కోరికలుగాని ఇవన్నీ చూచే సాక్షి కన్న వేరైనవి. ఆ సాక్షియే బుద్ధిలో ప్రతిఫలించిన సత్తా – చిత్ ప్రకాశం ఆత్మ చైతన్యం. అట్టి ఆత్మనైన నాలో భేదాలుండే అవకాశమే లేదు. నిజంగా సాక్షిలో భేదాలుంటే అవి గాఢనిద్రలో కూడా కనిపించాలి. గాఢ నిద్రలో ఆత్మ చైతన్యంగా (నీవు) ఉన్నావా? లేవా? లేవని చెప్పేందుకు వీలు లేదు. ఎందుకంటే 'రాత్రి నేను లేనండీ – తెల్లారేటప్పటికి వచ్చాను' అని ఏ పిచ్చివాడైనా అనగలడా? కనుక గాడనిద్రలో కూడా చితి ఉన్నదని అంగీకరించాలి. మరి అప్పుడు చితిలో

మార్పులు ఏమైనా ఉన్నాయా? ఏమీలేవు. అంటే యదార్థంగా చితిలో ఏభేదాలు లేవు. చితిలో భేదాలు గనుక ఉంటే సుషుప్తిలో ఆ భేదాలుండాలి. చితిని అశ్రయించి ఉండాలి. కాని అప్పుడు ఏ అలజడులు ఆందోళనలు ఆలోచనలు సుఖ దుఃఖాలు లేని ఆత్మ మాత్రమే ఉన్నది. కనుక సాక్షిలో భేదాలు లేవు.

ఈ విషయం మనకు రోజూ తెలుస్తూనే ఉన్నది. అనుభవమౌతూనే ఉన్నది. ఇలా అనుభవమవుతూ ఉన్న విషయాన్ని తర్కించాల్సిన పని లేదు కదా!.

శాస్త్రాలు చెప్పిన మాటనో, ఎవరన్నా చెప్పిన మాటనో అయితే మనం అది నిజమా? కాదా? సమంజసమా? కాదా? అని పరిశీలించాలి. అదే మన అనుభవం అయితే అసలు అవిషయాన్ని సందేహించాల్సిన పనేలేదు. అందుకే శిష్యుడు అంటున్నాడు ఇది స్పష్టంగా తెలిసినదే. తర్కంఎందుకు? అని. అంటే సాక్షిలో భేదాలుండవు అనేది నిస్సందేహం.

ఇంత వరకు శిష్యుని అనుభవాన్ని వింటున్న గురువు తర్కబద్ధంగా ప్రపంచ మిధ్యాత్వాన్ని నిరూపిస్తున్నారు.

**శ్లో॥ విశ్వం సదేతదితి కార్యకరత్వ హేతోః**
**యద్యస్య సత్త్వ మిహసాధయితుం యతేథాః ।**
**తర్హ్యత్ర రజ్జు భుజగాద్యపి సద్బలాత్ స్యాత్**
**సత్యత్వ హేతురిదమాహు రచాధితత్వం ॥ 37**

**ప్రతిపదార్థం :-** కార్య కరత్వహేతోః = కార్యకారణ సంబంధ తర్కం ప్రకారం; ఏతత్ విశ్వం = ఈ ప్రపంచం; సత్ఇతి = సత్తాకలదే – నిజమే కాని, అస్యసత్త్వం = దాని సత్తాని; ఇహ సాధయితుం = ఇక్కడ నిరూపించటానికి; యది యతేథాః = ఒక వేళ ప్రయత్నించావా? తర్హి = అప్పుడు; రజ్జు భుజగాత్ అపి = త్రాడులో కనిపించిన పాముకూడా; బలాత్ = ఈ తర్కబలంతో; సత్ స్యాత్ = సత్తే అవుతుంది (నిజమే అవుతుంది); సత్యత్వహేతుః = సత్యముఅని చెప్పాలంటే; ఇదం = ఇది; అచాధితత్వం = ఎప్పటికీ నివారింప బడరాదు అని; ఆహుః = పెద్దలు చెబుతారు.

**భావం :-** కార్యకారణ సంబంధ తర్కం ప్రకారం ఈ ప్రపంచం సత్తాకలదే అని దాని సత్తాని నిరూపించటానికి ఒక వేళ ప్రయత్నించావా? అప్పుడు త్రాడులో కనిపించే పాముకూడా ఈ తర్కబలం వల్ల సత్యమే అవుతుంది. సత్యము అని చెప్పాలంటే అది ఎప్పటికీ నివారింపబడరాదు అని పెద్దలు చెబుతారు.

**వ్యాఖ్య :-** ఈ లోకంలోని వస్తువుల గురించి మాట్లాడేటప్పుడు కార్యకారణ సంబంధమనే తర్కం ఒకటి ఉన్నది. కార్యం అంటే కనిపించే వస్తువు. కారణం అంటే దానికి ఆధారమైన వస్తువు.

కుండ కార్యం. మట్టి కారణం. నగలుకార్యం బంగారం కారణం. మట్టి నుండి వచ్చిన కుండలన్నీ మట్టి తప్ప మరేమీకాదు. బంగారం నుండి వచ్చిన నగలు బంగారం తప్పమరేమీకాదు. ఇదే కార్యకారణ సంబంధం అంటే. ఈ తర్కాన్ని ఉపయోగించి అనంత సత్యమైన పరమాత్మ నుండి వచ్చిన ప్రపంచం కూడా సత్తేనని చెప్పటానికి వీలుందా? లేదు. ఈ వాదన అర్ధరహితం.

ఎందుకంటే ఆసలు నిజంగా ఈ నామ రూపాత్మక ప్రపంచం కేవల పరమాత్మ నుండి వచ్చిందా? కాదు. మాయ (సమిష్టి వాసనలు) యొక్క ప్రభావంతో – ప్రేరణతో పరమాత్మ నుండి వచ్చినది. పరమాత్మ సత్. మాయ అసత్. ఇలా సత్ అసత్‌లకలయిక వల్ల వచ్చింది గనుక కార్యకారణ సంబంధం ప్రకారం ప్రపంచం సత్ అసత్ రెండూ అని చెప్పాలి. రెండూ పరస్పర విరుద్ధమైనవి గనుక 'మిధ్య' అన్నారు. అంటే భ్రమలో ఉన్నంతవరకు కనిపిస్తుంది గనుక 'సత్'. భ్రమతొలగితే అదృశ్యమౌతుంది గనుక అసత్. ఇలా ప్రపంచాన్ని సత్ అసత్ అనిగాని. సత్‌కాదు అసత్‌కాదు అని గాని చెప్పాల్సి వచ్చినందున మిధ్య అన్నారు. అంటే చూసేవాడున్నంతకాలం కనిపిస్తుంది; చూసేవాడు లేనప్పుడు కనిపించదు. అని. లేదా నిజంగా లేకపోయినా ఉన్నట్లు కనిపించేది గనుక మిధ్య. కేవలసత్తానుండి మాత్రమే ఈ ప్రపంచంరాలేదు గనుక ప్రపంచం సత్తా అని చెప్పేవీలులేదు.

నిజంగా ప్రపంచం అనేది పరమాత్మనుండి ఎలా ఏర్పడింది? అనేదానికి 2 వాదాల గురించి మనం తెలుసుకోవాలి. అదే 1. పరిణామవాదం, 2. వివర్తవాదం – అని.

**1) పరిణామవాదం :–** ఉన్న అసలు వస్తువు పూర్తిగా మారిపోయి మరొక రూపంగా తయారు కావటం. మట్టి కుండగావటం; పాలు పెరుగు కావటం; బంగారం నగలు కావటం. ఈ వాదంలో అసలు వస్తువురూపం మారింది. అంటే అసలు వస్తువన్నా ఉంటుంది. మారిన వస్తువన్నా ఉంటుంది. ఏదో ఒక్కటే. ప్రపంచం ఇలా ఏర్పడలేదు. ఎందుకంటే పరమాత్మ స్వయంగా ప్రపంచంగా మారిపోతే ఇప్పుడు ప్రపంచం మాత్రమే ఉంటుంది. పరమాత్మ ఉండే వీలులేదు.

**2) వివర్తవాదం :–** ఉన్న అసలు వస్తువు ఉన్నది ఉన్నట్లు అలాగే ఉండి, మరొక విధంగా చూచేవాడికి కనిపించటం. తాడు పాములాగా కనిపించటం. ఎడారి ఎండమావిలాగా కనిపించటం. మ్రోడు దయ్యంలాగా కనిపించటం. ముత్యపు చిప్పలోని నీటిబిందువు వెండిలాగా కనిపించటం. ఈ వాదంలో అసలు వస్తువు ఏమార్పులూ లేకుండా ఉన్నది ఉన్నట్లు అలాగే ఉండి పోతుంది. అదే సమయంలో చూచేవాడి దృష్టిని బట్టి మరొక విధంగా కనిపిస్తుంది. అంటే భ్రమలో మరొక వస్తువుగా కనిపిస్తున్నా అసలు వస్తువుకు ఏఢోకాలేదు. అది ఎప్పటిలాగా అక్కడే ఉంటుంది. ప్రపంచం ఏర్పడింది ఇలాగే. ఎందుకంటే ప్రపంచం కనిపిస్తున్నప్పటికీ పరమాత్మకూడా తనయదార్ధ రూపంలో ఉండనే ఉన్నాడు.

ఈ వాదాన్ని అనుసరించి పరమాత్మ ప్రపంచంగా మనకు భ్రమకలుగుతున్నది. ఎలాగంటే చీకటిలో పడి ఉన్న త్రాడు మనకు పాములాగా కనిపించినట్లు. పాముకార్యం త్రాడు కారణం. నిజంగా త్రాడు ఉన్న కారణంచేతనే మనకు చీకటిలో పాము కనిపించింది.

ఇప్పుడు కార్యకారణ సంబంధతర్కాన్ని ఉపయోగిస్తే మనకు కనిపించే పాము త్రాడు తప్ప మరేమీకాదు – అని అంగీకరించాలి. అలాగే మనకు కనిపించే ప్రపంచం పరమాత్మ తప్ప మరేమీకాదు అని కూడా అంగీకరించాలి. నిజమే ఈ ప్రపంచం భ్రమలో నున్న జీవుడికే. భ్రమ వదలిన జీవుడికి – ఆత్మాను భూతినొందిన వానికి ఇది పరమాత్మే. సర్వత్రా అతడికి పరమాత్మ తప్ప వేరేమీ కనిపించదు (తనతోసహా).

అయితే పరమాత్మ సత్‌కదా! మరి పరమాత్మ నుండి వచ్చిన ప్రపంచం కూడా సత్తేనా? ఇలా నిరూపించాలని ప్రయత్నిస్తే ఏమవుతుంది?

త్రాడు నిజమైనది గనుక త్రాడువల్ల కనిపించే పాము కూడా నిజమైనదే అనాలి. ఎంత తెలివి తక్కువ వాడైనా అలా అంటాడా? ఎందుకంటే అక్కడ దీపం వెలిగించటంతోనే ఇంత వరకు కనిపించిన పాము అదృశ్యం. అదృశ్యం అంటే ఇంతకుముందు ఉండి మాయమైందనికాదు. అసలు ఎప్పుడూ పాములేనే లేదని, అక్కడ త్రాడు మాత్రమే ఎప్పుడూ ఉన్నదని తెలిసిపోతుంది. కనుక పాముకు సత్యత్వం లేదు. అసలు అది ఎప్పుడూ లేనిదే. కాకపోతే చీకటిలో ఉన్నప్పుడు మాత్రం ఉన్నట్లు భ్రమ కలిగింది. ఇలా ఒకప్పుడు కనిపించి మరొకప్పుడు కనిపించని దానిని సత్ అనేవీలులేదు. అది మిధ్య. అలాగే త్రాడు 'సత్'. దానిని నీవు చూడనప్పుడు కూడా అది అక్కడే ఉన్నది.

దీనిని బట్టి ఈ ప్రపంచం కూడా సత్ కాదు. ఇది మిధ్య. దీనిని చూస్తున్నప్పుడు కూడా సత్యం కాదు. అలాగే దీనికి ఆధారమైన పరమాత్మ మాత్రం సత్. దానిని నీవు చూడలేనప్పుడు కూడా అది అంతటా ఉంది. ఏకాలంలో కూడా అది లేకుండా పోయేది కాదు. నీవు చూడగలిగితే ఎల్లప్పుడూ ఉండేది పరమాత్మే.

అయితే సామాన్యుడు ప్రపంచాన్ని మాత్రమే చూస్తాడు. ప్రపంచం ఒట్టిదే అంటే మరి లేనిప్రపంచం నాకు ఎలా కనిపిస్తున్నది? అంటాడు. అలాంటి వానికి గురువు సమాధానం ఏమిటి? –

**శ్లో॥ కీ దృగ్విధం జగదయే వదసత్త్వ చిత్త్వేద్**
**ఆకారహీనమితి పృష్ట వతేస్తి మహ్యాం ।**
**ప్రత్యుత్తరం కిమితి తే తవ మౌనమేవ**
**ప్రత్యుత్తరం భవతి మాంప్రతి జాల్మగచ్ఛ ॥ 38**

**ప్రతిపదార్థం :–** అయే = ఓయి!; సత్త్వ ఆది ఆకారహీనం = సత్తు చిత్తు మొ॥న ఆకారంలేని; జగత్ = ప్రపంచం; కీదృగ్విధం వదఇతి =

ఎలాకనపడుతున్నదో చెప్పుఅని; పృష్టవతే మహ్యాం = అడగబడిననాకు; తేప్రత్యుత్తరం కిం? అస్తి ఇతి = నీ సమాధానంఏమిటి? అని అడిగితే; తవ = నీకు; మాంప్రతి = నానుండి, మౌనంఏవప్రత్యుత్తరం భవతి = మౌనమే సమాధానం అవుతుంది; జాల్మగచ్ఛ = మూర్ఖుడా! వెళ్ళు.

**భావం :-** ఓయి! సత్తు చిత్తు మొదలైన ఆకారంలేని ప్రపంచం ఎలాకనిపిస్తున్నదో చెప్పమని అడగబడిన నాకు 'నీ సమాధానం ఏమిటి?' అంటే నానుండి నీకు మౌనమే సమాధానం అవుతుంది. మూర్ఖుడా! వెళ్ళు.

**వ్యాఖ్య :-** ప్రపంచం మిధ్య అని, సత్ కాదని ఇంతకు ముందే ఋజువైంది. మరి అలాంటి సత్‌కాని - ఆకారంలేని ప్రపంచం ఇంత స్పష్టంగా ఎలా కనిపిస్తున్నదో చెప్పమని **శిష్యులు** గురువుని ప్రశ్నిస్తారు. దానికి సమాధానంగా గురువు మౌనంగా ఉంటాడు. ఎందుకంటే ఆప్రశ్న అర్ధరహితమైనది గనుక.

ఆధ్యాత్మికజ్ఞానం ఏమాత్రం లేని సామాన్యుడు అసలు ఈప్రశ్నే వేయడు. ఎందుకంటే అతడికి ప్రపంచం సత్యంగనుక, యధార్ధంగనుక, అతడికి మరొక ఆలోచన వచ్చే అవకాశం లేదు. కాని ఒక గురువును ఆశ్రయించిన శిష్యులు ఆత్మజ్ఞానాన్ని నేర్చుకుంటూ పరమాత్మ గురించి, ప్రపంచం గురించి తెలుసుకుంటూ, పరమాత్మనుండి ప్రపంచం వచ్చినప్పటికీ ఈ ప్రపంచం మిధ్యామాత్రమని, దానికి సత్యత్వం లేదని తెలుసుకున్నప్పుడు వారికి సందేహం కలుగుతుంది. సత్యత్వం లేని, ఆకారం లేని ప్రపంచం ఇంత స్పష్టంగా ఎలా కనిపిస్తున్నది? అని. ఐతే ఇలాంటి సందేహం ప్రారంభదశలోని శిష్యులకు కలగవచ్చు నేమోగాని శాస్త్రవాక్యాలను శ్రవణం, మననం చేసిన శిష్యులకు; శ్రుతి, యుక్తి, అనుభవాలతో పోల్చిచూచుకొనే వారికి ఇలాంటి సందేహం కలగరాదు.

అందుకే అలాంటి శిష్యులు ఈ ప్రశ్నను అడిగినప్పుడు గురువు మౌనం వహిస్తాడు. 'ఇంత తెలివి తక్కువ ప్రశ్న వేస్తున్నాడే శిష్యుడు' అని.

మనం కలలో చూచే స్వప్నప్రపంచానికి సత్యత్వం ఉన్నదా? దానికి ఏ ఆకారం ఉన్నది? దేనితో తయారు చేయబడ్డది? ఐనా స్పష్టంగా స్వప్నపురుషుడు చూస్తూనే ఉన్నాడుగదా!

త్రాడులో కనిపించే పాముకు సత్యత్వం ఉన్నదా? అయినా స్పష్టంగా చూస్తూ భయపడతాం గదా!. అలాగే మోడులో కనిపించే దయ్యానికి సత్యత్వం ఉన్నదా? కాని స్పష్టంగా చూస్తూ భయపడతాం గదా!

ఎడారిలో ప్రయాణం చేసే వాడికి దప్పిక అయితే తన దగ్గరున్న నీరు ఐపోతే, అతడికి దూరంగా నీటి వనరుకనబడుతుంది. చెరువులో నీరులాగా అలలు అలలుగా కనపిస్తుంది. దగ్గరకు వెళ్ళిచూస్తే అక్కడ నీరుండదు. కాని దూరంగా నీరున్నట్లు కనిపిస్తుంది. అలా అతడు ఎంత దూరం వెళ్ళినా దగ్గరలో నీరు కనిపించదు, దూరంగా మాత్రం కనిపిస్తూనే ఉంటుంది. మరి ఆ నీరు సత్యమా? కాదు. అదే 'ఎండమావి' అంటారు. కాని దప్పికగొన్న వాడికి నీరున్నట్లు స్పష్టంగా కనిపిస్తుంది. ఎలా కనిపిస్తున్నది?

అలాగే ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లు కనిపిస్తుంది. దగ్గరకు వెళ్ళి చూస్తే నీటి బొట్టు. సూర్యకాంతి దానిపైబడి వెండిలా మెరుస్తుంది. అక్కడ వెండి నిజంగా ఉన్నదా? లేదుగదా!

ఇలా ఎన్నో ఉదాహరణలు నిజంగా లేకపోయినా ఉన్నట్లు కనిపిస్తుంటే ఈ ప్రపంచం నిజంగా లేకపోతే ఎలా కనిపిస్తున్నది? అని శిష్యుడు అడిగితే అతడు పసివాడే. మూర్ఖుడే. అందుకే గురువు మౌనం వహిస్తాడు. శిష్యుడు మరల అడిగితే మూర్ఖుడా! మౌనమేనీకు నాసమాధానం. వెళ్ళు అంటున్నాడు.

ఇప్పుడు మరో తెలివిగల ప్రశ్న అడుగుతున్నాడు శిష్యుడు.

భ్రమ తొలిగితే పాము కనిపించదుగదా! మరిజ్ఞానికి ఈ ప్రపంచం కనబడకుండా పోతుందా? అని – శిష్యుని ప్రశ్న.

దానికి గురువు సమాధానం

**శ్లో॥ జ్ఞానాగ్ని దగ్ధమపి భాతి జగద్విచిత్రం**
**యచ్ఛధ్వని భ్రమవత్సవిశేషబోధాత్ ।**
**తస్మిన్ భ్రమే విమధిత్యేపి తథైవభాతి**
**దిగ్వత్యధో మమ చతద్వదతోన సత్తత్ ॥** **39**

**ప్రతిపదార్థం :–** చయత్ ధ్వని భ్రమవతః = ప్రతిధ్వని గురించి భ్రమలో నున్న వానికి; సవిశేష బోధాత్ = దానిగురించి పూర్తిగా బోధిస్తే; తస్మిన్ దిగ్వతిభ్రమే = దానివల్ల ప్రతిధ్వని భ్రమ; విమధితే = తొలగిపోతుంది; అపి = అయినప్పటికీ; తధాఏవభాతి = అది ఎలా వినిపిస్తూనే ఉంటుందో, తద్వత్ = అలాగే; జగత్ = ఈ ప్రపంచభ్రమ; జ్ఞానాగ్ని దగ్ధం అపి = జ్ఞానాగ్నిలో దగ్ధమైనప్పటికీ; మమ = నాకు; విచిత్రం భాతి = ఆశ్చర్యకరంగా కనపడుతూనే ఉంటుంది; అతతత్ నసత్ = అందువల్ల అది నిజంకాదు.

**భావం :–** ప్రతిధ్వని గురించి భ్రమపడిన వానికి దానిని గురించి పూర్తిగ తెలియజెప్పి, ఆప్రతిధ్వని యొక్క భ్రమను తొలగించినప్పటికీ ఎలాగైతే ఇంకా అది వినిపిస్తూనే ఉంటుందో అలాగే ఈ జగత్తును గురించిన భ్రమ జ్ఞానాగ్నిలో దగ్ధమైనప్పటికీ విచిత్రంగా ఈ జగత్ కనబడుతూనే ఉంటుంది. ఐనా అది నిజంకాదు.

**వ్యాఖ్య :–** ప్రపంచం మిధ్యఅని, యదార్థంగా లేనే లేదని; ఎలాగైతే చీకటిలో త్రాడు పాములాగా భ్రమగొల్పుతుందో అలాగే అజ్ఞానంలో ఉన్నంత వరకు పరమాత్మే ప్రపంచంలాగా భ్రమ గొల్పుతుందనీ శాస్త్రాలన్నీ చెబుతున్నాయి. అంతేకాదు. వెలుతురు వస్తే ఇప్పటి వరకూకనిపించిన పాము అదృశ్యమై ఎలాగైతే సత్యంగా ఉన్నత్రాడు మాత్రమే కనిపిస్తుందో; అలాగే జ్ఞానంలో నిల్చిన మహాత్మునికి – జీవన్ముక్తునికి అజ్ఞానంలో ఉన్నప్పుడు కనిపించిన ఈ జగత్తు అదృశ్యమై అసలు సత్యమైన పరమాత్మ మాత్రమే కనిపిస్తుంది – అని కూడా మహాత్ములు చెబుతుంటారు.

కాని ఆత్మానుభూతిని పొంది, ఆత్మానందాన్ని అనుభవిస్తున్న ఆత్మజ్ఞానికి అసలు ఈ ప్రపంచం కనబడదా? అంటే కనబడుతూనే ఉంటుంది. ఎందుకలా కనబడుతుంది? అని అడిగే వారికి గురువు ఇక్కడ సమాధానం ఇస్తున్నారు. ఒక చక్కని ఉపమానంతో శిష్యుల సందేహాన్ని తీరుస్తున్నారు.

జనసంచారం లేని కొండప్రాంతాలలో మనం గనుక పెద్దగా కేకవేస్తే అదేకేక తిరిగి మళ్ళీ మళ్ళీ ప్రతిధ్వనిస్తుంది. మనమాటలే తిరిగి తిరిగి మనకు

వినిపిస్తుంటే ఇది ప్రకృతి సిద్ధంగా వచ్చే ప్రతిధ్వనియే అని తెలియని చిన్న పిల్లలుగాని, అమాయకులుగాని ఏమనుకుంటారంటే అక్కడ కొండచాటున ఎవరో ఉండి మనమాటలనే, మనం చేసిన శబ్ధాలనే వారూ తిరిగి చేస్తున్నారని భ్రమపడుతూ ఉంటారు. తెలిసినవారు వారికి నచ్చజెప్పి, ఇది ప్రతిధ్వని అని, అది ప్రకృతిలో సహజమని సకారణంగా తెలియజేస్తే వింటారు, నమ్ముతారు, భ్రమ పోగొట్టుకుంటారు. అలా భ్రమపోగొట్టుకొన్న వారికి కూడా శబ్దంచేస్తే తిరిగి ప్రతిధ్వని వినబడుతూనే ఉంటుంది. నీవు భ్రమ పోగొట్టుకున్నా ప్రకృతి యొక్క సహజలక్షణం ఎక్కడికీపోదు.

ప్రపంచం విషయం కూడా అంతే.

ఈ ప్రపంచం ఎలా ఏర్పడింది. సమిష్టి వాసనల (మాయ) యొక్క ప్రేరణతో పరమాత్మ సహకారంతో ఈ ప్రపంచం ఏర్పడింది. మాయవల్ల – మాయనుండి ఏర్పడిన ఈ ప్రపంచం ఆ మాయాప్రభావం ఉన్నంతకాలం ఉంటుంది. అంటే సమిష్టి వాసనలున్నంత వరకూ ఉంటంది. అయితే ఈ ప్రపంచంలోని జీవుళ్ళందరూ వారి వారి వ్యష్టివాసనల కారణంగా ఆలోచనలు చేస్తూ, తదనుగుణంగా కర్మలు చేస్తూ, తత్ఫలితంగా లభించే సుఖదుఃఖాల ననుభవిస్తూ, ఈ ప్రపంచంలో పరిభ్రమిస్తూ, పుడుతూ, చస్తూ ఉంటారు. అయితే ఏ అదృష్టవంతుడో ఎన్నోజన్మలలో సుకృతాలు చేసుకొని ఉంటే ఒక సద్గురువును ఆశ్రయించి, ఆత్మజ్ఞానాన్ని పొంది, పట్టుదలతో సాధనలు చేసి, సమస్త కర్మబంధనాల నుండి, వాసనల నుండీ తరించి, ముక్తిని పొందుతాడు. దాని కారణంగా అతడిలోని వాసనలన్నీ నశించిపోతాయి. జన్మకు కారణమైన బీజాలన్నీ నశించటం వల్ల జన్మలేకుండా పోతుంది. అంటే అతడి వాసనలన్నీ నశించి పోవటం నిజమే. అంత మాత్రాన సమిష్టి వాసనలు నశించవుగదా! ఏ సమిష్టి వాసనల వల్ల ఈ ప్రపంచం సృష్టించబడిందో ఆ సమిష్టి వాసనలున్నంత వరకూ ఈ ప్రపంచం నశించదు గదా! కనుక ప్రపంచం తప్పని సరిగా ఉంటుంది. అతడికీ కనిపిస్తుంది. అంటే జ్ఞానికీ కనిపిస్తుంది. అజ్ఞానికీ కనిపిస్తుంది. కాకపోతే వారి దృష్టిలో తేడా.

సామాన్యుడు ఈ ప్రపంచాన్ని సత్యంగా భావిస్తాడు. ఇక్కడ దొరికే

వస్తువులద్వారా విషయాల ద్వారా భోగాలద్వారా ఆనందాన్ని పొందాలను కుంటాడు. వాటి కోసం ప్రయత్నం చేస్తాడు. ఫలిస్తే సుఖం. ఫలించకపోతే దుఃఖం. కాని ఆత్మజ్ఞాని యొక్క దృష్టి వేరు. అతడికి కనిపించే ఈ ప్రపంచం సారహీనమైనట్టిది. (1) గారడీ వాని చేతిలోని వస్తువు వంటిది. (2) నీటిలో కనిపించే ఫలపుష్ప భరిత వృక్షం యొక్క ప్రతి బింబం వంటిది. (3) పాము కుబుసం వంటిది.

(1) గారడీవాని చేతిలో లక్షల డబ్బు ఉంటుంది. దానిని చూచి మనం ఎలా వ్యామోహం చెందమో; ఆ డబ్బు ఎందుకూ పనికి రానిదేనని ఎలా గ్రహించి నిర్లిప్తంగా ఉంటామో అలాగే ఈ ప్రపంచం కూడా ఎందుకూ పనికి రానిదానిగా భావిస్తారు. ఏ మాత్రం భ్రమ పడరు.

(2) ఫలాలతో పుష్పాలతో ఉన్న వృక్షాన్ని చూస్తే ఎంతో ఆనందం. వాటిని కోసుకోవాలనే కోరిక ఉంటుంది. కాని అదేవృక్షం నీటిలో ప్రతిబింబిస్తే అందులో కూడా ఆ ఫలాలు, పుష్పాలు కనిపిస్తాయి. కాని వాటిని కోసుకోవాలని అనుకోరు. ఎందుకంటే వాటిని కొయ్యటానికి వీలూలేదు. తినటానికీ పనికిరావు. అలాగే ఈ ప్రపంచాన్ని జ్ఞాని నిర్లిప్తంగా దర్శిస్తాడు.

(3) పామును చూస్తే అందరూ భయపడతారు. పాము విడిచిన కుబుసం అచ్చం పాములాగే ఉంటుంది. దానిని చూచి సామాన్యుడు భయపడతాడు. తెలిసినవాడు ఆడుకుంటాడు. అలాగే జ్ఞాని ఈ ప్రపంచంతో ఆడుకుంటూ విలాసంగా ఉండిపోతాడు. తాను ఆనంద స్వరూపుడే గనుక ఆనందం కొరకు ప్రపంచవైపుకు చూడడు. కనుక ప్రపంచం కనిపించినా ముక్తునికి ఈ ప్రపంచం లేనట్టే.

ముక్తుని అంతిమ అనుభవం ఎలా ఉంటుందో శిష్యుని అభిప్రాయం.

**శ్లో॥ భూమింజలే, తదపితేజసి తచ్ఛవాయో**
**తం వ్యోమ్ని తత్ త్రిగుణయాసహ మయ్యనంతే ।**
**పూర్ణేవిలాప్య పరిశిష్ఠ మఖండ సంవిత్**
**స్వానందరూపమను భూయ రమే హ మద్య ॥ 40**

**ప్రతిపదార్థం :–** భూమింజలే = భూమిని నీటిలోను; తత్అపితేజసి = దానిని కూడా అగ్నిలోను; తత్చవాయో = మరిదానిని వాయువులోను; తం వ్యోమ్ని = దానిని ఆకాశంలోను; తత్త్రిగుణయాసహ = దానిని త్రిగుణాత్మకమైన మాయతోసహ; అనంతే పూర్ణే మయివిలాప్య = అనంతము పూర్ణము అయిన నాలో లయంజేసి; పరిశిష్ఠం = మిగిలిఉన్న; అఖండ సంవిత్ స్వానందరూపం = అఖండ జ్ఞాన స్వరూప ఆత్మానందాన్ని; అనుభూయః = అనుభవ పూర్వకంగా; అహం అద్యరమే = నేను ఇప్పుడు రమిస్తున్నాను.

**భావం :–** భూమిని జలంలో, దానిని అగ్నిలో, దానిని వాయువులోను, దానిని ఆకాశంలోను, దానిని త్రిగుణాత్మక మాయతో సహా అనంతమై, పరిపూర్ణమైన నాలో లయంజేసి మిగిలి ఉన్న అఖండ, జ్ఞాన స్వరూప ఆత్మానందాన్ని అనుభవంగా పొంది నేను ఇప్పుడు ఇక్కడ రమిస్తూ ఉన్నాను.

**వ్యాఖ్య :–** ప్రపంచం సమిష్టి వాసనల కారణంగా నిలిచే ఉంటుంది గనుక అది జ్ఞానికి కూడా కనిపిస్తున్నప్పటికీ దానిని ఏమాత్రం పట్టించుకోకుండా గారడీవాడు చూపించే వస్తువులాగా, నీటిలో ప్రతిబింబించిన వృక్షంలాగా, పాము కుబుసంలాగా, అసత్తేనని గ్రహించి, అనంత ఆత్మానందాన్ని పొందుతూనే ఉంటాడు అని క్రిందటి శ్లోకంలో చెప్పుకున్నాం. అయితే అలా అతడికి ఎలా సాధ్యమవుతున్నదో సకారణంగా ఈ శ్లోకం వివరణ ఇస్తున్నది. అంటే ప్రపంచాన్ని చూస్తూ కూడా ఆత్మానందాన్ని ఎలా అనుభవించగలుగుతున్నాడు?

ప్రపంచం అనేది శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే అయిదు విషయాలతో కూడుకొని ఉన్నది. వాటిని శ్రోత్రం, త్వక్, చక్షు, రసన, ఘ్రాణ అనే 5 ఇంద్రియాల ద్వారా గ్రహించి జీవుడు అనుభవానికి తెచ్చుకుంటున్నాడు, ఈ ప్రపంచాన్ని భోగిస్తున్నాడు. ఇలా అనుభవానికి తెచ్చుకోవాలంటే ఇంద్రియాలకు కావలసిన శక్తి – ప్రేరణ ఎక్కడినుండి వస్తున్నాయి? మూలాధారం నుండి విశుద్ధం వరకు ఉన్న చక్రాలనుండి. ఏమిటీ చక్రాలు? ఎక్కడుంటాయి?

ప్రతి మనిషిలో నాడీ వ్యవస్థ ఉంటుంది. మెదడులోని నాడీకేంద్రం నుండి విసర్జనావయవం వరకు వెన్ను పూస అనేక ఎముకల అల్లికతో ఉంటుంది. ఈ

వెన్నుపూసను ఆశ్రయించుకొని ప్రధానంగా సుషుమ్నానాడి అని ప్రధాన నాడి ఉంటుంది ఈ సషుమ్నా నాడి బ్రహ్మరంధ్రం వరకు ఉంటుంది. దీనినే బ్రహ్మనాడి, మోక్షనాడి అని కూడా అంటారు. ఈ సుషుమ్నా నాడిలో గుదస్థానంలో మూలాధార చక్రం, లింగస్థానంలో స్వాధిష్టానచక్రం, నాభిస్థానంలో మణిపూరక చక్రం, హృదయస్థానంలో అనాహతచక్రం, కంఠస్థానంలో విశుద్ధచక్రం, భ్రూమద్యంలో ఆజ్ఞాచక్రం అని షట్చక్రాలుంటాయి. ఇక బ్రహ్మరంధ్రంవద్ద (బ్రహ్మస్థానం) సహస్రార చక్రం ఉంటుంది. ఇదే పరమాత్మస్థానం.

ఈ పైన పేర్కొన్న చక్రాలలో మొదటి 5 చక్రాల వల్ల – మూలధార, స్వాధిష్టాన, మణిపూర, అనాహత, విశుద్ధ చక్రాలవల్ల ఇంద్రియాలకు విషయాలను గ్రహించే శక్తి వస్తున్నది.

ఇంద్రియాలు ఈ చక్రాల వల్ల శక్తిని పొంది విషయాలనుగ్రహించి తద్వారా జీవుడు ఈ ప్రపంచ వ్యామోహాలలో మునిగి పోయేందుకు సహకరిస్తున్నాయి.

(1) మూలాధార చక్రం భూతత్వంగలది. కనుక వాసనచూసే శక్తిని ముక్కుకు ఇస్తుంది.

(2) స్వాధిష్టాన చక్రం జలతత్వం గలది. కనుక రుచిచూసే శక్తిని నాలుకకు ఇస్తుంది.

(3) మణిపూరచక్రం అగ్నితత్వం గలది. కనుక చూచేశక్తిని కంటికి ఇస్తున్నది.

(4) అనాహతచక్రం వాయుతత్వం గలది. కనుక స్పర్శించే శక్తిని చర్మానికి ఇస్తుంది.

(5) విశుద్ధ చక్రం ఆకాశ తత్వం కలది. కనుక వినేశక్తిని చెవికి ఇస్తుంది.

ఇలా 5 చక్రాలు 5 ఇంద్రియాలకు 5 విషయాలను గ్రహించేశక్తి నిస్తున్నవి. అందువల్ల జీవుడు ఈ ప్రపంచ విషయాలలో మునిగి, ఇక్కడ దొరికే అల్పమైన విషయానందాలకు ఆశపడి ఆత్మానందాన్ని దూరం చేసుకుంటున్నాడు.

మరి ఆత్మానందాన్ని పొందటం ఎలా? దానికి మార్గం ఏమిటి? ఇంద్రియనిగ్రహం – వైరాగ్యం.

మానవుడు తనలోని ఆత్మానందాన్ని పొందాలంటే ఇంద్రియాలు విషయాలలోనికి పోకుండా నిగ్రహించాలి. ఇదే ఇంద్రియనిగ్రహం. ఆత్మ సాక్షాత్కారాన్ని పొంది, ఆత్మానందాన్ని అనుభవించాలనుకొనే సాధకుడు తన సాధనలు సాగిస్తున్న కొద్దీ ఈ ఇంద్రియనిగ్రహం సాధ్యమవుతుంది; విషయ వ్యామోహం తగ్గి పోతుంది.

ఐతే ఏమిటా సాధనలు? 2 రకాల సాధనలున్నాయి అవి –

1. యోగ సాధన, 2. జ్ఞాన సాధన. మూలధార చక్రంలో కుండలినీ శక్తి ఉంటుంది. అది 2 పాములు ఒకదాని కొకటి పెనవేసుకొని చుట్టచుట్టుకొని ముడుచుకొని పడుకున్నట్టుగా ఉంటుంది. అదే జీవుడు. ఈ కుండలినీ శక్తిని కదిలించటమే సాధన. మూలాధారంలోని కుండలిని శక్తి సాధన ద్వారా కదిలి క్రమంగా స్వాధిష్టాన చక్రాన్ని, అదిదాటి మణి పూరచక్రాన్ని, దానిని అధిగమించి అనాహతాన్ని, దానిని దాటి విశుద్ధాన్ని చేరి, అక్కడినుండి ఆజ్ఞాచక్రానికి చేరాలి. దీనినే చక్రభేదనం అంటారు. అంటే కుండలినీ శక్తి ఒక్కొక్క చక్రాన్ని భేదించుకుంటూ వెళ్ళటం అన్నమాట. ఇలా కుండలినీ శక్తి చక్రభేదనం చేసుకుంటూ వెళ్ళాలంటే ముందు కుండలినీ శక్తిని కదిలించాలి. దానికే 2 రకాలసాధనలు.

**1. యోగసాధన :–** వెన్నెముకలో సుషుమ్నానాడి ఉంటుందని చెప్పుకున్నాం. దానికి ఇరువైపులా ఇడా పింగళ అనే 2 నాడులుంటాయి. ఇవి మూలాధారం దగ్గర మొదలై అజ్ఞాచక్రం వరకు ఉండి ముక్కు రంధ్రాల వద్ద తెరుచుకొని ఉంటాయి. మనశ్వాసను ఇడాపింగళనాడుల నుండి ప్రాణాయామం ద్వారా అంతరకుంభకం, బాహ్యాకుంభకం ద్వారా సుషుమ్నా నాడిలో ప్రవేశపెట్టాలి. అప్పుడు ఆ సుషుమ్నా నాడిలో గుదస్థానం వద్ద ఉన్న మూలాధార చక్రంలోని కుండలినీ శక్తిని ఈ ప్రాణశక్తి కదిలిస్తుంది. ఇది యోగసాధన. ఇక –

**2. జ్ఞానసాధన :–** ఉపనిషత్తుల జ్ఞానాన్ని – వేదాంతజ్ఞానాన్ని ఒక సద్గురువు వద్ద శ్రద్ధతో శ్రవణం చేస్తూ మనన, నిధి ధ్యాసనలు చేస్తూఉంటే మూలాధారంలోని కండలినీ శక్తి సహజంగానే కదిలి క్రమక్రమంగా చక్రభేదనం చేసుకుంటూ పోతుంది. ఇది జ్ఞాన మార్గ సాధన.

ఎవరైతే అర్హత గలిగిన శిష్యుడు గురుసేవజేసి, గురుబోధవిని, గురు సమక్షంలో సాధనచేస్తూ ఉంటాడో అతడిలోని కుండలినీశక్తి మూలాధారం నుండి కదిలి స్వాధిష్టాన చక్రంలోకి చేరుతుంది. ఇలా చేయటం వల్ల మూలధార చక్రంలోని భూతత్వం స్వాధిష్టానంలోని జల తత్వంలో లయమై పోతుంది. ఇక కుండలినీ శక్తి స్వాధిష్టానంనుభేదించుకొని మణిపూరాన్ని చేరినప్పుడు భూతత్వాన్ని లీనంచేసుకొన్న జలతత్వం మణిపూరంలోని అగ్ని తత్వంలో లీనమవుతుంది. ఇదే భూమి జలంలో జలం అగ్నిలో లీనం కావటం. ఇప్పుడు కుండలినీ శక్తి కదిలి అనాహతం చేరటంతో అగ్నితత్వం అనాహతంలోని వాయువులో లీనమవుతుంది. కుండలినీ విశుద్ధాన్ని చేరటంతో వాయుతత్వం కాస్తా విశుద్ధంలోని ఆకాశంలో లయమై పోతుంది. ఇలా ఒక్కొక్కభూతం పైదానిలో లయమౌతూ ఆకాశం మాత్రమే మిగిలినప్పుడు కుండలినీ శక్తి విశుద్ధాన్ని దాటి ఆజ్ఞాచక్రంలో చేరినప్పుడు ఈ ఆకాశం త్రిగుణాత్మకమైన మాయతో సహా ఓంకారంలో లయమై పోతుంది. ఆజ్ఞా చక్రంలోనికి కుండలిని (జీవుడు) ప్రవేశించటం అంటే మనస్సుతో సహా సర్వేంద్రియాల శక్తులు లమయైపోయినట్లే. ఇక ఆజ్ఞాచక్రాన్ని కుండలిని భేదిస్తే ఏ ప్రాపంచిక అనుభవమూ ఉండదు. అఖండ ఆత్మానందమే. ఇప్పుడు జీవుడు తనయదార్ధ స్వరూపమైన ఆత్మగా నిరంతరము తనలోనే రమిస్తూ ఉంటాడు. ఇప్పుడు ప్రపంచం ఉన్నా అతడికి లేనట్లే. అందుకే జ్ఞానికి ప్రపంచం ఉన్నా ప్రపంచ స్పృహ ఉండదు అని చెప్పటం.

ఆత్మానుభవం ఎలా ఉంటుంది?

**శ్లో॥ అజ్ఞాన తన్నిరసనేమయి బోధరూపే**
**స్యాతాం కథం తిమిర తద్విరతే ఇవార్కే ।**
**బంధశ్చ మోక్ష ఇతి కల్పన మప్య సత్యం**
**భ్రాంత్యైవ భాత్యఖిల సాక్షిణి నిత్యముక్తే ॥ 41**

**ప్రతిపదార్ధం :-** అర్కే = సూర్యునిలో; తిమిర తత్ విరతే ఇవ = చీకటి

ఉండటం, అది తొలగిపోవటం లాగా; బోధరూపేమయి = జ్ఞానస్వరూపమైన నాలో; అజ్ఞాన తత్ నిరసనే = అజ్ఞానము, దానిని పోగొట్టు కోవటము; కథం స్యాతాం? = ఎలా ఉంటాయి? బంధఃచ, మోక్ష ఇతి = బంధము, మోక్షము అనే, కల్పనం అపి = కల్పన కూడా; అసత్యం = అసత్యమే; నిత్యముక్తే అఖిల సాక్షిణి = నిత్యముక్తుడైన సర్వసాక్షిలో; భ్రాంత్యా ఏవ భాతి = భ్రాంతి వల్లనే అలాభాసిస్తుంది.

**భావం :-** సూర్యుడిలో చీకటి ఉండటం, అది తొలగి పోవటం వలె జ్ఞాన స్వరూపమైన నాలో అజ్ఞానము, దానిని పోగొట్టుకోవటమూ అంటూ ఎలా ఉంటాయి? బంధము, మోక్షము అనే కల్పన కూడా అసత్యమే. నిత్యముక్తుడైన సర్వసాక్షిలో భ్రాంతి వల్ల అలా భాసిస్తుంది. (భ్రాంతిని తొలగించుకోవటమే ముక్తి)

**వ్యాఖ్య :-** ఆత్మానుభూతిని పొందిన తర్వాత తెలిసే ఒక ముఖ్యవిషయం ఏమంటే అసలు అజ్ఞానమూ లేదు, దానిని పోగొట్టుకోవటమూ లేదు. రెండూ ఒట్టిదే. రెండూ నిజంకాదు. ఎందుకంటే సూర్యుడిలో చీకటనేది ఎప్పుడైనా ఉంటుందా? ఉంటేగదా! చీకటిని పోగొట్టాలని ప్రయత్నం చేసేది. అంటే సూర్యునిలో చీకటీ లేదు, దానిని పోగొట్టే ప్రయత్నమూ లేదు. రెండూ అబద్ధమే. అలాగే నాలో ఎప్పుడూ బంధమూ లేదు, దానిని వదుల్చుకొనేందుకు ప్రయత్నమూలేదు, ముక్తిని పొందటమూ లేదు. నేనెప్పుడూ ముక్తుడనే. నిత్యముక్తుడనే.

రాత్రి ఒక కలవచ్చింది. దానిలో నేను ఒకణ్ణి కత్తితో పొడిచాను. పోలీసులు వచ్చి అరెస్ట్ చేశారు. జైలులో వేశారు. దానితో జైలునుండి విడుదలకావాలని ఎన్నో ప్రయత్నాలు చేశాను. మంచి ప్లీడరును పెట్టుకొని, కేసును తిరగ దోడించి ఎలాగైతేనేం విడుదలయ్యాను. తెల్లవారి మెలకువ వచ్చింది. లేచి కూర్చుంటే కల గుర్తువచ్చింది. ఆ! నేను కత్తితో పొడవటమేంటి? జైలులో పడటమేంటి? ప్రయత్నాలు చేసి బయటపడటమేంటి? అంతా అబద్ధం అని తేలిపోయింది. ఇప్పుడాలోచిస్తే జైలు - విడుదల రెండూభ్రమే (కలే).

అలాగే భ్రాంతి కారణంగా బంధంలో ఉన్నామనుకొంటున్నాం. మోక్షం కొరకు – విడుదల కొరకు తీవ్రంగా సాధన చెయ్యాలనుకుంటున్నాం. మోక్షం పొందుతామనీ అనుకుంటాం. అయితే ఇదంతా అసత్యమని, రాత్రి కలలాంటిదేనని, అసలు బంధం ఎప్పుడూ లేదని, కనుక మోక్షం అనే ప్రసక్తే లేదని భ్రాంతి తొలగిన తర్వాత –స్వస్థితిలో నిలిచిన తర్వాత తెలుస్తుంది. స్వస్థితిలో నిలిచిన వానికి బంధములేదు. ముక్తిలేదు. పరమ సుఖాన్ని పొందుతాడు.

జీవన్ముక్తుడు విదేహముక్తుడయ్యే స్థితిని వర్ణిస్తున్నారు.

**శ్లో॥ ఆరబ్ధ కర్మణిచ భోగత ఏవనష్టే**
**ప్రాణాదయోపి మమ నోత్క్రమితుం సమర్థాః ।**
**తప్తాగ్ని నిష్ట జతువన్మయి పూర్ణబోధే**
**లీనా భవంతి నపునర్జన నాదికం స్యాత్ ॥ 42**

**ప్రతిపదార్థం :–** ఆరబ్ధ కర్మణిచ = ప్రారబ్ధకర్మలు; భోగతఏవనష్టే = అనుభవించటంతోనే నశించిపోతాయి; మమ ప్రాణాదయో అపి = నా ప్రాణాదులు కూడా; ఉత్క్రమితుం = నిష్క్రమిచటానికి; నసమర్థాః = శక్తిలేని వయిపోతాయి, తప్త అగ్నినిష్ఠ జతువత్ = కాలుతున్న మంటలో ఉంచిన లక్కలాగా; మయిపూర్ణబోధే = నాపూర్ణజ్ఞానంలో; లీనాభవంతి = లీనమైపోతాయి; పునఃజననాదికంనస్యాత్ = తిరిగిజన్మించటం మొ॥వి ఉండవు.

**భావం :–** ప్రారబ్ధ కర్మలు భోగించటంతోనే నశిస్తాయి. నా ప్రాణాలు మొ॥నవి నిష్క్రమించటానికి కూడా శక్తిలేని వవుతాయి. కాలుతున్న మంటలో ఉంచిన లక్కలాగా అవి (ప్రాణాదులు) నా పూర్ణజ్ఞానంలో లీనమై పోతాయి. తిరిగి జన్మ మొదలైనవి ఉండవు.

**వ్యాఖ్య :–** సామాన్యుల యొక్క మరణానికి, మహాత్ముల యొక్క మరణానికి గలతేడాను ఇక్కడ స్పష్టంగా గ్రహించవచ్చు.

సామాన్యులు ప్రారబ్ధ కర్మఫలాలు, వాసనలు తెచ్చుకొని ఈ దేహం ఉన్నంత వరకు వాటిని ఖర్చుచేసుకుంటారు. వాసనల ప్రేరణ వల్ల కర్మలు చేస్తూ; పారబ్ధ

కర్మఫలాలను అనుభవిస్తూ వాటిని ఖర్చుచేసుకుంటారు. అయితే ఈ జన్మలో చేసిన కర్మఫలాలను, వాసనలను అనేక జన్మలలో కూడబెట్టబడి, వెంటతెచ్చుకున్న సంచిత కర్మలతో కలుపుకొని, పెద్ద మూటగా చేసుకొని, ప్రారబ్ధం పూర్తయి పోవటంతోనే ఈ దేహాన్ని వదిలి పోతారు. అదే మరణం. ఈ సమయంలో అతని మనస్సుతో పాటు 5 జ్ఞానేంద్రియాలను తీసుకొని ఈ దేహం నుండి వెళ్ళాలి. అలా వెళ్ళేటప్పుడు మనస్సుతో ఎల్లప్పుడూ కలిసి ఉండే ప్రాణం కూడా కదిలి పోతుంది. అయితే ప్రాణాలు దేహంలో బాగా కలగలసి పోయినందున దేహం నుండి విడిపించుకొని పోవాలంటే వాటికి గొప్పబలం – శక్తి కావాలి. బంక తో అంటించిన కాగితాన్ని తొలగించటానికి ఎలా బలంప్రయోగించాలో అలాగే పెన వేసుకొని ఉన్న పంచప్రాణాలు దేహం నుండి విడిపోవాలంటే కొంత బలం కావాలి. ఈ బలం ఎక్కడి నుండి వస్తుంది? జీవుడు ఆ దేహంలో ఉండి సంపాదించుకున్న కర్మఫలాలు, వాసనలనుండే ప్రాణాలకు ఆశక్తి వస్తుంది. దానితో ప్రాణాలు బలవంతంగా దేహంనుండి నిష్క్రమిస్తాయి. అందుకే మరణం భయంకరం. జీవుడు లక్షతేళ్ళు కుట్టినట్టు యాతన అనుభవిస్తాడు.

ఐతే ఆత్మానుభూతి నొందిన జీవన్ముక్తుని పరిస్థితి ఏమిటి? జీవన్ముక్తుడు జీవభావం నుండి విడుదల పొందిన వాడు, తాను నిత్య, సత్య జ్ఞాన, సుఖస్వరూప ఆత్మననిగ్రహించి నిరంతరం ఆత్మగా ఉండేవాడు. అతడు అనంత కోటి జన్మలలలో సంపాదించి తెచ్చుకున్న సంచిత కర్మలన్నీ జ్ఞానాగ్నిలో దగ్ధమై పోయాయి. ఇక ప్రారబ్ధ కర్మలన్నీ దేహం ఉన్నంతవరకు భోగించటంతో నశించిపోయినవి. ఇక ముక్తుడైన తర్వాత దేహం ద్వారా జరిగిన ఆగామి కర్మలు అతడు ఆత్మగానున్నప్పుడు జరిగినవి గనుక వాటితో ఆతడికి సంబంధంలేదు. ఒకవేళ కర్మఫలాలు ఏవైనా ఉన్నా అవి ఆమహాత్ముని పూజించిన వారికి; ద్వేషించి, బాధ పెట్టినవారికి పోతాయి. ఇప్పుడు అన్ని రకాల కర్మ ఫలాలు వాసనలు పూర్తిగా నశించిపోయినవి గనుక; అతడు దేహం వదలాల్సి వచ్చిన సమయంలో ప్రాణాలు అతడి దేహనుండి బయటకు రావటానికి బలం ఉండదు. ఎందుకంటే ప్రాణాలకు బలం వాసనలు, కర్మఫలాలే గనుక; వాసనలు

కర్మఫలాలు లేవు గనుక; మరో దేహాన్ని వెతుక్కునే పని జీవుడికి లేదు గనుక ప్రాణాలకు శక్తి లేక పూర్ణజ్ఞానంలోలయమై పోతాయి. అంటే తన స్వరూపంలో లయమై పోతాయి. అంటే ప్రాణోత్క్రమణ అనేదే లేదు. కనుక బాధ, యాతన అనేది ఉండదు. మనం చొక్కాను తీసేసినంత తేలికగా దేహాన్ని వదిలి విదేహముక్తుడవుతాడు. ఇక తిరిగి జన్మ అనే ప్రశ్నేలేదు. ఎందుకంటే జన్మకుకారణమైన బీజాలు లేవు గనుక. దీనితో జీవన్ముక్తుడు విదేహముక్తుడయ్యాడు.

మహాత్ముల అనుభూతిని రచయిత తెలియజేస్తున్నాడు.

**శ్లో॥ ఆమ్నాయ మస్తకసు సంస్కృత వైభవో ఽహం**
**వ్యోమ్నోపి పూర్ణ తమమూర్తి రహస్థితో ఽహం ।**
**సర్వాల యోహమహమాద్యవ భాసకో ఽహం**
**వాగాద్య గోచర సదోదిత సౌఖ్య కో ఽహం ॥ 43**

**ప్రతిపదార్థం :-** అహం = నేను; ఆమ్నాయమస్తక = వేదాలయొక్క శిరస్సులైన ఉపనిషత్తులలోని; సుసంస్కృతవైభవః = ఉత్తమ సంస్కృతీ వైభవంగలవాడిని; అహం = నేను; వ్యోమ్నః అపి = ఆకాశం కన్నా; పూర్ణతమమూర్తిః = ఎక్కువ పూర్ణంగా ఉండే; స్థితిరహ = స్థితిలో ఉన్నాను; అహం = నేను; సర్వఆలయః = అన్నింటికి నిలయాన్ని; అహం ఆది అవభాసకః = 'నేను' (అహంకారం) మొ॥నవాటిని వెలిగించేవాడిని; అహం = నేను; వాక్ ఆది అగోచర = నేను వాక్కు మొ॥న వాటికి అగోచరమై; సదా ఉదిత సౌఖ్యకః = నిత్య ఆనంద స్వరూపుణ్ణి.

(1) ఉపనిషత్తులలోని ఉత్తమ సంస్కృతీ వైభవం గలవాణ్ణి. (2) ఆకాశం కన్నపూర్ణమైన వాడిని. (3) అన్నింటికి నిలయాన్నీ. (4) సర్వాన్ని ప్రకాశింపచేసేవాణ్ణి. (5) నిత్యమైన ఆత్మానందంలో సదా రమించేవాణ్ణి.

**భావం :-** నేను ఉపనిషత్తులలోని ఉత్తమ సంస్కృతీ వైభవం గలవాడను. ఆకాశం కన్నా కూడా ఎక్కువ పూర్ణమైన స్థితిగలవాడను నేను. అన్నింటికి నిలయాన్ని నేను. అహంకారం మొ॥న వాటిని వెలగించేవాడిని నేను. వాక్కు మొ॥న వాటికి అగోచరమై ఎల్లప్పుడూ ఉండే ఆనందం గలవాడను.

**వ్యాఖ్య :-** (1) ఉపనిషత్తులన్నీ తేల్చి చెప్పే విషయం ఒకటే. **"బ్రహ్మసత్యం – జగన్మిథ్య – జీవోబ్రహ్మైవ నాపరః"** జగత్తులేనిదే. మిథ్యామాత్రం. పరమాత్మ మాత్రమే అనంత సత్యం. ఆ పరమాత్మ నీవే అని. ఇదే ఉపనిషత్తులలోని ఉత్తమ సంస్కృతీవైభవం. సాధన చేసి, ఆత్మజ్ఞానాన్ని పొంది, తాను సర్వవ్యాపక, స్వయంప్రకాశ, అఖండ ఆనందస్వరూప ఆత్మను అని అనుభవంలో నిల్చిన మహాత్ముడు ఉపనిషత్తులలోని గొప్ప సంస్కృతీ వైభవం గలవాడవుతున్నాడు.

(2) ఆకాశం అనంతమైనది పూర్ణమైనది అన్నింటికి తనలో ఉండటానికి అవకాశం ఇచ్చేదే ఆకాశం. అలాంటి అనంతమైన ఆకాశానికి కూడా అవకాశమిచ్చేది ఆత్మ. ఆత్మ నుండే ఆకాశం వచ్చింది. అంటే ఆకాశం కన్నా పరిపూర్ణమైనది. అందుకే నేను ఆకాశం కన్నా పరిపూర్ణుడైన వాణ్ణి అంటున్నాడు.

(3) అన్నింటికి నిలయం ఆత్మ. పంచభూతాలు ఆత్మలోనే ఉన్నవి. పంచభూతాల సత్వరజో గుణాలనుండి వచ్చిన సమిష్టి సూక్ష్మ శరీరం – 'బ్రహ్మ' ఆత్మలోనే ఉంది. పంచభూతాల తమోగుణాంశ వల్ల పంచీకరణం చెంది స్థూల భూతాలుగా ఏర్పడి, వాటి కలయికతో వచ్చిన ఈ నామ రూప జగత్తు అంతా ఆత్మలోనే కల్పితం. ఈ సమస్త సృష్టిని పోషించే విష్ణువు; లయకర్త శివుడు – అంతా ఆత్మలోనే ఉన్నవి. 7+7=14 లోకాలు, ఈ సమస్త బ్రహ్మాండం అంతా ఆత్మలోనే ఉన్నది. ఇది, అది అననేల? ఆత్మకు అన్యంగా ఏమీ ఉండే అవకాశమే లేదు. **"ఏక మేవా ఽ ద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన"** ఇలా సర్వానికీ నిలయం ఆత్మ. కనుక ఆత్మ స్వరూపుడు అన్నింటికి నిలయమైనవాడు.

(4) అహంకారం మొ॥న అన్నింటిని వెలిగించి చూపేది ఆత్మయే. ఈ ప్రపంచంలో దేన్ని చూడాలన్నా కన్ను ఉండాలి. కేవలం కన్ను ఉంటే చాలునా? చీకటిలో కన్ను దేనినైనా చూడగలగుతుందా? వెలుగు కావాలి. అంటే కంటికి వెలుగు సహాయంగా ఉంటేనే కన్ను చూడగలుగుతుంది. ఆ వెలుగు పగలు సూర్యుడు; రాత్రి చంద్రుడు, దీపం. ఇందులో స్వయం ప్రకాశంగా నిత్యమూ నిరంతరము వెలిగేది సూర్యుడు. అయితే ఆ సూర్యుని ప్రకాశానికి కారణం ఏమిటి? అది ఆత్మయే. కనుక ఆత్మయే అన్నింటిని వెలిగించి చూపేది. ఇక్కడ

దేహంలో కూడా ఇంద్రియాలను, అంతరింద్రియాలైన మనోబుద్ధులు, చిత్త అహంకారాలను కూడా వెలిగించి చూపేది ఆత్మయే. కనుకనే అన్నింటిని వెలిగించే వాణ్ణి నేను అంటున్నారు.

(5) ఇట్టి ఆత్మ ఎలాంటిది? అంటే అది ఆనందస్వరూపం. అఖండ, అనంత ఆనందస్వరూపం.

ఐతే వాక్కుకీ మనస్సుకీ అందనిది ఈ ఆత్మ. ఈ విషయం కేనోపనిషత్తులో కథారూపంలో ఋజువు చేశారు. కర్మేంద్రియాలుగాని, జ్ఞానేంద్రియాలుగాని, మనస్సుగాని ఏదీ ఆత్మను దర్శించలేదు. పరమాత్మమీద నిల్పిన బుద్ధితో, ప్రశాంత మనస్సుతో ధ్యాన పూరిత హృదయంలో మాత్రమే దర్శించవచ్చు అని. కనుకనే 'నేను వాగాది ఇంద్రియాలకు అగోచరమైన ఆనందస్వరూపుణ్ణి' అని ఆత్మనిష్ఠుడు అంటున్నాడు. ఇదే మహాత్ముల నిరంతర అనుభవం. ఇట్టి అనుభవంలో నిలిచేందుకే మానవ జన్మవచ్చింది. సాధిస్తే సార్థకం చేసుకున్నట్టే. ఆత్మసాక్షాత్కారానికై ప్రయత్నించి, సాధనచేసి, అందుకొని మానవజీవితాన్ని సార్థకం చేసుకోగలమని ఆశిస్తూ...

– స్వస్తి –

**( ఈ 'ఆత్మవిద్యావిలాసం' గ్రంథంలోని ముఖ్య విషయాలను గుర్తుంచుకొనుటకు పాటరూపంలో ఇవ్వబడుతున్నది.)**

# ఆత్మవిద్యావిలాసం పాట

(పచ్చని చెట్టు ఒకటి .......... స్టైల్)

చూచే దేహం ఒకటీ

అందులో ఉన్నవి రెండూ

సాధనచేసీ విడగొట్టాలి అందరము ॥చూ॥

(1) సదాశివ బ్రహ్మేంద్రులూ

హాయిగ ఆత్మలో విహరించే

చక్కని గ్రంథమునిచ్చె మనకే సుమా!

రెండిటి తత్త్వము తెలిపీ

ముక్తికి మార్గం చూపే

సాధన చేసీ సాధించాలి మోక్షమును ॥చూ॥

(2) ముక్తికి మార్గం మనకూ

గురుపాదాలే శరణం

పాదములందని మకరందం మనదే సుమా!

ఎన్నోజన్మల పాపం

వాసన మూటలు తొలగే

సేవలు చేసీ సాధించాలీ మోక్షమును

సేవలు చేసీ సాధించాలీ మోక్షమును ॥చూ॥

(3) దుఃఖం తీరే దారేదో

ఉపనిషత్తులు తెలిపేనూ

వేదములన్నీ ఆక్రోశించే మనకోసమూ

కుండలరూపం మట్టే

సృష్టీ రూపం సత్తే

జ్ఞానం వల్లే సాధించాలి మోక్షమును

జ్ఞానం వల్లే సాధించాలి మోక్షమును ॥చూ॥

(4) సమిష్టి వాసనలన్నీ
బ్రహ్మముతో కలగలసీ
ఈశ్వరుడై ఈ సృష్టీ చేసే సుమా!
భూతములైదూ రాగా
అందలి గుణముల నుండీ
జీవుడు జగతీ వచ్చేను చిత్రమయా
జీవుడు జగతీ వచ్చేను చిత్రమయా ॥చూ॥

(5) సకల జగతిని సృష్టించీ
అందులో స్వయముగ చేరే
తన రూపమును తానే మరచేసుమా ।
స్వర్గం కోసం శ్రమనొందీ
దానము యజ్ఞము చేసీ
ఫలితము పోయిన చేరాలి భువిపైకి
ఫలితము పోయిన చేరాలి భువిపైకి ॥చూ॥

(6) శుద్ధ సత్త్వమూ మాయా
మలిన సత్త్వము అజ్ఞానం
దుఃఖాలకు మూలం దేహాదులే
రెండిటి కలయిక వీడూ
సత్యం తెలిసీ మెలగు
చివరకు ఇద్దరు ఒకటౌను ఇది సత్యం
చివరకు ఇద్దరు ఒకటౌను ఇది సత్యం ॥చూ॥

(7) పుణ్యం చేసిన సాధకుడూ
గురువును చేరి వినయంతో
భక్తితో సేవలు చేసీ ప్రశ్నించే
జన్మలు పోయే మార్గం
దుఃఖం తీరే దారీ

తెలుపాలి మీరే గురుదేవా!

తెలుపాలి మీరే గురుదేవా! ॥చూ॥

(8) కదిలే దేహం జడమూ

కదలని ఆత్మా చిత్తేనూ

జడచిత్తులను విడగొట్టీ చూడాలీ

జడమును వెంటనే వీడూ

చిత్తునునేనుగ చూడూ

జడమును వీడి చిత్తుగ ఉంటే ఆనందం

జడమును వీడి చిత్తుగ ఉంటే ఆనందం ॥చూ॥

(9) ఇల్లు లాంటిదే దేహం

జీవుడు ఇందులొ విహరించే

నిత్యం వాడే పనిముట్లే కరణాలూ

మనసూ బుద్ధీ దృశ్యం

అందుకె అంతా జడము

సాక్షిగ ఉండీ సాధించాలి మోక్షమును

సాక్షిగ ఉండీ సాధించాలి మోక్షమును ॥చూ॥

(10) ఉన్నది అంతట నేనే

ప్రాణులు పుట్టీ లయమౌ

నాకన్నా అన్యముగా ఏదీ లేదూ

సంద్రములోనే అలపుట్టీ

సంద్రములోనే కలసే

మథనముచేసీ సాధించాలీ మోక్షమును

మథనముచేసీ సాధించాలీ మోక్షమును ॥చూ॥

(11) సతతము చింతన వల్లా

మనసులో తాపం తొలగూ

వాసనలన్నీ జ్ఞానములో మసికాగా
జగతిలో లేనీ ఆనందం
ఆత్మలో కలదని తెలిసే
జీవించి ఉండగనే సాధించూ
జీవించి ఉండగనే సాధించూ ॥చూ॥

(12) సద్గురు సన్నిధిలోనా
శ్రద్ధతో సాధన చేసీ
బుద్ధిని దాటీ మోక్షమునూ సాధించే
బంధనలన్నీ వదలీ
బ్రహ్మముగా తానుండే
ఓంకార నాదంబు వినిపించే
ఓంకార నాదంబు వినిపించే ॥చూ॥

(13) సాధ్యం కాదని అనుకున్నా
మోక్షమునూ సాధించే
ఎన్నోజన్మల దుఃఖం తొలగే సుమా!
దేహం పులకిస్తుంటే
మాటలు తడబడుతుంటే
ధన్యవాదాలు తెలిపెను గురువునకూ
ధన్యవాదాలు తెలిపెను గురువునకూ ॥చూ॥

(14) ముక్తిని పొందినజ్ఞానీ
దేహంలోనే ఉండీ
జరిగే కర్మను సాక్షిగా చూచేసుమా!
ధ్వనిపై భ్రమలు తొలగినా
ధ్వనులూ వినబడులాగా
దృశ్యం కనబడుచుండేను చిత్రముగా
దృశ్యం కనబడుచుండేను చిత్రముగా ॥చూ॥

(15) లోపల ఉన్నా ప్రాణాలూ
బయటకు వెళ్ళాలంటే
జీవుడిలోని వాసనలా వలనే సుమా!
జ్ఞానికి వాసన క్షయమై
ఆత్మలో ప్రాణం లయమౌ
మంగళకరమైన స్థితియే పూజ్యునిది
మంగళకరమైన స్థితియే పూజ్యునిది ॥చూ॥

**పాటరచన :**

**శ్రీమతి దేవిశెట్టి మాధవి.**